# శాస్త్రవిజ్ఞానం, శాస్త్రీయ సోషలిజం

## (—) గతితర్కం





త్రిపురనేని వెంకటేశ్వరరావు (విజయవాడ)

Tripuraneni Venkateswararao
VIJAYAWADA.

యోచన - యోజన ప్రచురణలు
విజయవాడ - 10.

# ఈ పుస్తకం పుట్టుక....

— కుటుంబరావు

గుడివాడలో హేతువాదుల నిర్వహణలో సభ జరిగి సంవత్సరన్నర పైచిలుకు అయింది. ఆ సభ లేకపోతే యీ పుస్తకంలేదు. అదిలేకపోయినా రావలసిన పుస్తకం యిది. అయితే ఆ సభవల్లనే యిది వచ్చింది.అందులో మార్క్సిజంమీద ఒకరు నవ్యమానవతావాదంమీద ఒకరూ మాట్లాడే సిద్ధాంతపరమైన వేదికంటే విందామని వెళ్ళాం. సభలు తేల్చలేవనీ తెలుసు. అయినా కొత్త అంశాన్నేమైనా చెప్పతారని ఆశించాం. అది జరుగలేదు. ఒకరు (మార్క్సిస్టు) నోటిదురుసుతనం తన స్వభావం క్షమించాలని అంటూ మార్క్సులాగా మాట్లాడాలనుకొని ప్రత్యర్థి వ్రాసిన పుస్తకం వరకే తన విమర్శను పరిమితం చేసుకొని వ్యక్తిగతనిందలు, అపోహలు కలిగించటం మినహా మరొకటిలేదు. వచ్చి కూర్చున్నవారంతా యెవరని? చప్పట్లుకొట్టడం చేతనైనవాళ్ళు, బాగా కొట్టారు. ఇక మానవతావాది వంతు. యీ చప్పట్లుచూసో, ఆరోగ్యం బాగుండకో ఒకటి రెండు విషయాలు మంచివి ఆలోచించవలసినవే యెత్తిచూపినా చప్పట్లు కొట్టేవాళ్ళు అందుకోలేకపోయారు. కాని ఎవరూ తమ తమ సిద్ధాంతాలకు న్యాయం చేయలేదు. సభలో ఓటమిని విజయంగా, భుజాలమీద వేసుకొనిపోయినవాడు మార్క్సిస్టుమ్మన్యుడు మధుసూదనరావు. అందుకు అవకాశం యిచ్చినది సభాధ్యక్షుని నిర్వహణ. మార్క్సిస్టుకిచ్చిన అవకాశాన్ని మానవతావాది వెంకటావు కివ్వలేకపోవటం. రెండవవిశేషం ఇరువురు పెడతాయనుకున్న ప్రశ్నలు మాయంచేయటం. నేను యిచ్చినవి రెండే రెండు ప్రశ్నలు మాయమైనాయ్! ఆ విధంగా మరెన్ని మాయమైనవో అని నేను అను కోవటం తప్పుకాదుగదా! నేను యిచ్చిన ప్రశ్నలు చెప్పతాను. (1) విలువయొక్క శ్రమసిద్ధాంతంపై (Labour theory of value) మార్క్సిస్టు అర్థశాస్త్రకారులే వెలిబుచ్చిన సంశయాలను చెప్పి నివృత్తి చేయాలి. స్టాలిన్ దీన్ని కాదన్నాడని తెలుసుగదా! దానికేమైనా మావోనుండిగాని, మరెవరినుండిగాని సమాధానం వుందా? చైనా, రష్యాల అనుభవం యేమిటి? (2) కాపిటల్‌లో మార్క్సు చెప్పిన పెట్టుబడి స్వభావాన్నిగూర్చి మార్క్సు సూత్రీకరించినదంతా నేటి పెట్టుబడి ప్రవర్తనాధోరణికి

వర్తిస్తున్నదంటే వివరించి చెప్పవలెను యీ ప్రశ్నలు యెగిరిపోవటం ఇరకాటంలో పెట్టటాన్నేనా? చాలప్రశ్నలు తీసివేసినట్లు అధ్యక్షులు తుమ్మల వేణుగోపాలరావు చెప్పారు.చర్చలోస్థాయిలేదు. నిర్వహణలో రీతిలేదు. ఇదేమిటంటే యిదేమిటని నవ్వు కొన్నాం. గుడివాడ కాలేజీ ప్రిన్సిపాల్ డా॥ వై. వెంకటేశ్వరరావు, తుమ్మల చౌదరి అందరం నవ్వుకొన్నాం. దేశంమీద రెండుపక్షాలమధ్య మంచివక్తలని చెప్పే ప్రచారాన్నిబట్టి ఎంతో ఆశించాం సభలో సిద్ధాంతస్థాయి లేదు. చప్పగావుంది.

అందుకే విజయవాడలో యిదే మరోసభ జరపాలనితలంచాం. గుడివాడలోవేదిక మీదనే అడిగాను. అంగీకరించారు. అంగీకరించి తర్వాత ఇద్దరూ వెనక్కుపోయారు. వారుభయులువస్తే యిరుపక్షాలకు మరోయిద్దరి,ముగ్గుర్ని చేర్చి ఏటుకూరిబలరామ్మూర్తి ఈడ్పుగంటి నాగేశ్వరరావు, కడకు టి. వి.నీ సభలో కూర్చోపెట్టాలని, వాగించాలని అనుకొన్నాను. సాధ్యపడకపోయింది. వక్తల అంగీకారం రాకపోవడమే కారణం. ఇద్దరికీ లోలోపల వారిస్థాయి గుర్తున్నదేమో!

నా ఆవేదన నాకుండనే వుంది. వస్తూ వస్తూ టి, వి తో ఈవిషయంకదిపాను. నాకు చదువుకోవటం తెలుసు. ప్రశ్నలు వేయటం తెలుసు. అర్థంచేసుకోవటానికి ప్రయత్నం చేస్తాను. అయితే ఒక క్రమపద్ధతిలో వ్రాత నావల్ల కానిపని ఉత్తరాలు వ్రాయటం, వాటిద్వారా కొన్ని అనుమానాలను నాకు తెలిసినవారినుండి నివృత్తి చేసుకోవటం మామూలు. అయితే యిది శాస్త్ర సామాజిక సైద్ధాంతిక చర్చ. విజ్ఞాన శాస్త్రాలు-సమాజం నడవడి తీరుతెన్నులగూర్చి పరిశీలన, అవగాహన, విజ్ఞాన శాస్త్రాల అభివృద్ధి మానవుని ఆలోచనలను, సమాజ నడవడిని మార్చుతుంది. ఏదీ శాశ్వతంకాదు, మార్పు నిత్యం సత్యంఅన్నట్లు యే సిద్ధాంతమూ సర్వకాల సర్వావస్థలయందు సమస్యల పరిష్కారం చూపలేదు. నూతన విజ్ఞానం వెలుగులో దాని పరిష్కారం జరుగవలసిందే. అందుచేత అంత లోతుకుపోయి తడమలేమోనని భయంవేసింది. టి. వి.ని వ్రాయమన్నాను. ఏమి వ్రాయమంటావ్! యీ తద్దినం నాకెందుకు అన్నాడు. అదికాదండీ మతాన్ని మూఢవిశ్వాసాలను నమ్మకూడదని యెలాచెప్పతామో ఒక సిద్ధాంతం చేతపట్టుకొని అదే శాశ్వతమని దానికి మార్పు చెల్లనేరదని చెప్పే విశ్వాసం (faith) కూడ మంచిదికాదుగదా అన్నాను. అలాగే గతితర్కం అంటే తికమక గందరగోళంగా ఉంటున్నది, మీరెందుకు వ్రాయరు? అది తప్పని ఎప్పట్నుంచో అంటున్నారుగా ... ఆ భావాల్ని మీరెందుకు బయటచెప్పరు?

వూరకే నాతో చెప్పటం దేనికి? వ్రాయండి అంటూ కొంత అధికారికంగానే అన్నాను వున్న స్నేహాన్ని పురస్కరించుకొని. ఆయన అప్రసన్యాసం చేశానని యివన్నీ నాకెందుకు పెడతావని వేదాంతం చెప్పారు. వేదాంతం చెప్పుతూనే వీళ్ళమాటల కేముంది? వాడలా చెప్పాడు. వీడిలా చెప్పాడు అంటూ చెప్పుతుంటే నేను నాకు తోచినరీతిలో మరిన్ని ప్రశ్నలు ఆయన ముందుంచాను. వాటన్నింటికి సమాధానాలు చెప్పాడు. నా తృష్ణ అంతటితో తీరలేదు. 4,5 వారాలు గడిచింది. తరచు ఆయన్ను కలిసే అలవాటుండిగనుక వెళ్ళినప్పుడల్లా ఒక క్రమపద్ధతిలో చర్చలు సాగిస్తూ—ఆ సారాన్ని యింటికివచ్చి నోటుపుస్తకంలో ఎక్కించాను. నా ప్రశ్నలకు ఆయన సమాధానం ఆయనకే సంతృప్తినిచ్చేదికాదనుకొంటాను. ఎప్పుడూ ఏదో కలిపిచెప్పు తూనే వుండేవాడు. అలాంటప్పుడు వెంటనే బయలుదేరి విశాలాంధ్ర ఆఫీసుకెళ్ళి శ్రీ బలరామ్మూర్తిగారినో, నాగేశ్వరరావుగారినో పుస్తకాలు అడగటం, విశాలాంధ్ర పుస్తకాలషాపుకి పోయి పుస్తకాలు చూడటం సాగుతుండేది. పోనీలే ఒక మంచిపనే చేస్తున్నానేమో ననుకొని సంతృప్తి పడేవాడిని. నేను పుస్తకాలు తిరగేస్తూ వుండే వాడిని. అవన్నింటిని దృష్టిలో పెట్టుకొని నా అవగాహన, నా ఆలోచనమేరకు 25,30 పేజీలు వ్రాసి ఒకసారి చూడమని ఆయనముందే వుంచాను. ఏమిటోయ్ గొడవ ఎందుకీ రభస? పో....లేచిపో....ఆ గొడవ నాకు పెట్టకు ... (it is not safe for me) వెంకటేశ్వరరావు సంపాదించాడు. ఇప్పుడు బూర్జువా. మార్క్సిజం తప్పుగా కనిపిస్తుందతనికి, అంటూ నవ్వుతూ వీళ్ళు నా వేమననే తట్టుకోలేకపోయారు.... లోపలికి వెళ్ళిపోయాడు. వేమన గొడవలో వున్న టి. వి.కి నా బాధ తెలియక పోవచ్చు, కొంచెంసేపటికి 'టీ' యిప్పిస్తూ నీకేమైనా పిచ్చిపట్టిందా? ఎవరు తేలుస్తారు అన్నాను. అవునండీ గుడివాడలో సభజరిగిననాటినుండి నాకు పిచ్చేపట్టింది. ఎవరు తేలుస్తారంటారేమిటి? గుడివాడ సభ తర్వాత—వెంకటాద్రి యిచ్చిన కొటేషన్ను, వాటిమీద అతని వ్యాఖ్యానాలనుగూర్చి గుడివాడ ఉపన్యాసం 'టేపు' తెస్తాం....మీరు వాటిమీద అభిప్రాయాన్ని చెప్పాలి అని వచ్చిన ఉత్తరాలకు సమాధానం వ్రాయరా అన్నారు. మీలాంటి వాళ్ళంతా బయటపడి చర్చలు సాగించాలి అన్నాను. యివన్నీ, ఒకనాటిలో తేలేవా? తేలేవీకావు—హుందాగా చర్చను నడపనూలేరు. అవన్నీ మన కేల?—ఆకలి మార్క్సు, సెక్సు—ఫ్రాయిడ్ యీ రెండూ యథార్థాలన్నాడు ఆ రకంగా వాళ్ళు కృషి చేశారు. ప్రపంచంలో నిష్ఠవేశారు. కాదనటమేముంది అన్నాడు. నేనూ కాదనటంలేదు. కోప్పడకండి నేను ఒకరకంగా యీ రోజుకీ కమ్యూనిస్టునే.

మీరు సంపాదించారని అంటే నేను పైసా లేనివాణ్ణే గదా! జీవనసమరంలో మునిగి తేలుతున్నవాణ్ణి. ఆకలవుతుంది. ఆరుగురు ఆడపిల్లల తండ్రిని. ఆరుగురు ఆడ పిల్లల్ని కన్నావ్! నీవేమి కమ్యూనిస్టువోయ్ అనిపించుకున్నవాడ్ని అంటూ యధార్థాన్ని హాస్యంగానే చెపుతూ మార్క్సిజం నాకు మింగుడుపడటంలేదు మరి. దానికి వారుగాని మీరుగాని యేమనగలరు? రాయవలసినవాళ్ళు రాయకపోతే విన వలసినవాళ్ళు వినిపిస్తారు, గుడివాడలో జరిగిందదే. నా యీ తృష్ణను తీరుస్తారని, సమాధానపరుస్తారని సంతృప్తి పొందగలనని వచ్చాను. మీమీదనున్న నమ్మకంతో చనువుతో, ఏమనలేక అక్కడ పెట్టిపో దేవురా! రాత్రికి చూస్తాను. ఎలావుందో చెప్తానన్నాడు పరేమూడోరోజు వెళ్ళాను. అన్నీ ప్రశ్న మార్కులు, ఎర్రగీటులు, అండర్‌లైన్సు, కొట్టివేతలు, చిన్నచిన్న చేర్పులుచేసివుంచారు. వెళ్ళంగానే నాముందు పడేస్తూ చాలటము లేదయ్యా, సైన్సు ప్రస్తావన లేకపోతే-దానిపరిణామము లేకపోతే వైజ్ఞానిక దృక్పథం చూపకపోతే నీవూ వాళ్ళమాదిరి చెప్పటమే గదా! కొంచెముందుకు లోతుకు పోరజాలావ్‌గని.... అన్నారు సైన్సు చెప్పటం ప్రారంభించారు. నేను B.Sc చదివాను అప్పుడు నాబుర్రలో సైన్సు బ్రైటలాజా సైన్సుతోపోలిస్తే చద్దిసైన్సు. మార్క్సు ఎంగెల్సులు చదివి వ్రాసిన దాన్నిబట్టి చూస్తే వారిచదువు ఆ రోజుకే అది పాచి కూడు అన్నాడు. ఈలోపన మరీ పెద్ద పెద్దమాటలంటున్నాడే అనిపించింది. అయితే సైన్సు జనరల్‌గా Science & culture, Science and Society, The Impact of Science on Society, Man and Cosmos యిలా కొన్ని పుస్తకాలు చదివాను. కాని అంతలోతులు తెలియవుగదా. అవన్నీ ఆయన చెప్పటం ప్రారంభిస్తే అవన్నీ చేర్చి రెండోసారి మరో నెలరోజుల్లో ఆయన ముందుంచాను. అది తీసి బజారులోకి విసిరేశారు. మరో సందర్భం అయితే ఆయన గుమ్మం తొక్కనేమో. నవ్వుతూ (బాధను దిగమింగుకొంటూ) యీ ఒక్కసారి చూడమన్నాను. ఇదేమి గొడవయ్యా! ఎంత చెప్పినా వినవు. తీగలాగితే డొంకంతా కదిలినట్లు, వ్రాయాలంటే ఎంత చదవాలో, ఎంత ఆలోచించాలో తెలుసా? మజానా యేమిటి? అన్నారు. ఏమీవద్దండీ. మీరు దిద్దినవి వున్నదిగదా దాన్ని యథాతథంగా ప్రచురిస్తాను. ప్రెస్సుకూడ మాట్లాడుకొచ్చాను. తరువాత వచ్చే విమర్శలకు మీరే సమాధానం వ్రాయవచ్చు అన్నాను. కొంచెం black mail చేస్తున్నట్టుగా ఉన్నాను ఆయన్ను యిరకాటంలో పెట్టటానికి cool గా అన్నాను. నాకు సైతాన్‌లాగా దాపురించావేమయ్యా అన్నారు. నేను లేచి వెళ్ళాను.

మరుసటి రోజు యింటికి ఫోను చేశారు. నేను వ్రాయటం సాధ్యపడదు. నీవే మిణుక్కో. సరే, అయితే కొన్ని పుస్తకాలు కావాలి, తెచ్చిపెట్టు అన్నారు. వెంటనే 15 లేక 20 పుస్తకాలు సైకిల్‌మీద పెట్టుకొని వెళ్ళి యిచ్చి వచ్చాను. పదిరోజులు అటుకై చూడలేదు. తరువాత ఒక రోజు ఉదయం 6. 30 గం.లకు ఫోను. వెంకటేశ్వరరావు మామయ్యగారి ఫోను అని మా అమ్మాయి చెప్పింది. ఏమండీ అంటే ఒక్కసారి రమ్మన్నారు, వెళ్ళాను. ఇంత ప్రయాస పడుతున్నావు. ఇంతపాటి సేకరించగలవని నేననుకోలేదు. నీవే వ్రాసుకో అయితే logical content తగ్గుతోందన్నారు. మీరే వ్రాయండి. నిజంగా ప్రేస్పు మాట్లాడాను. వెళ్ళి ఉడగండి అన్నారు.

నా పోరు పడలేక, నా రొదవినలేక వ్రాయటం ప్రారంభించారు. ఆయన కృషి సాగింది. తర్జన భర్జనలు. దురదగొండి ఆకు అంటించావ్. పీక్కోలేక చస్తున్నాను అన్నారు. అది మీలోనున్న జిజ్ఞాసే దురదగొండి అన్నాను హాస్యంగా, సర్దాగా, తృప్తిగా. వ్రాసి వ్రాతప్రతితో మళ్ళీ గుడివాడవెళ్ళి శ్రీ యెర్నేని వెంకటేశ్వరరావుతో ఒకరోజు కూర్చొని వారి యింట భోజనంచేసి చర్చలు లయోలా కళాశాలలో గణిత శాస్త్ర ఉపన్యాసకులైన శివనారాయణగారితో చర్చలు. ఒరంగల్ రీజినల్ ఇంజనీరింగ్ కాలేజీ ప్రొఫెసర్, డాక్టరు వి. వెంకటేశ్వరరావుతో చర్చించేదానికి బయలుదేరుతుండగా అడబోయిన తీర్థం యెదురయినట్లు ఆయనే యిక్కడకు అటువంటి చర్చకే రావటంతో ఈ చర్చసాగింది. వ్రాతప్రతులువెంట తీసుకువెళ్ళి జాగ్రత్తగా పరిశీలించి ఏకీభావం తెలిపాడు ఆ ఉత్తరంకూడ యిందులో ప్రచురిస్తున్నాం.

ప్రకృతి శాస్త్రవిజ్ఞానము పరిమితమైందికాదు. అది ప్రోదిచేసుకొనేది. ఒకరి నుండి ఒకరికి అందజేయబడేది. పరిశీలనతో, ఆలోచనతో మెరుగులుదిద్దుకొంటాం. పాత వాటి పరిమితులు విశదమవుతాయి. కొత్తవాటిని చేర్చుకొంటాం. ఆ మార్పు న్యూటన్ నాటినుండి ఐనిస్టీన్ వరకు పరిశీలిస్తే కావలసినంత దొరకుతుంది. ఐనిస్టీన్‌కి సయితం సవరణలు బయలు దేరాయిగదా—మరి యీ శాస్త్రజ్ఞానపరిధిలో మార్క్సిజం కానీయండి, మానవతావాదం కానీయండి మారవలసిన అవసరం లేదా? అది అంతే అనడం వారి మాటల్లో పిడివాదమేనేమో. ఆలాగే కమ్యూనిజం అనే మార్క్సిజంలో మౌలికంగా తప్పే లేక పోతే ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం యిన్ని గ్రూపులు, యిన్ని వైరుధ్యాలు, వైషమ్యాల మధ్య జీవించవలసిన అవసరం ఉండదే! మార్క్సిజంమీద నూతన జ్ఞాన ప్రభావం యెంతమేరపడుతోందనేది తేల్చాలి. ఆ ప్రయత్నం చేయాలి రివిజనిస్టులు, రెనెగేడ్లు, పరికిపందలు అనటం విజ్ఞతకాదు. అలా తేరిపారజూస్తే జాతీయ కమ్యూనిజమే కానవస్తోంది. అంతర్జాతీయతేలేదు.

అలాగే మా సిద్ధాంతంప్రకారమే ప్రపంచం నడుస్తోందని చెప్పడానికి మరి యెవరు సాహసించినా తప్పే.

డార్విన్ జీవపరిణామంచెప్పాడు. మార్క్సు మానవసమాజపరిణామసూత్రాన్ని కనుగొనిచెప్పాడని పోలికపెట్టి, మార్క్సు, డార్విన్ ఆఫ్ సోషల్ సైన్సెస్ అని వ్రాశాడు ఎంగెల్సు. మార్క్సుని శాస్త్రకారునిచేస్తూ పదేపదే వ్రాశాడు. అలాగని ఉపన్యసించాడు. కాని మార్క్సు ఎంగెల్సులు డార్విన్‌తో విభేదం చెప్పజూశారు. లామార్కిజంవైపు మొగ్గారు. సోవియట్‌వారు లైసెంకోతో లామార్క్సిజాన్నే తల మీద పెట్టుకొన్నారు. పాపం లామార్క్సిజం తప్పై డార్వినిజం నిజమై నిలబడింది. నిజంగా మనం శాస్త్రీయదృక్పథాన్ని (Scientific spirit) జీర్ణం చేసుకొంటే డార్వి నిజాన్ని వెనక్కిపెట్టి, లామార్క్సిజాన్ని స్వీకరించినట్టే మార్క్సిజాన్ని కాదన గలిగేస్థితికి యెదగలేకపోతే సైన్సును గూర్చి మాట్లాడే అర్హత మనకు లేదేమోనని గ్రహించగలగటం మంచిది.

బహుశా యింటా బయటా ఎక్కడ చూచినా మొత్తంమీద ఆంధ్రలో సైన్సే మార్క్సిజము-మార్క్సిజమే సైన్సుఅని రేం బవళ్ళు రావ కోటి వ్రాసి ఘోషించే వాళ్ళుసైన్సుతో సంబంధంలేనివాళ్ళేనేమో. విజ్ఞానశాస్త్రస్పర్శలేనిచరిత్ర మాస్టర్లు,రాజకీయ శాస్త్రబోధకులు, వాణిజ్యశాస్త్ర ఉపన్యాసకులు, తెలుగు పంతుళ్ళు, గేయకారులు శాస్త్రీయదృష్టి, శాస్త్రీయవిద్యావిధానం అని చెపుతోంటే. వీరుశాస్త్ర జ్ఞానాన్ని జీర్ణంచేసు కొనిచెపుతున్నారని అనుకొంటే భ్రమఅవుతుంది. నేనుకూడ వారితోపాటే అలాగే నేటి పారిశ్రామికుణ్ణి చదువులేని పాతకాలపులాభాన్వేషకుణ్ణిగా చూడటం మాట్లాడటంకూడా ఒకఆత్మవంచన. యుగలక్షణం మారింది. పారిశ్రామికుని స్థాయి మారింది వైజ్ఞానిక, సాంకేతిక వైదుష్యం లేకుండా యీనాడు పారిశ్రామికుడుగా నిలబడలేడు. ఈనాడు పారిశ్రామికుడు వైజ్ఞానిక శాస్త్రం - సాంకేతిక శాస్త్రాల గూర్చి వస్తున్న మార్పులు రాబోయేమార్పులగూర్చి పరిశీలించి అవగాహనలోకితీసుకొనిపనిచేస్తున్నాడు,మాట్లాడు తున్నాడు. బుద్ధిజీవులుగా నిలబడగలుగుతున్నాడు. కాపిటలిస్ట్ మారాడు. మార్క్సిస్టు మారలేదు, మార్క్సిస్టు సైన్సుకి దూరమవుతున్నాడు. సమాజ సత్యానికి దూరమవు తున్నాడు. వాస్తవ పరిస్థితులను శాస్త్రీయదృక్పథంతో చూడలేకపోతున్నాడు. పాతపడికట్టు పదాలనే వల్లిస్తున్నాడు. మారుతున్న పరిస్థితిని గమనంలోకి తీసుకోవటములేదు. అందరమూ మారాలి. స్థాపించిన సోషలిజమే మార్పులకులోనై పోతోంది. మార్క్సు జోస్యాలకు దూరంగా జరుగుతోంది నేడు జరుగుతున్న సాంకేతిక పరమైన మార్పులు మార్క్సు వూహకి అందే అవకాశం లేదు. యీ సత్యాన్ని విస్మరించకూడదు. ఇక్కడ నవ్యమానవతా వాదులకుకూడ ఈ మాట వర్తిస్తుంది అయితే

యిది యం.యన్. రాయ్‌కి తెలుసు. అతని గ్రహణలోకి వచ్చింది అతను సైన్సుని సాంకేతిక జ్ఞానాన్నిగూర్చి అనేక వ్యాసాలు వ్రాశాడు. అతను చచ్చిపోయి30 సం॥లు అవుతోంది. అందువల్ల రాయ్‌తోనే గాకుండా నేటి శాస్త్రాన్ని యెంతగాఅర్థం చేసుకొన్నారో ప్రచారం చేస్తున్నారో తెలియాలి. ఎవరూ మనస్సుని మూసుకో గూడదు. తెరవాలి. అందుకే యీ ప్రయత్నం.

ఎవ్వనుకొన్నా, ఎవరేమనుకొన్నా వైజ్ఞానిక శాస్త్రాల పరిధులు చూడాలి. గుడివాడ సభ జరిగిన తరువాత ఒక మంచి ఆరోగ్యకరమైన చర్చావేదికను యేర్పాటు చేసి వివిధ దృక్పథాలు, ఆలోచనలు, రీతులు బయటకు తేవాలనేదే ప్రయత్నం. మధుసూదనరావు దురుసుతనమూవద్దు, వెంకటాద్రి బెరుకుతనమూవద్దు. వైజ్ఞానిక శాస్త్రాలు, సాంకేతిక శాస్త్రాలు-మానవుడు అన్న అంశంపై సుదీర్ఘమైన చర్చరావా లనేది ముఖ్యోద్దేశం. తొలిమెట్టుగా యీ పుస్తకం. మరిన్ని మలిమెట్లురావాలి. ఒకదాని కొకటి విజ్ఞాన దోహదంగా కన్పించాలి. నా ప్రస్తావన ప్రక్క పెడితే- తీరికలేదు, ఆసక్తిలేదు, నాకు మంచిదికాదు అన్న వెంకటేశ్వరరావుని కదలిం చాను. 30 సం॥ల నాడు ఒక బాధ్యతగల కమ్యూనిస్టుగా భారతతత్వశాస్త్ర పరిశీలన అనే గ్రంధాన్ని వ్రాసిన టి. వి. చేత 30 సం॥ములతర్వాత మార్క్సిజంపై శాస్త్రపరి జ్ఞానంతో శాస్త్రదృక్పథంతో కొత్త ఆలోచనలను రేకెత్తించే పుస్తకం వ్రాయించడం నా ప్రత్యేకత. అందుకె గర్వపడతాను. దీనిని ఆధారంగా తీసుకొని చర్చలు కొనసాగించమని కోరుతున్నాను. ఆ చర్చలు, ఆ పుస్తకాలు ఒక స్వంత విలువను సృష్టించుకో గలిగితే, యింగ్లీషులోకి సయితం అనువదించి ముద్రించాలని వుంది. నాగార్జున యూనివర్శిటీలో మార్క్సిస్టు అధ్యయన పీఠం ఏర్పాటు చేశారు. వారుకూడా యీ చర్చలో పాల్గొనాలి యీ చర్చకు వారి దోహదమేమిటో చూడ వలసి వుంది. అందుకు అందరూ సహకరించాలి. ఆరోగ్యకరమైన, ఆలోచనా పూర్వకమైన చర్చగా తీర్చిదిద్దాలి అట్టి మిత్రులందరికీ హృదయపూర్వకమైన ఆహ్వానము. నా యీ కోర్కెను పండిస్తారని మనసారా కాంక్షిస్తున్నాను.

మే మనుకోని విషయం మార్క్సుశత జయంతి సంవత్సరం ప్రపంచమంతా వేడుకలు జరుగుతున్నాయి. అందువల్ల కోపకారణ మవుతుందేమో కాని ఇటువంటి చర్చే ఆ శతజయంతిని సార్థకం చేస్తుంది. అదే ఆశిస్తాను.

---

మిత్రా

కోనేరు కుటుంబరావు

# లోలోపలి నా ఆలోచనలు

చాలకాలంగా వ్రాయకుండా తప్పించుకొంటున్న విషయమిది. కాని చాల కాలంగా మిత్రులతో అంటున్న విషయమే. నేనుగా వ్రాయబోదనుకొన్న విషయాన్ని కుటుంబరావు బలాత్కారం బహుభంగులుగా సాగి వ్రాయించింది.

రెండున్నరేండ్ల క్రింద, 1981 ఫిబ్రవరిలో 'మీరు చారిత్రక భౌతికవాదం శాస్త్రీయమైనవాదం కాదని భావిస్తున్నట్టు (చలసాని) ప్రసాదు అన్నాడు నిజమేనా' అని F.N. నన్నడిగిన తిరుపతివుత్తరం అచ్చుకెక్కింది గాని అతనితో గతితర్కాన్ని గూర్చేఅటువంటి మాట అన్నానని వ్రాసిన జవాబు అచ్చుచూడలేదు. చా భౌ. వాదం ఒక అర్ధసత్యం కావచ్చుగాని దానిలో ప్రయోజనకరమైన కొన్ని సత్యాంశకలాలున్నవిగా గతితర్కం బొత్తిగా నిరర్ధకమయిందని భావించాను.

నూటెనభై యేండ్లవయస్సు నిండి, వరుసగా ఫ్యూడల్, బూర్జువా, కార్మికవర్గ ప్రభుత్వాల యూనివర్సిటీల అధికారాధికారి కాదరణ పోషణలు పొందినప్పటికీ విజ్ఞానశాస్త్రాభ్యుదయంలో గతితర్కం అనావశ్యక పదార్ధంగా ఉండిపోయింది. అదే ప్రయోజనకరమైనదైతే వాడుకోరాని వస్తువుగా బూర్జువాజీ దాన్ని అవతలబెట్టేసి వుండదనుకొనేవాణ్ణి.

పైగా, ఆర్ధికోపాధ్యాయుడైన డూరింగుని ఖండించినట్టుగా, తార్కికులు తాత్వికులు గతితర్కాన్ని తర్కంగా ఖండిస్తే మార్క్సెంగెల్సులు మిన్నకోవడం కనిపించింది. సైన్సు యొక్క సాంఘిక పర్యవసానాలకు శాస్త్రకారుల వక్రభాష్యాలకు సమాధానం శాస్త్రపరిషత్తులోకి వచ్చి చదువుతానని తెలిపి, వెళ్ళకపోవడం అలాంటిదేదీ వ్రాయకపోవడం ఏమిటాయని అనుమానించేవాణ్ణి.

ఎంగెల్సు Dialectics of Nature వ్రాతప్రతి చూచి అచ్చువేయదగిందో కాదో చెప్పమంటే చదివి ఏమీచెప్పకుండా ఐనిస్టీన్ మూగగా తిరిగి ఇచ్చేసినట్టు చదివిన మాటగుర్తువచ్చేది, సామాజిక విప్లవకారులైన మార్క్సెంగెల్సు లెనిన్లు విజ్ఞానశాస్త్ర చర్చలదాకారావడం ఒక విశేషంగా చూడవలసివుందేతప్ప, వారి చర్చలు గాఢమైన శాస్త్ర విజ్ఞానాన్ని పురస్కరించుకొన్నవిగాక పోయి శాస్త్రకారులకు, శాస్త్రవిద్యార్ధులకు మంచివినోదం కల్పించేవవుతాయనుకొన్నాను.వీరుAtom has no properties, no needs, it is self - sufficient అనే పరిజ్ఞానంతో ప్రత్యర్ధినెదుర్కొంటేనూ, 2nd law of thermodynamics గూర్చి ఆక్రోశిస్తేనూ, ఈథరు ఎలెక్ట్రాన్లను పూర్వ దశ అవి ప్రతిపాదిస్తేనూ వినోదంగానే వుంటుందిగదా!

ఈ స్థాయి విజ్ఞానానికి గతితర్కం తోడయ్యేసరికి, మార్క్సిజం ఈ శతాబ్దపు సైన్సుకు దూరంగా వుండిపోయింది రెలిటివిటీ, క్వాంటం సిద్ధాంతాలను శపిస్తూ కూర్చుంది. కోపెన్ హెగన్ స్కూలుమీద జడనోవ్ ఏమన్నాడో అన్నాడు. గతితర్కానికి బద్ధులై రష్యన్లు కొంతకాలం కంప్యూటర్ల జోలికి వెళ్ళలేదు కాని రక్షణావసరాలు ఆ అంటును మాన్పించాయి ఇక గతితర్కాన్ని ఆదివారపు ప్రార్థనకు కేటాయించుకొని, సోమాది శనివారాంతమూ Formal Logic ఐన గణిత తర్క వినియోగ ప్రయోగ కర్మయోగం చేస్తూ రష్యన్లు నిలదొక్కుకొంటున్నారు. జీవిత యథార్థాన్ని పాటిస్తున్నారు. అందుకుగాను మతాల త్రోవలో భాష్య ప్రక్రియా ప్రయోగ కౌశలం వెలయించి పాత పిడివాదపు పిడికిలి పట్టును క్రమంగా సడలించు తున్నారు. అందుకు మాత్రం వారు అభినందనీయులు.

Materialism & Empirio-Criticism అనే లెనిన్ గ్రంథ సప్తతి సందర్భంగా 1978 లో ప్రాగ్ దగ్గర లిబ్లిసీలో గతి తార్కిక భౌతికవాదం—ఆధునిక విజ్ఞాన శాస్త్రాలు అనే పేరుతో అంతర్జాతీయ సిద్ధాంతగోష్ఠి ఒకటి జరిపారు ఆ గోష్ఠి అంత్యోపన్యాసంలో డిమిత్రీబెలియేవ్, ఫెడోసియేవ్‌లు అనే రష్యన్ సిద్ధాంతకారుల ప్రకటన గతితర్కం యొక్క వైఫల్యాన్నే చాటుతున్నది.

"I fully agree with Academician Fedoseyev that the management of scientific Creativity is simply impossible." అది మరేవిధంగా ప్రయోజనకారో కూడా ఆ సభ తేల్చలేదు సైన్సు ఫలితాలు గతితర్కానుగుణంగా వున్నవనటం వినా గతితర్కం సైన్సుకు ఎలా ఉపకరించిందో ఉదాహరించలేక పోయింది గోష్ఠి.

నా ఔత్సాహిక విజ్ఞానం మీద నాకు నమ్మకం చాలక నా బాల్యమిత్రులు ప్రౌఢమిత్రులు అయిన ఉలవ, ఎర్నేని వెంకటేశ్వర్రావుగార్ల ఆధికారిక విజ్ఞానశాస్త్ర వైదుష్యంనుంచి ధ్రువీకరణను ఆశించాను. వారు వ్రాతప్రతిలోనే చదివి, చర్చచేసి బాగా తోడ్పడ్డారు. వారికి నా కృతజ్ఞత.

కుటుంబరావు బలాత్కారమే లేకపోతే యీ రచనలేదు. ఈ విషయంలో పిరికిగా సైడుకర్టెన్లో దాగివున్న నన్ను స్టేజిమీదికి త్రోశాడు. రచ్చకెక్కించాడు. ఇది నాకు నష్టం కలిగిస్తుంది చాలమందికి చాలాకష్టం కలిగిస్తుంది. పగే ప్రతిఫలం కావచ్చు. ఏంచెయ్యను? గతితర్కం చాలా వ్యర్థపదార్థమనిపించింది. కాదంటే వింటాను. ఒప్పిస్తే సరే —

త్రిపురనేని వెంకటేశ్వరరావు

విజయవాడ—10.

# కొన్ని పెద్ద తప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 18 | పరిణామ | పరిమాణ |
| 6 | 21 | గుణపరిణామసూత్ర | గుణపరిమాణసూత్ర |
| 8 | 28 | పేరొక్కపే | పేరిచే |
| 15 | 4 | విజయాలను | విజయాలకన్నా |
| 16 | 19 | రియాక్సిరిబోనూక్లియిక్ | డియాక్సిరైబోనూక్లియిక్ |
| 18 | 2 | స్థితితర్కం | స్థితితర్కమని |
| 20 | 2 | సరిగా అచ్చుపడలేదు. | As a whole, a distinct science |
| 21 | 8 | logic methods | logical methods |
| 23 | 12 | sound of them | some of them |
| 25 | 11 | its concept the only | its refusal to accept the only |
| 26 | 8 | రాస్తున్నాడు | రాస్తున్నారు |
| 26 | 13 | ఆయన వితకథలు | ఆయన జీవిత కథలు |
| 27 | కడపంక్తి | వాళ్ళపట్టికలో | పట్టికలో |
| 31 | 18 | పదార్థకణ | విద్యుత్ కణ |
| 32 | 8 | it if | if it |
| 40 | 12 | inductive Newton | inductive ass Newton |
| 40 | 17 | పదను తేవి | పదను తేరి |
| 40 | 21 | చెప్పేవాడేగాని | చెప్పడమేగాని |
| 40 | 27 | శామేత | శామ్యేలు |
| 41 | 20 | Withelm | Wilhelm |
| 42 | 25 | గతితర్కమే గతితర్కపై | గతితంర్కమే గతతర్కపై |
| 43 | 8 | పెంపకు | పెంపుదలకు |
| 43 | 24 | ఉదాహరణకు | ఉదాహరణలు |
| 45 | 18 | యత్నించాడన్న మాట | మార్క్స్ యత్నించాడన్న మాట |
| 48 | 23 | పేర్కొన్నాడు | పేర్కొన్నది |
| 52 | 10 | సరిగా అచ్చు పడలేదు | inexhaustible as atom |
| 52 | 10 | దీయలీజెన్ | దీయెత్ జెన్ |
| 52 | 13 | పొడిగించి పైవాక్యాన్ని | పొడిగించి లెనిన్ పై వాక్యాన్ని |
| 52 | 22 | అదికూడా | అదియాంత్రిక |
| 54 | 21 | lurge logic | large logic |
| 76 | 16 | everywhere by not | eveywhere whereby by not |
| 79 | కడపంక్తి | 1383 | 1838 |
| 85 | 31 | నూట నలభై | నూట ఎనభై |
| 88 | 9 | గమనించిన | గమనించి |
| పీఠిక పేజీ 8 | | మిన్నకుండటం | ఖండించక పోవడం. |

హెగెల్ చెప్పిన ఆ త్రికసూత్రాన్ని మార్క్స్, మార్క్సిజమూ ఏనాడూ ఆమోదించియుండలేదని, నెగేషన్ ఆఫ్ ది నెగేషన్ సూత్రమన్నది మార్క్సిస్టు గతితర్కంలో పరిమితాన్వర్తనం కలిగిందేమైనా కావాలిగాని, సార్వత్రిక సూత్ర ప్రతిపత్తిని పొందినట్టిది కానేకాదని— ఇక గతితర్కం అంటే సైన్సు ఆఫ్ ఇంటర్ కనెక్షన్స్—అంతస్సంబంధాల శాస్త్రంఅనీ, విశ్వంలోని ప్రతివస్తువునీ ఘటననీ మరి అనేకానేక వస్తువులతో ఘటనలతో ఇంటర్‌రిలేటెడ్, ఇంటర్ కనెక్టెడ్ ప్రోసెస్‌గా పరస్పరానుబద్ధమూ, పరస్పరాధారితమూ అయిన క్రమంగా చూడమని చెప్పేది మాత్రమేనని ఎంగెల్సునుంచి ఒక ముక్తాయింపును చూపించి గతితర్కం యొక్క సమగ్రతను సమర్థంగా నిర్వహించనారంభ్యారు మార్క్సువాది.

సభలోవాళ్ళు వాళ్ళను చప్పట్లుకొట్టారు. చప్పట్లు కొట్టలేకపోయిన మాతో మరి కొందరు గురివాద మిత్రులు జతపడ్డారు. వైరుధ్యసూత్రం మాటెత్తకుండానే గతితర్కాన్ని వ్యాఖ్యానించేసరికి ముఖముఖాలు చూసుకొన్నాం. అభావాభావసూత్రాన్ని ఎంగెల్సే ఒ ప్రధాన సూత్రమన్నాడని మార్క్సువాదినోట వినవలసివచ్చిన మా దురదృష్టాన్ని, మార్క్సిజం దురవస్థని తలచుకొన్నాం. అక్కడికీ గాదా చప్పట్లుకొట్టిన సభను చిలువగట్టలేకపోయాం.

త్రికవాదని, అభావాభావాన్ని మార్క్సిజం అంగీకరించలేదు. అప్రధానీకరించి చెప్పింది అని నొక్కి వక్కాణించినదానిపై అసలివి నిజాలుకావు. తప్పుడు సూత్రీకరణలు అని సప్రమాణపూర్వకంగా ఖండనను చేసిచూపించిన మార్క్సువాది ప్రస్తావించినట్టుగా ఉన్నవని, అసలివి తప్పులుకాబట్టే హెగెల్‌నుంచి వాటిని మార్క్సిజంలోకి తీసుకోకుండా వదిలేశారని, హెగెలీయ గతితర్కానికి మార్క్సీయ గతితర్కానికి తేడా వేరనుకొంటున్నందున—ఇదిగో యిక్కడ తేడావుంది చూడండని వివరించినట్టయిందని మాకు స్ఫురించింది. త్రికము, అభావాభావము తప్పనడంతో ఖండించని మార్క్సువాది అంతసేపు ఏమిచెప్పినట్టు? ఇంతకూ సభలో వివాదాంశం ఏమని తేలినట్టు? అని విశ్లేషించుకొంటే యీ రెండు తప్పుసూత్రాలు మార్క్సిజంలో వున్నాయంటే వున్నాయని ఒకరు, లేవంటే లేవని ఒకరు ఘర్షించి పరువుల జోలికి వెళ్ళారని స్పష్టపడింది. ఇదేమీ సభకు అర్థమైనట్టులేదు.

అయితే పులిమీద పుట్రొకటి వచ్చిపడినట్లుగా చర్చ మధ్యలో పాల్గొనబడే సరికి డైలెక్టిక్సును గూర్చి మావో వాక్యాన్నొకదాన్ని ఒకపుస్తకం (**Mao Unrehearsed**) విప్పి చదివి వినిపించారు, మానవతావాది. మావో తన విమర్శతో ఏకీభవించాడన్నట్టు, ప్రవచిస్తున్నాడన్నట్టుగాను ఆ వాక్యం వుంది.

చీనీయుడు మావో 1960 లో అన్నది :

"Engels talks about the three categories but as for me I do'nt believe in two of those categories. The juxta position, on the same level, of the transformation of quantity and quality into one another, the negation of the negation and the law of the unity of the opposites is triplism, not monism. The most basic thing is the unity of opposites. The transformation of quantity and quality, into one another is the unity of the opposites, quantity and quality. There is no such thing as the negation of negation. Affirmation, negation - affirmation, negation ...... is the development of things. Everylink in the chain of events is both affirmation and negation. Socialism too will be eliminated, it would not do if it were not eliminated for then there would be no communism .... we say that the end of mankind is something which will produce something more advanced than mankind."

## ఎంగెల్సులో లెనిన్ చూపిన లోపం :

వీటిని కాస్త శ్రద్ధగా చూచేసరికి తీగలాగితే డొంక కదలినంత పనయింది. ఎంగెల్సు మావోల మధ్య లెనిన్ ఏమీ అనకుండా వూరుకొన్నాడా అనే ప్రశ్న కలిగింది. గుర్తురాకే వుంటుంది: ఎంగెల్సు, ప్లెఖనోవ్ లిద్దరినీ తప్పుపట్టి ఎంగెల్సు తప్పును క్షమించ దగ్గదని దానికొక కారణం చెప్పి, ప్లెఖనోవ్ తప్పు మాత్రం అతని అవగాహనలోని తప్పని విడదీసిన వృత్తాంతం గుర్తువస్తుంది. 'ఆన్ డైలెక్టిక్స్' అన్న చిన్న భాగం ఒకటి ఫిలసాఫికల్ నోట్‌బుక్సునుంచి యెంచి అచ్చువేసిన పుస్తకం తెరచిచూస్తే,

"The division of the one and the cognition of its contradictory parts (see the quotation from philosophy on Heraclitus at the beginning of the section III on COGNITION in Lassalle's book on Heraclitus) is the essence of dialectics .... . This side of dialictics as a rule receives inadequate attention (e. g. Plekhanov) the identity of opposites is taken as the sum total of examples (for example, a seed, for example, primitive communism. The same is true of Engels. But with him, it is in the interests of popularisation)" and not as a law of knowledge (and as a law of objective world) ........

The condition for the knowledge of all processes of the world in their self movement....is the knowledge of them as a unity of opposites. Development is the struggle of opposites ...The unity of opposites is conditional, temporary, transitary, relative The struggle of mutually exclusive opposites is absolute, just as development and motion and absolute ...

Dialectics is the theory of knowiedge of (Hegel and)Marx. This is the side of the matter (it is not a side but the essence of the matter) to which Plekhanov, not to speak of other Marxicts, paid no attention. (1915)

ఎంగెల్సు మూడు సూత్రాలూ చెప్పాడు. ఆ మూడింటినీ హెగెలే మొదట చూపు, పెంపొందించాడు అన్నాడు. వాటిని హెగెల్ యిచ్చిన క్రమంలోనే యిచ్చాడు. గుణపరిమాణాల పరస్పర పరివర్తనే మొదటిసూత్రంగా యిచ్చాడు. వైరుధ్యాల మైత్రి, మేళన అనటం కన్నా వైరుధ్యాల పరస్పరాంతర్భావం [mutual inter-penetration of opposites] గా చెప్పాడు. ఇదే అత్యంత ప్రధానమైన సూత్రాన్నే అభావా భావ సూత్రం మాత్రం సిద్ధాంతం యొక్క పూర్ణవ్యవస్థా నిర్మాణానికి మూలకంఠమైన సూత్రంగా హెగెల్ రచనలో ప్రాధాన్యం కలిగి వుందని చెప్పాడు. గుణ పరిమాణ పరస్పర పరివర్తనా సూత్రం ప్రాధాన్యం గూర్చి ప్రత్యేకమైన మాట యేమీ వ్రాయలేదు. ఇదీ ఎంగెల్సు హెగీలియన్ డైలెక్టిక్సు చిత్రం. యాంటీడూరింగ్ (1877)లోనైనా ఎంగెల్సు యిచ్చిన డైలెక్టిక్సు చిత్రం యిదే. గుణపరిమాణ సూత్రం, అభావా భావసూత్రం గూర్చి శీర్షికలుంచి ప్రత్యేకాధ్యాయాలు వ్రాశాడు గాని, వైరుధ్య సూత్రం గూర్చి ప్రత్యేక ప్రకరణం అంటూ వ్రాయలేదు. అయితే దాన్ని గూర్చి వదలివేయలేదు. గుణపరిమాణ సూత్ర అధ్యాయంలోనే ముందుగా దాన్ని గూర్చిచెప్పాడు.

## లాసెల్లీ ప్రభావంలో లెనిన్ సృజనాత్మకత

లెనిన్ హెగెల్ రచనలు కొన్నింటిని, హెగెల్‌పై మరికొందరి రచనలను గతి తర్కానికి ఆదిపురుషుడైన గ్రీసు హిరాక్లిటస్ మీద లాసెల్లే రచనను 1914, 1915 సంవత్సరాల్లో ప్రత్యేకంగా చదివి నోట్సురాసి పెట్టుకొన్నాడు. ఆ అధ్యయన ఫలంగా on [the question of] Dialectics అన్న చిన్న రచనచేశాడు. అందులో విరుద్ధాంశల మైత్రి కన్న ఘర్షణ అనే భాగం చాలాకీలకమైనదని, ప్రతిదాన్లోనూ వైరుధ్యాలను కనిపెట్టాలని, కనిపెట్టలేక పోవడమంటే, దాన్నసలు తెలుసుకోలేక పోయినట్లేనని ఈ ఘర్షణా పార్శ్వాన్ని ఎంగెల్సు ప్లెఖనోవ్ లిద్దరూ గట్టిగా పట్టించు కోలేదని, అప్పట్లో ప్రచార సౌలభ్యం దృష్ట్యా ఎంగెల్సు శ్రద్ధచూపలేదుగాని, దాని

ప్రాధాన్యం యెరిగిన వాడేనని, ప్లెఖనోవ్ యెరుగని వాడనీ, ఈ విరుద్ధాంశాల ఘర్షణా ప్రాధాన్యం కీలకంగా గల డైలెక్టిక్సే హెగెల్ మార్క్సుల జ్ఞానసిద్ధాంత ( **Theory of knowledge** ) మని, అలాగని ప్లెఖనోవ్ గ్రహించలేదని చెప్పాడు. తద్వారా విరుద్ధాంశాల ఘర్షణ ప్రాధాన్యాన్ని గతితర్కంలో కల్పించి, గతితర్కాన్ని జ్ఞాన సిద్ధాంతమని సిద్ధాంతించి, గతితర్కానికి లెనిన్ నూతనాభివృద్ధిని చేకూర్చాడని చెప్తుంటారు. ఇది నిజంగా నూతనాంశమే. మార్క్సెంగెల్సుల గతితర్కంలో యీ రెండు అంశాలులేని మాట యథార్థం. అవి హెగెల్లో లేక పోవడం అంతకంటే యథార్థం. **"Identity of opposites - that is the chief thing for Hegel"** అని లెనిన్ నోట్సు వ్రాశాడు. హెగెల్‌మీద రాసిపెట్టిన నోట్సులో **"In brief, dialectics can be defined as the doctrine of the unity of opposites"** అని గతితర్కంలో పదమూలకాల పట్టిక కింద రాసుకొన్నాడు. **"And in that lies the essence of dialectics and precisely this essence is expressed by the formula, the unity, identity of opposites"** అని గతి యథార్థం కాదన్న గ్రీకు తాత్వికుడు జీనోను హెగెల్ చర్చించిన దగ్గర రాసుకొన్నాడు. హెగెల్‌ను చదివినంతవరకు, హెగెల్‌మీద నోట్సువరకు లెనిన్ విరుద్ధాంశాల ఐక్యతనే గతితర్కసారం అన్నాడు గాని విరుద్ధాంశాల ఘర్షణ గతితర్కసారమని రాసి చూపగడు. లాసెల్లీ "ఫిలాసఫీ అఫ్ హిరాక్లిటస్" చదవటంతో ఘర్షణ ప్రధానమనటం ఆరంభించాడు. గతితర్కం గూర్చి లెనిన్ చేసిన ఆ చిన్న రచనలో ఆరంభవాక్యమే లాసెల్లీ స్మరణతో ఆరంభమయింది. లాసెల్లీ హిరాక్లిటస్ తత్వంలో చెప్పిన సంబంధ స్మరణతో ఆరంభమయింది అని బ్రాకెట్లో విషయమే చెప్తోంది గదా.

## గతితార్కికుల ప్రగతి చిత్రాలు :

మావో మాత్రం అభావాభావం వట్టి మాట అనీ, దాన్ని అనవాళ్లేకుండా చెరిపేయమనీ, గుణపరిమాణాలు వినిమయమనే కేటగరీగా ఛాన్సు నెససిటీల (నియతి యదృచ్ఛల) వలె, ప్రత్యేకతా సామాన్యతలవలెనే మిగిల్చివేసి, డైలెక్టిక్సుకు మూడు సూత్రాలు లేవని, వైరుధ్య మొక్కటే సూత్రమని నిశ్చయించాడు. మావో రష్యాలో డెబోరిన్, బుఖారిన్‌లతో లెనిన్ వివాదాన్ని తెలుసుకొని మరీ యీ నిర్ణయాలకు వచ్చినట్టు తలంచవచ్చు. మూడుసూత్రాల గతితర్కం మార్పును నియతాభివృద్ధిగానూ, ఆ మార్పుయొక్క చిత్రీకరణ స్పైరల్‌గాను చూపించట మొకటుంది. తొలుత హెగెల్ యిచ్చిన చిత్రం ఏక కేంద్రక వృత్తశ్రేణి **(Concentric circles)** కాగా, మార్క్సు ఎంగెల్సులు దాన్ని సర్పిలాన్ని చేశారు. మావో ఏకసూత్ర గతితర్కం వల్ల గతి, మార్పులయొక్క చిత్రపటంలో ఆ స్పైరల్ (సర్పిలము) ఎగిరిపోయింది. అది ఒకే ఒక సరళరేఖ గావచ్చు లేదా జిగ్‌జాగ్ రేఖా (అడ్డదిడ్డంగా తిరిగిన సరళరేఖల) చిత్రంకావచ్చు.

## త్రిసూత్ర గతితర్కం : త్రికధార

ఆ మూడు సూత్రాలు ఒకదానితో ఒకటి సంబంధంలేని, వేర్వేరు సూత్రాలు కావని, ఆ మూడూ ఒక క్రమానుబంధం కలిగినవని, ఆ క్రమసంబంధమే వాటికో వ్యవస్థ నిస్తున్నాయని అదే స్పైరల్ ఆకారాన్ని సంతరిస్తున్నదన్న అవగాహనను మావో యెగురగొట్టేశాడు. దానితోపాటు త్రికం కూడా (Triad) పోవలసి వుంటుంది. మూడు సూత్రాల సంబంధచిత్రమే, సమన్వయ రూపమే త్రికం కూడా – చర్చలో అదొక వివాదాంశం గదా!

విరుద్ధాంశాల ఘర్షణ ఒకపరిమితికి పెరగడంతో గుణాత్మకమైన మార్పు కల్పిస్తుందనీ, అనగా పాతగుణం అభావం చెందుతున్నదని, కొత్తగా వచ్చిన గుణదశలో వైరుధ్యాలు పెంపొంది అవీ ఒక పరిమితి నందుకొనేసరికి మరో కొత్తగుణం రాన వస్తుందని, ఇది లోగడ జరిగిన అభావానికి అభావం జరగటమనీ, యిలా రెండోమారు జరిగే అభావంతో వచ్చే నూతన గుణం మొదటి అభావానికి ముందుగల గుణాలు కొన్ని ఆవృత్తమవుతాయని, తిరిగి యేర్పడతాయని–దీనినే థీసిస్ నుంచి, దానిలో పరస్పర విరోధాలనుంచి థీసిస్ అభావంగా యాంటీ థీసిస్ కలిగి, యాంటీథీసిస్‌లో వైరుధ్యాలు ఒక పరిమాణాన్ని దాటేసరికి సింథసిస్ కలిగి మరొక నూతన సిద్ధాంతం రూపొంది యాంటీథీసిస్ అభావం పొందుతుందని – యిలా యీ మూడు సూత్రాలూ పరస్పరాను బంధితమై త్రికధారావాహికంగా గతిని ప్రగతిగా సాగిస్తుంటాయని, అందులో రెండవ అభావం ఫలితంగా యేర్పడే పరిణామంలో ఏకాంతర దశల్లో గుణాలకు ఆవృత్తి వుంటుందని, అనగా దశ తప్పించి అవతల దశలో పాతలక్షణాలకు ఆవృత్తి[repetition]ఉన్నదని, క్రమభంగంలోకూడ క్రమానుగతతత్వానికి Continuity in discontinuity] కూడా డైలెక్టిక్ చోటు యిస్తుందనీ చెప్పేవివరణ వీల్లేకుండా పోయి, పాత (గుణం) యొక్క ఆవృత్తి తప్పనిసరి కాకపోయే స్థితిని మావో తెచ్చి పెట్టినట్లవుతుంది. గతాన్ని యెంతో కొంత భాగాన్ని యే కొంతదూరమో, చివరంటానో కొత్తలోకి మోసుకువెళ్ళడాన్ని తప్పనిసరిచేస్తుంది మూడు సూత్రాలగతితర్కం. ఏక సూత్రగతితర్కం గతాన్ని మోసే బాధ్యత మొత్తాన్ని తప్పించగలుగుతుంది. గతంతో బంధాన్ని నిరవశేషంగా తెంపుకోడానికి అవకాశం కల్పిస్తుంది.

## మార్క్స్‌ననలేక ఎంగెల్సు నంటున్నారు

ఇలా లెనిన్ మావోలు గతితర్కంలో చేసిన చేర్పులు మార్పులు, చెప్పిన తీర్పులు ఎంగెల్సు పేరొక్కటే చెప్పి, మార్క్స్‌ను తప్పించి చెపుతున్నప్పటికీ వారు సవరించింది మార్క్స్ గతితర్కాన్నన్నే మాట నెవరు కాదనగలరు? ఎంగెల్సు వ్యక్తిగత రచన అనగల డైలెక్టిక్స్ ఆఫ్ నేచరును లెనిన్ చూడలేదు. అప్పటికి అది

ఇప్పటికీ ప్రేరేపించబడిన పరిస్థితి ఒక్కటే. తీవ్రాతితీవ్రమయిన వర్గపోరాట మధ్య మాడుతున్నప్పటి పరిస్థితి ఒక్కటే వారి సమర్థనలకు కారణమంగం. వర్గపోరాట విజయసారథులుగానైతే అవసరాల ప్రేరణతోనే వైరుధ్యసూత్రాన్ని యిలా తెగపెంపొందించారని తోస్తుంది. యాంత్రికోపయోగాల్ని ఉనే మానవచైతన్య ప్రాబల్యం తత్వాలంగలో వైవిధ్యాన్ని నిర్ణయించటంలోనూ, మార్పుదలలోనూ లభిస్తుంటా వైరుధ్యాలను కూడ మలుచుకొంటూ యింకా యిప్పటికీ మలుపుగా సజీవంగానే ఉన్నాయి కనుక విజ్ఞానాలే యోచించగలవు.

## మౌలికంగానే ప్రశ్నించుకొందాం

ఇప్పుడు మానవ చైతన్యాలోపలను యిలా గురిలప్పుడున్న వైరుధ్యాలను ప్రకృతిలో, విజ్ఞానశాస్త్రంలో గల ప్రమాణాలేమిటి? మొదటినుంచీ గతితర్కంలో మూడు సూత్రాలున్నాయా? పరిణామమున్నదా? వుంటే, దాని అసలుస్వరూపమేమిటి? ఆ పరిణామ చిత్రణం యేమిటి? ఆ గతితర్కం యొక్క అవశ్యకత సోషలిజానికిగాని, సైన్సుకిగాని, మానవుని ఆలోచనకుగాని యేమిటి?గతితర్కం లేకుంటా అవి లేనేలేవా, వుండలేవా? వుంటే ఫలప్రదంకావా? అన్నటువంటి పెద్దప్రశ్నావళి యీపరిస్థితిని చూచిన తర్వాత ఆలోచనాపరుణ్ణి వెంటాడసాగుతుంది. వైరుధ్యాలకు మూలకారణమంటి మహాపురుషులే మౌలికమైన వివాదాన్ని లేవనెత్తిన సన్నివేశంలో ● వైరుధ్యాలని ప్రమాదులోకంటా ప్రశ్నించి, చర్చించటం బుద్ధిజీవులు చేయవలసిన పని. మార్క్సిస్టులైతే యిలే వారు మరింత అవశ్యంగా చెయ్యాల్సిన పని ఎవరిశక్తి కొలది వారుచెయ్యాలి.

మూడు సూత్రాల్లోన్న, ఉన్నదొక్కటేననడాన్ని విచారించడమేగాదు, ఆ ఒక్కటి దాని విషయంకూడా ఏమిటో ఆలోచించాలి. అదికూడా లేకపోతే, గతిగమనం పరిణామాభివృద్ధులులేవా? గతిపరిణామ అభివృద్ధులను ప్రకృతిలో దర్శించిన వారంతా వైరుధ్యసూత్రాన్ని సూత్రించారా? సూత్రించనివారంతా ప్రకృతిలో వాటిని నిరాకరించారా? నిరాకరించక తప్పదా? నాటిగ్రీకు తత్వవేత్త జీనో చూపించిన గమనవైపరీత్యాన్ని నవీన విజ్ఞాన శాస్త్రజ్ఞులు పరిష్కరించలేదా? ఇవన్నీ చూడాలి.

## గతితర్కం కూడా హేతువాద సిద్ధాంతమే

ఇప్పుడు సమ్మోహనవతావాదులు గతితర్కాన్ని వ్యతిరేకించి మార్క్సిస్టులతో చర్చకు తలపడ్డారు. కాని ఒసిద్ధాంతకర్త (యం. ఎన్. రాయ్) మాత్రం హెగీలియన్ గతితర్కం ప్రభావంమాత్రం మార్క్సును తప్పుదారి పట్టించిందని ఒకప్రక్క నంటూనే "గతితర్కం హేతువాదభావమని, గతితార్కిక భౌతికవాదం హేతువాద

తత్వశాస్త్రమని" అనటం మాత్రం మానలేదు. ఆయన అంతిమరచన అయిన "రీజన్–రొమాంటిసిజమ్ – రివల్యూషన్"లో Dilectics is a rationalist notion- Dialectical materialism is a rationalist philosophy అన్నాడు. ఆ మాట లోతుపాతులేమిటో విచారించాలిగదా?

మౌలికమైన యీ ప్రశ్నల ప్రత్యేక విచారణకు ముందుగా ఉపోద్ఘాత ప్రాయంగా యీ రచన ఉద్దిష్టమయింది. ఈ గతితర్కం మూలకర్త హెగెల్ కాలంచేసి ఒకటిన్నర శతాబ్దం గడిచింది. విజ్ఞానశాస్త్రాలు యీ కాలంలో అద్భుతమైన సిద్ధాంతాలను ఫలితాలను సాధించాయి. ఆ మహత్తరమైన విజ్ఞానశాస్త్ర జైత్రయాత్రలో అయుధంగా–కొత్తఆలోచనాశాస్త్రంగా – ప్రయోగశాస్త్రంగా యీగతితర్కం యేమేరకు ఉపకరించావని, యీ విజయంలో యెంతపాలు తనదని అంటుందో పరిశీలించడం ప్రథమావశ్యకతగా తలచాలి. దేని ప్రయోజకత్వమైనా ఫలితాల్లోగదా తేలవలసింది. అందులోనూ కావలసినంతకాలం జరిగిపోయింది.

విజ్ఞానశాస్త్రాలకి గతితర్కదృష్టి, యీ ఆలోచనాసరళి యెంతో ప్రయోజనకారి, ఎంతో అవశ్యకమైన సాధనం అనిఅసలు ఆహెగెల్ అన్నట్టుగా చూడలేదుగాని మార్క్సు–ఎంగెల్సులూ వారి అనుయాయులూ మాత్రం ఘోషించారు, ఘోషిస్తున్నారు.

"Dialectics could be of assistance to natural science in negotiating the mountain of theory" —Dialectics of Natnre

"The natural scientists who have learnt to think dialectically are still few and far between and hence the conflict between the discoveries made and the old traditional mode of thought in the explanation of the boundless confusion which reigns in theoritical natural science."

—Anti-Duhring.

విజ్ఞానశాస్త్రాల్లో సాగే సిద్ధాంతీకరణ విభాగంలో గతితర్కం ఉపయోగిస్తుందంటున్నారు ఎంగెల్సు. అదిలేకనే ఆ రంగంలోఅలమిన్నదిగందరగోళమంటున్నాడు. లెనిన్ తర్వాత అది శాస్త్రపరిశోధన, ప్రయోగరంగంలోకూడ అవశ్యకమని, సెన్సుకది అదనపు నేత్రమని చెప్పడం మొదలయింది. అంచేత విజ్ఞానశాస్త్ర పరిశోధనకు, సిద్ధాంతానికి అదిచేసిన సేవలు ఏమంటున్నారో తేలితే, ఆ తర్వాత ఆ సిద్ధాంతం ఆ పద్ధతి యొక్క సత్యాసత్యాల చర్చ చేయొచ్చునని తలంపు. అందుకని యిందులో గతితర్కం విజ్ఞానశాస్త్రాలు–సోషలిజం శాస్త్రీయత అనే విషయమే చర్చాంశం.

—:o:—

# వైజ్ఞానిక జైత్రయాత్రలో గతితర్కం ఎక్కడ ?

"It is precisely dialectics that constitute the most important form of thinking for present day natural science."

— Engels.

సమాజవ్యవస్థలో సమూలమైన మార్పును ప్రతిపాదించే సిద్ధాంతాలలో విజ్ఞాన శాస్త్ర ఘోష మార్క్సిజంలో ఉన్నంతగా మరెందులోనూ లేదు. మార్క్సీయ సోషలిజమే సైంటిఫిక్ సోషలిజం—ఆ సాంఘికదర్శనమే సైన్సు. అంతేకాదు. నేటి విజ్ఞానశాస్త్రమే మార్క్సిజాన్ని నిరూపిస్తున్నది. రేపటి విజ్ఞానశాస్త్ర ఫలితాలు ప్రతిపాదనలుకూడా మార్క్సిజాన్నే నిరూపిస్తాయి. అటువంటి విశ్వాసం అందులో వుంది.

## మార్క్సిజంలో విజ్ఞానశాస్త్ర ఘోష

మార్క్సిజం తత్వశాస్త్రాన్ని పాతఅర్థంలో రద్దుచేశానంటుంది. సైన్సు ఆఫ్ సైన్సెస్, సైన్సు ఎబౌ సైన్సెస్‌గా చెప్పే పాతమాటను కొట్టివేసి, తత్వశాస్త్రంకూడా ఒక సైన్సు, మనిషి ఆలోచనారీతులను, నియమాలను మాత్రమే సంబంధించిన సైన్సు, ఎప్పటికప్పుడు విజ్ఞానశాస్త్రాలు వెలువరించే నూతన విజ్ఞానాన్ని క్రోడీకరించి వ్యాఖ్యానం చెప్పుకొనే పనిగల సైన్సు, ఇక తర్కం గతితర్కం మాత్రమే దాని రాష్ట్రమని అంటుంది మార్క్సిజం. అనగా యిక మార్క్సిజం అంటే సైన్సు, సైన్సు అంటే మార్క్సిజం అన్నపరిస్థితి.

ఇంత పరిస్థితికి కారణభూతమైన అంశం గతితర్కం. మానవుని ఆలోచనా క్రమంలోనేకాదు, సమాజపరిణామంలోనేకాదు గతితార్కిక క్రమం ఉన్నది. ఒక్క ప్రకృతియొక్క కార్యవ్యాపారమే గతితార్కికం, ప్రకృతిమార్గమే గతితార్కికం. **Nature is the test of dialectics** అని అన్నారు.

ఆ విషయాన్ని హెగెల్ ఎప్పుడో నిరూపించబోయాడు. ప్రకృతికూడ దాని మనసుపచ్చునుగాని, ప్రకృతిశాస్త్ర సిద్ధాంతాలు గతితర్కానుబద్ధంగా ఉన్నాయని హెగెల్ **Encyclopaedia of Philosophical Sciences, Natural philosophy** అనే గ్రంథాల్లో చూపించివున్నాడు, అవే ఎంగెల్సుకు ఒరవడిపెట్టాయి. హెగెల్ తర్వాత కొంతకాలంలో వచ్చిన కొత్తవిజ్ఞానశాస్త్ర సమాచారం గతితర్కానికి సంగతంగా ఉందని ఎంగెల్సు చెప్పడానికి ఆ హెగెల్ ఇచ్చినవే నమూనాలు, మూసలు అయినాయి. ఆ నమూనాలను ముందుపెట్టుకొనే ఎంగెల్సు డైలెక్టిక్సు ఆఫ్ నేచర్ నోట్సు తయారుచేశాడు. అందులో ఎక్కడ జూచినా హెగెలే కనిపిస్తాడు. బహుశా సైంటిస్టుగాకూడా కనిపిస్తాడనొచ్చు.

ప్రకృతిమార్గం గతితార్కికమయితే, సైన్సుమార్గం గతితార్కికం కావాలి. సైన్సు గతితర్కాన్ని నిరూపిస్తుందన్న హెగెల్ గతితర్కం సైన్సును నడిపిస్తుంది. సైన్సుకు అది కొత్త ఆయుధం, కొత్తనేత్రం అవుతుంది, వస్తుకత్వం పెరుగుతుంది అనీ, సైన్సుకొక పరిశీలనాపద్ధతిని, ఆలోచనారీతిని యిచ్చి దాని అభివృద్ధిని యినుమడింపజేస్తుందని వక్కాణించినట్లు కనిపించదు. కాని మార్క్సిజం ఆ 'క్లెయిమ్' వేసింది. ఈ ప్రకరణం మొదట ఉల్లేఖించిన ఎంగెల్సు వాక్యాలవే. శాస్త్రపరిశోధనా ఫలితాలను సిద్ధాంతీకరించడానికి మాత్రం గతితార్కిక ఆలోచనారీతి ఉపకరిస్తుందని ఎంగెల్సు అభిప్రాయం. కాని పరిశోధనావిధానంలోనే, ప్రయోగరచనలోనే మార్గదర్శకమవుతుంది, ఉపకరిస్తుంది అన్నంతగా లెనిన్ ఆ 'క్లెయిమ్'ను పెంచివేశాడు. గతితర్కం మార్క్సిజంయొక్క జ్ఞానసిద్ధాంతం అన్నమాటలో ఉన్న సారాంశమిదే. గతితర్కం జ్ఞానసాధనమనికూడా ఆ మాటకు అర్థం. లెక్కసచేమిటన్నది తర్వాత విచారిస్తాము. గతితర్కం నూతన జ్ఞానసాధనంగా వెలువడిన తర్వాత విజ్ఞానశాస్త్ర అభివృద్ధిలో దానిపాత్రను మదింపుచెయ్యాలి.

## హాల్డేను యోగ్యతాపత్రం

ఎంగెల్సు వ్రాతలు కొందరు విజ్ఞానవేత్తల్లో గతితర్కం సైన్సుకు చాలా ప్రయోజనకారి అన్నభావాన్ని కలిగించాయి. చాలా ఆశలు రేపాయి. "ఎంగెల్సు ఆలోచనాపద్ధతి గనుక బాగా ప్రచారానికెక్కివున్నట్టయితే, గతముప్పైయేళ్ళలో ఫిజిక్సు రంగంలో మన అభిప్రాయాల్లో కలిగిన మార్పులు మెంతో సులువుగా

సాఫీగా కలిగివుండేవి. డార్విన్ సిద్ధాంతం విషయంలో ఎంగెల్సు చేసిన రిమార్కులు వెలిబుచ్చిన అభిప్రాయాలు సర్వసాధారణంగా తెలిసివున్నట్టయితే మాత్రం నామట్టుకు నాకు యెంతో కొంత నా ఆలోచనలో తికమకతప్పేది."

"Had Engels method of thinking been more familiar, the transformation of our ideas on physics which have occured during the last thirty years would have been smoother. Had his remarks on Darwinism been generally known, I for one would have been saved a certain amount of muddled thinking"

ఇంతేమాటన్నవాడు J. B. S. హాల్డేన్. అన్నది ఎంగెల్సు డైలెక్టిక్స్ ఆఫ్ నేచర్ అనే అసంపూర్ణమైన ముసాయిదా రచనకు వ్రాసిన పీఠికలో. హాల్డేన్ ప్రఖ్యాత జీవశాస్త్రజ్ఞుడు. అందులో వారసత్వవిభాగంలో ఆయనకృషి వుంటుంది. దానితోపాటుగా అతనొక మాజీ బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు. ఈ మాటలు ఆయన 1939లో వ్రాశాడు,

ఇంత సర్టిఫికెట్ పుచ్చుకొన్న ఆ ఎంగెల్సు మరో రచన 'యాంటీడూరింగ్' గత శతాబ్దంనుంచీ బాగా ప్రచారంలో వుంది. అందులో గణితం, పదార్థ విజ్ఞానం, రసాయన విజ్ఞానం ఖగోళ పరిజ్ఞానం, జీవ పరిణామం మొదలైన వివిధరంగాల లోనిశాస్త్రవిజ్ఞానానికిగతితార్కికభాష్యాన్ని రుచిచూపింది. ఇటువంటి పాఠాలలో మునిగివున్న విజ్ఞానశాస్త్రాంశాలకు ఒక తాత్త్వికాన్వయం కుదుర్చుకున్న ఎంగెల్సు రచనలు ఏ కళాశాల విద్యార్థిని ఆకర్షించకుండా వుంటాయి? ఆ రచనలే జోలియట్ క్యూరీ, జె. డి. బెర్నాల్, హాల్డేన్, హైమన్ లెవీ, నీథమ్, హాగ్బెన్‌వంటి శాస్త్రజ్ఞులనుకూడా కొందరిని ఆకర్షించి వున్నవి. గతితర్కంవలన విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి యెంతో దోహదంగా వుంటుందని వారు అభిప్రాయపడ్డారు. గతితర్కం నిజమైన శాస్త్రమని దానివలన సైన్సుకు చాలా ప్రయోజనం చేకూరుతుందన్నమాట నిజమని నమ్మకం కుదర్చటానికి, యింతులో కొన్ని పేర్లను గతితర్క తత్వవాచకాలలో ఉదాహరించారు కూడా.

## అడగవలసిన ప్రశ్న ?

ఇటువంటి ఆశలు, అంచనాలు, అభిప్రాయాల మాటకేమిగాని, విజ్ఞానశాస్త్ర సారథిగా, చక్షువుగా, ఏకైక ప్రతినిధిగా నిర్వివాదమైన శాస్త్రఘోష గావిస్తున్న మార్క్సిస్టుల గతితర్కంవల్ల విజ్ఞాన శాస్త్రాభివృద్ధి ప్రత్యేకంగా జరిగినట్టు సమాచారమేమైనా యింతవరకు లభించిందా అనే ప్రశ్న వేసుకోవడం ప్రాథమికావసరం.

ఈ డైలెక్టిక్స్‌యొక్క ముక్కుమొగం, రుచి వాసన రంగు యేమిటో తెలియని శాస్త్రజ్ఞుల ప్రపంచానికి ప్రపంచమే వున్నది.దానిపేరు విని,అదేమిటో కొంత చదివినా

దాన్ని తమ దృష్టిగా స్వీకరించని, అసలు ఎరుగని వారెందరో వున్నారు. కార్తేసు, నీథంల వంటి పేర్లు వేళ్ళమీద లెక్కించగలిగే పేర్లేగాని పడమట దేశాల్లో వారు ఎందరో లేరు. గతితర్కం అనే సూక్ష్మ ఆలోచనాలు పెట్టుకోని శాస్త్రజ్ఞులతో నిండిపోయివున్న పాశ్చాత్య ప్రపంచం సాధించిన శాస్త్ర ప్రగతికన్నా, విజయాలకన్నా పై దృక్పథ నాయకత్వం క్రింద నడుస్తున్న సోషలిస్టు ప్రపంచం సాధించిన శాస్త్ర ప్రగతి, సాంకేతిక విజయాలు ఎంతో మించిపోయి వుండాలి. అదేమైనా జరిగిందా అన్నది మొదటి ప్రశ్న.

## అడుగదగిన సమయంకాదా

పై దృక్పథం యిప్పటిరూపం తీసుకొని 180 యేళ్ళు గడిచాయి. మార్క్సు ఎంగెల్సులు పుట్టకముందే అది జర్మన్ ప్రభుత్వాదరణ పొంది విశ్వవిద్యాలయాల్లో పాఠ్యభాగమై కూర్చున్నది. జర్మనీలో అది మార్క్సు ఎంగెల్సులకంటే వారి ప్రచారంలో పడి ప్రమాదకరమై, విశ్వవిద్యాలయాల గౌరవాన్ని కోల్పోగా ఇంగ్లాండు, ఫ్రాన్సు, స్కాండినేవియాలలో విశ్వవిద్యాలయ పాఠ్యప్రణాళికలకెక్కి వుంది. మార్క్సు, ఎంగెల్సుల రాజకీయ విప్లవశాస్త్రమై 150 యేళ్ళ ఉన్నత ప్రచారము పొంది వుంది. అరవై అయిదేళ్ళుగా రష్యన్ ప్రభుత్వ సిద్ధాంతమై విజ్ఞాన శాస్త్రపరిశోధకులకు, విద్యార్థి అధ్యాపకులకు అదొక అదనపు జ్ఞానేంద్రియంగా తగిలించబడుతోంది. నలభై యేళ్ళుగా మరికొన్ని దేశాల అధికారిక తత్వశాస్త్రంగా, తర్కశాస్త్రంగా విజ్ఞాన శాస్త్రమెథడాలజీగా తయారై, ప్రపంచంలో మూడోవంతు ప్రజలకు యింటింటి విజ్ఞానమై వుంది. అంతపెద్ద ప్రపంచపు ప్రభుత్వాల ఆధారనిధులతో సాగే శాస్త్రపరిశోధనకు నాయకత్వం వహిస్తున్నది. విజ్ఞాన శాస్త్రవిజయాలలో యెంతోకొంత భాగస్వామ్యం యేనాడో పుచ్చుకొని వున్న పోలెండు, తూర్పు జర్మనీలవంటివి కూడా ఆ మూడోవంతు ప్రపంచంలో చేరి గతితర్కం క్రింద నడుస్తున్నాయి. ఇంత పెద్ద ప్రపంచం యింత సాటిలేని పాశ్చాత్య ప్రపంచంమీద సమస్తరంగాలలోనూ పై చేయితీసుకోవాలని, దాన్ని మించిపోవాలని గతముప్పై యేళ్ళుగా ప్రబల ప్రయత్నం చేస్తున్నది. ఈ దశలన్నింటిలోనూ, ఆయాదేశాల విజ్ఞాన శాస్త్రవిజయాలలో గతితర్కం యొక్క భాగస్వామ్యం యెంతో కనుక్కోవడం అసంభవమైన ఉద్యమంత కాదు. ఆ ప్రశ్నయింకా ఇప్పుడిప్పుడే వేయరాదనడానికీ, ఆ ప్రశ్నను ఇంకా వాయిదా వేయాలనడానికి ఆస్కారంలేదు. నేటి విజ్ఞానశాస్త్ర కృషి 17వ శతాబ్దంలో ఆరంభమయిందనే మాట గుర్తుంటే వ్యవధి ప్రశ్న ఉచితం కాదు. పైగా యితర విషయాల వలెనుకాదా. అది అసంగతం అవుతున్నది ఇది సోషలిస్టు, సోషలిస్టేతర ప్రపంచాల శాస్త్ర సాంకేతిక విజ్ఞానాభివృద్ధిని పోల్చి చేసే విషయంఇక్కడ ప్రధానవిషయంగాదు. గతితార్కిక, గతితార్కికేతర దృష్టులు రెండూ శాస్త్రపరిశోధన, సిద్ధాంతీకరణలలో

సాధించిన గుణాత్మక ఫలితాల సమీక్ష ముఖ్యాంశం. సోషలిస్టు, సోషలిస్టేతర దేశాల శాస్త్ర విజ్ఞాన ప్రగతిలో తారతమ్య పరిశీలన అందులో ఒక భాగం మాత్రమే. అందులోనూ స్టాలిన్ అనంతరం కాలంగూర్చి మాట్లాడితే ఏమీ అనడానికి కూడా వీల్లేదేమో.

ప్రపంచంలో గత ముప్పైయేళ్ళ కాలంలోనూ ప్రథమగణ్యమైన విజ్ఞానశాస్త్ర విజయాలేవని అడిగితే రష్యన్లు మూడింటిని వేలుమడచి చెప్పుతున్నారు. ఖగోళభౌతిక శాస్త్రరంగంలో [Astrophysics] సాధించుతున్న విజయాలు మొదటిది. ఐదు వందలకోట్లకాంతి సంవత్సరాల దూరతలంనుండి వస్తున్న రేడియేషన్ను పసికట్టడం వలన పల్సార్స్ [Pulsars] అనే న్యూట్రాన్ నక్షత్రాలను కనుగొనడంతో ఒక్క ఘనపు సెంటీమీటరులో పట్టేపదార్థం, అగ్గిపెట్టెలో సుమారు యిరవయ్యైదవంతు జాగాలో పట్టేపదార్థం భూమిమీద నూరుకోట్లటన్నుల బరువు తూగేంత గొప్ప కేంద్రీకరణ, ఘనీభవనం సాధ్యమని తెలియవచ్చి, అది పదార్థం యొక్క నూతన అవస్థగా విదితమై, ఆ అవస్థను వివరించగల కొత్త సిద్ధాంతాల నిర్మాణ ఆవశ్యకత యేర్పడింది. అత్యున్నత శక్తి కణాల భౌతిక శాస్త్రరంగంలోని ఫలితాలు రెండవది. పరమాణుకేంద్రక విచ్ఛేదనంలో బైటపడిన "మూలకణాల" సంఖ్య రెండువందలను దాటి మళ్ళీ క్వాంటం–రెలిటివిటీ సిద్ధాంతాలంత పెద్ద ప్రాధాన్యంగల కొత్త సిద్ధాంతాల ఆవిష్కరణ ఆవశ్యకత ఏర్పడింది. రెలిటివిటీ సిద్ధాంతంలోని లోపాలను, దోషాలను చాటి చెప్పగలిగే సమయ మారంభమైనట్లుంది. మూడో అంశం జీవశాస్త్రములో సాధించిన ఫలితం, జెనిటిక్ కోడును విప్పడం. వారసత్వలక్షణాలను అనువంశికంగా సంక్రమింపజేయడంలో రియాక్సిరిబో న్యూక్లియిక్ ద్రావకంయొక్క పాత్రను అందు పట్టించుకోవడం.

ఈ ప్రథమశ్రేణి విజ్ఞాన విజయాలలో డైలెక్టిక్సును నమ్ముకొన్న దేశాలు గాని, వ్యక్తులుగాని (ప్రధాన) భాగస్వామ్యానికి, అగ్రచరత్వానికి నోచుకోలేక పోయినవనే యథార్థం హృదయ విదారకమైన సంగతి. ఈ విజయాలలో ఒక్కగా నొక్కటైనా రష్యన్, పోలిష్–నామం అంటూ వినపించదు గదా! — ఆ రెండువందల కణాలలో యెన్నింటిని సోవియట్ గతితార్కిక శాస్త్రజ్ఞులు కనుగొన్నారో కనుక్కోవలసిన సంగతిగదా! పై విధ్యసూత్రం గతితర్కానికి ప్రాణమైనందుకు, అణుగర్భంలోని యీ కణాల్లో ప్రతిదానికీ ప్రతిద్వంద్వివుంది. ప్రోటాన్ వుంటే–యాంటీ ప్రోటాన్, న్యూట్రాన్ వుంటే–యాంటీన్యూట్రాను, (+) పై మెసాన్ వుంటే (–) పై మెసాన్–ఇలాగెన్నో వున్నాయి. వాటిఉనికిని సూచించడానికైనా గతితర్కం వారికిసాయపడలేదు.

## గతితర్కంతో భాష్యకారులైపోయిన శాస్త్రకారులు

ఈ విజయాలన్నీ పెట్టుబడిదారీ ప్రపంచంలోనే, డైలెక్టిక్ శిక్షణకు గురికాని దేశాల్లోనే సాధ్యమైనాయి. అక్కడైనా హాల్డేను, నీధం, బెర్నాల్ మాదిరిగా మార్క్సిస్టు దృష్టిపెంచిన శాస్త్రకారులెవరూ యీ విజయాల్లో పాలుపంచుకోలేదు. అంతేకాదు. పడమటిదేశాల్లో మార్క్సిస్టులుగా మారిన శాస్త్రజ్ఞులు ఆ తర్వాత వారు శాస్త్రకారులుగా సాధించిన విజయాలేమైనా గతితార్కిక దృష్టిప్రభావంగా చెప్పగలిగినవంటూ వున్నాయా అని ప్రశ్నించితే బహుశా వ్యతిరేక ఫలితం లభిస్తుందేమో. ఎందుకంటే వారు మార్క్సిస్టులు కాకముందు చేసినపనే యెక్కువగా వుంది. మార్క్సిజాన్ని స్వీకరించిన తర్వాత వారు సైన్సు ఫలితాలకు మార్క్సిస్టు వ్యాఖ్యాతలుగా రాణించినంతగా పరిశోధకులుగా రాణించలేదు. మార్క్సిజం—గతితర్కమూ భాష్య ప్రక్రియలో మాత్రం రికార్డు స్థాపిస్తున్నది. అదే దానికి ఇప్పుడుగొప్ప వ్యాపకమయింది.

## లాక్షణిక తర్కం చాలదనికదా !

ఇంతకన్నా సైబర్నెటిక్సు, అంటే కంప్యూటరుసైన్సుతెచ్చిన పరిస్థితి డైలెక్టిక్సు గొప్ప డాలితనాన్ని బాగా గుర్తుజేయదొడగింది. కంప్యూటర్లోని, ఎలక్ట్రానిక్ మెదడులోని పని విధానమంతా అనగా లెక్కలు, తర్కమూ అంతాకూడా గతితర్కం ఆక్షేపించి, అధిక్షేపించి, అవతల ద్రోసేసినట్టి,లేదా దిగువాయిచేసినట్టి పాత లాక్షణిక తర్కం—ఫార్మల్ లాజిక్ తప్ప మరేమీకాదు. పశ్చిమదేశాల్లో అరిస్టాటిల్‌గాని, మనదేశంలో బౌద్ధవైదిక న్యాయశాఖల వారుగాని దీర్ఘకాలంగా అనుసరిస్తూవచ్చిన లాక్షణిక తర్కసూత్రాలు స్థితిదశలో, గతిశూన్యమైన సందర్భాలలో మాత్రమే అన్వయించే స్థితితర్కమేగాని గతిసన్నివేశంలో నిత్యపరిణామ సందర్భంలో అన్వయించజాలవని, స్థితిదశకే వాని ప్రయోజనం పరిమితమని—స్థితితాత్కాలికం, చలనం శాశ్వతమని, స్థితి సాపేక్ష్యం గతినిరపేక్షం పరమం (Absolute) అనీ—నిరంతరమైన ప్రచండమైన గతిసన్నివేశానికి సాంప్రదాయక తర్కం సరిపోదనీ—గతితర్కం మాత్రం స్థితిసందర్భానికికూడా, (స్థితిసాపేక్ష్యం గావున),అన్వయిస్తుందనీ డైలెక్టిక్సు అధిక్యతనీ, అవసరాన్నీ వివరిస్తారు.

## కాని అదే సాంకేతిక యుగతర్కమైంది

ఆ మాటలను నిర్విరామంగా ప్రచారించేవారు ప్రచారిస్తుండగా, నిశ్శబ్దంగా జరగవలసిన పని జరిగిపోయింది. హెగెల్ ఎంగెల్సులు స్థితితర్కం సూత్రించిన పాతతర్కమే వేగవిశిష్టమైన నవీనయుగంలో సంక్లిష్టమైన సాంకేతిం పరికరాల తర్కమై గణితరూపాలలో శాంతశౌర్యంతో ఆచరణాత్మక విజయం సాధించింది. కంప్యూటరును వాడని ముఖ్యపరిశోధనగాని, సైద్ధాంతిక గణనం (theoretical calculation) గాని నేడు జరుగుతున్న రోదసి అధ్యయనంగానీ వాతావరణ పరిశోధనగానీ జలవాయుగతుల గణనంగానీ, ఆర్థికరంగంలోని గణనాలు గానీ నేడు లేనేలేవు. కంప్యూటరైజింగ్ ఈ యుగలక్షణం. అటువంటి కంప్యూటర్లలో ఎక్కించే గణితమంతా సాంప్రదాయక తర్కంతో ఏర్పరచబడినదిగాని, గతితర్కంతో కూర్చినదికాదు. గతితర్కంతో తయారుచేసిన గణితమంటూ లేదనుకొంటాను. గతితర్కానికి గణితాన్వయాన్ని చూపి Mathematical logic లాగా Mathematical dialectical logic అంటూ ఒకటి తయారైన జాడ కనబడలేదు.

## లాక్షణిక తర్కంతో గతితార్కికుల రాజీ

గతితార్కికులు నిష్క్రమిపోయారు. వారికీ పరిణామం అంతుబట్టలేదు. గతితర్కం విజ్ఞానశాస్త్రతర్కం, సాంకేతికశాస్త్రతర్కంకాదు. ఆ మాట యథార్థమని కంప్యూటర్లు రుజువుచేసేసినై. ప్రచండవేగాలను, బహువిధమైనచలనాలను పరిణామ పరివర్తనలను పరిశోధిస్తున్న నేటి విజ్ఞానశాస్త్రావసరాలను సాంప్రదాయిక తర్కం తీర్చగలగడం లెనిన్ ఎంగెల్సుల అవగాహనలోవున్న విషయంకానేకాదు.వారు దాని పాత్రనుపూర్తిగా కొట్టివేయలేదని,ఏదోకొంతపరిమితమైన అన్వయాన్ని ఒప్పుకొన్నారని, చెప్పుకొన్నారని, గతితర్క లక్షణ గ్రంథాలు సాధారణతర్కం గతితర్కంకంటే సుంభతరమని చెప్పినమాట యథార్థమేనటగాని అంతమాత్రాన ఆతర్కాన్ని న్యూనత పరచడంకాదని, అదేదో తర్కంయొక్క ఆదిమావస్థ, ప్రాథమికస్థితియని ధ్వనించడం కానేకాదని సర్దుబాటుమాటలు నేటి గతితార్కికుల వ్రాతల్లో నిండిపోవాల్సివచ్చింది.గతితర్కం ఊసెత్తకుండా సాంప్రదాయికతర్కంతో సాంకేతికయుగం అనంతితంగా సాగిపోతోంది.

పదిహేనేళ్ళకు ముందర ఏ అధికారిక సోవియట్ శాస్త్రకారుడుగాని, తత్వ ప్రచారకుడుగాని, ఆచార్యుడుగాని లాక్షణికతర్కం పరిమితమంటే అది యింత దూరం విస్తరించగలదని చూచినవాడు, చూచి ఔనన్నవాడు లేనేలేడు. పైగా ఆ

లాక్షణికతర్కవిన్యాసమే గణితతర్కమని తెలిసి కూడా ఆ సిద్ధాంతంతో విరోధం చూపిన సోవియట్ గతితార్కిక భౌతికవాదివర్గం దాన్ని నిజంగా నమ్మిన శాస్త్రకారవర్గం కంప్యూటర్లనే వ్యతిరేకించాయి. వానివాడుకను 1969దాకా పదిహేనేళ్ళ నిరోధించాయి. సామాజికాభివృద్ధి అవసరాలు ఈ సిద్ధాంతుల అస్పృశ్యతా సూత్రాన్ని అనతికాలంలో అవతలబెట్టించాయి. తమ గతితార్కిక లాక్షణిక తార్కికావగాహనలు పరస్పరవిరుద్ధాలు కావని సర్దిచెప్పుకోమన్నాయి. ఇక అలా సర్దుడు ఆరంభమయింది. లాక్షణిక తర్క సమ్మానం యేదో ఒక మోతాదులో బాహాటంగా మొదలయింది.

## గణితతర్కం గతితర్కం కాదు, లాక్షణికతర్కం

గణితశాస్త్రమంటేనే సాంప్రదాయిక తర్కమంటారు. విజ్ఞానశాస్త్ర భాషకు గణితశాస్త్రం శబ్దజాలమని (Vocabulary) సాంప్రదాయిక తర్కం వాక్యనిర్మాణ నియమావళి(Syntax) అని వైజ్ఞానికుల సామెతను నేడు అంగీకరిస్తున్నారు. గణితశాస్త్రంయొక్క యౌవనారంభమే లాక్షణికతర్కం. లాక్షణికతర్కంపరిణత్వ దశ గణితశాస్త్రమని విశ్వవిఖ్యాత గణితశాస్త్రకారుడైన బెర్ట్రాండ్ రస్సెల్ సూత్రీకరణను వారు స్మరిస్తున్నారు. గణితంమొత్తానికేనంటే కాదుగాని యిప్పటికే ఇంతవరకే అయితే అంగీకారమేనని తెలుపుకొంటున్నారు. ఎనభైఐదేళ్ళ క్రితం యిరవై ఆరేళ్ళ ప్రాయంలో రస్సెల్‌లో వచ్చిన పరివర్తనకు కొంత సమర్థన నేటికి సోవియట్ రష్యన్ల నుంచి లభిస్తున్నది.

## దానికి రష్యన్ వాఙ్మూలం

సోవియట్ శాస్త్రజ్ఞులలో వృద్ధమూర్తి, సోవియట్ శాస్త్ర విజ్ఞాన పరిషత్ అధ్యక్ష వర్గ సభ్యులలో ఒకరు, సిద్ధహస్తులైన గతితార్కికుల్లో ఒకరు అయిన నికోలోయ్ సెమియొనోవ్‌ను విందాం.

"Mathematics is indeed a formal - logical apparatus. The apparatus of mathematical logic-pricisely because of its purely formal character has served as the theoretical basis for the creation of modern computing techniques.

It is rather widely accepted that mathematics in general identical with formal logic....This view was given its most consistent expression in Bertrand Russel, that logic is the youth of mathematics and mathematics the maturity of logic."

అయితే "But this is an incorrect view of mathematics taken as a as a whole distinct science in its development." అని ఒక అప్రస్తుతమైన ముక్తాయింపుచేర్చిచెప్పాడు. దానితో మునిగిపోయేదేమీలేదు గాని అంతలోనే యింకో గొప్పవిశేషంకూడాచెప్పేశాడు. అలాక్షణికతర్కం గణితరూపంలో విజ్ఞానశాస్త్రరంగంలోనే గాకుండా సామాజికరంగంలోకూడా అద్భుతమైన ఫలితాలనిస్తున్నదనికూడా ఘనంగా చెప్పారు. మానవసమాజం మొదలే గతితర్కానికి కార్యక్షేత్రం- అందులోకూడా స్థితితర్కం కార్యకారి అయింది గదా.

"Despite (and to some extent thanks to) the circumscribed character of formal logic, its application has had tremendous consequences, which are already engulfing the social sphere as well"

Logic with capital L (Lenin's definition of logic -dialectics and theory of knowledge as a unity) takes account of the legitimate rights of formal logic. But dialectics, like logic and theory of knowledge brings out the true role of formal logic in the deveopment of scientific cognition. The role of formal logic in the advance of cognition is most clearly revealed in mathematics, especially when applied to the processing of data supplied by the other sciences" (Marxist Dialctics and Seientific Discovery.

"Some problems of Dialeetical Logic" అనే వ్యాసంలో Dr Z. M ఒరుదేవ్

"The classics of Marxist-Leninist philosophy regarded it (formal logic) as simpler than dialectical logic but this does not signify any belittlement of formal logic, any suggestion that it is primitive or elementary in the worst sense of the term." అంటూ యింకా పలుపురిని వుదాహరిస్తూ రాస్తున్నారు.

పడమటి దేశాల విజ్ఞాన శాస్త్రంలో ప్రబలంగా వున్న నియోపోజిటివిజంలో సంక్షోభమేర్పడిందని, వారికి అందులో నమ్మకంతగ్గుతున్నదని సాంప్రదాయిక తర్కవిధానాలను సర్వసమగ్రంచేస్తూ, అనుభవ పరిధిని దాటనేదాటని ఎంపిరిసిజాన్ని అవలంబించే అపోజిటివిజం నేడు శాస్త్రపరిశోధనలో కుప్పతెప్పలుగాను లభిస్తున్న కొత్తసమాచారాన్నంతా ఒక సిద్ధాంతంలోకి అదుపుకోలేకపోతున్నదని (ఒక ప్రక్క తమగతితతర్కం ఏమీ చేయలేకపోతున్నప్పటికీకూడా) విధాయకంగా పరపక్ష లోపాలనెన్నుతూకూడా ఆ ఫార్మల్ లాజికల్ రీసెర్చి పద్ధతుల ప్రయోజకత్వాన్ని,

ప్రయోగసాఫల్యాన్ని సోవియట్ విజ్ఞాన పరిషత్సభ్యుడు పి.యన్. ఫెదోసియేవ్ కీర్తించక తప్పలేదు.

"In recent years, new methods of cognition that may be applied in many sciences have emerged (cybernitics, semiotics and systems approach....) Indisputably the role of theory and hence of the logical apparatus of semiotic means of cognition has increased to an enormous extent, Dialectical materialist philosophy does not deny the role of formal logic methods research." (Scintific cognition To-day, Its Specific Features and Problems. 1977)

## రష్యన్‌వాచకాలలో లాక్షణిక తర్కపద్ధతులు :

ఇన్ని రంగాలలో సాంప్రదాయిక తర్కసాధనాల విజయాన్ని గతితర్కం అంగీకరిస్తేనేమి, అంగీకరించకపోతేనేమిగాని గతితర్కవాచకాలలోకి దాని విజయ మార్గాలను యెక్కించుకొంటున్నారు. 1970కి పూర్వం Leningrad Institute of philosopohyవంటి సంస్థలచేత వ్రాయించిన తత్వశాస్త్రపాఠ్య పుస్తకాలలో సులభ చిత్రణలుగా వ్రాయించిన ప్రచారవాచకాలలో మేథమేటికల్ లాజిక్‌ను, మేథమేటికల్ మెథడ్స్‌ను గూర్చి ఒక్క వాక్యంకూడ వుండేది కాదు. అటువంటిది 1980 సరికి పరిస్థితి మారిపోయింది. నాల్గవసవరణతో ఆ యేడాదే ప్రచురించిన వాచకంలోమాత్రం Means and Methods of Scientific Cognition, Consciousness, and Cybernitics అనే శీర్షికలు అదనంగా యేర్పరచి సైబర్నిటిక్సును-గణితప్రక్రియలను సైన్సుయొక్క నూతన చక్షువులుగా చెప్పుకొన్నది. అలాగే సైంటిఫిక్ మోడలింగ్ పద్ధతినికూడ మహోన్నేత్రంగా నమోదు చేసింది. గుండె, నాడీమండలం మొదలైన వాటి ఎలక్ట్రానికల్ నమూనాల తయారీని సైన్సు యొక్క జ్ఞానేంద్రియాభ్యుదయంగా చెప్పుకొన్నది. కాని యిదంతా ఫార్మల్ లాజిక్ విజయవైచిత్రి, దాని జన్మస్థలం పాశ్చాత్యసీమ అని మాత్రం చెప్పదు. అదంతా గతితర్కం సాధించిన విజయంగా అనుకొనేలాగా యీ వాచకరచన అవకాశమిస్తుంది.

సైబర్నిటిక్స్ కంప్యూటర్లసైన్సుగా దేశరక్షణావసరం. రక్షణావసరాలను సిద్ధాంతానికి యెవరు బలిపెట్టుకొంటారు? ప్రాగ్మాస్ పై చేయి తీసుకొని డాగ్మాస్‌ను దారితొలగపన్నది. సైబర్నిటిక్స్ దారి సుగమం చేయగా మోడలింగు మెత్తాన్ని రష్యన్లు స్వీకరించారు. ఇదంతా గతితర్కం అపజయమనక తప్పదు. మరొక నాటికి వారే ఒప్పుకొంటారనవచ్చు.

## లాక్షణిక తర్కంపనినిగతితర్కం చేయలేదు

ఫార్మల్ లాజిక్‌ను పూర్తిగా సున్నాచుట్టేయలేదని, దాని అన్వయం పరిమిత పని మాత్రమే చెప్పిందని రష్యన్ గతితార్కికులిప్పుడు నొక్కినొక్కి చెప్తున్నారు. బాగానేవుంది. ఫార్మల్ లాజిక్ దానిక్షేత్ర పరిమితుల్లో సాధించగలదానిని అది సాధించవలసిందేగాని, గతితర్కంకూడ సాధించగలదని చెప్పడంలేదు. చెప్పి సాధించి చూపడంలేదు. అందుచేత ఫార్మల్‌లాజిక్ మాత్రమే కార్యకారిగావుండే క్షేత్రమొకటి శాశ్వతంగా వుంటుందని, అందులో గతితర్కం నిష్ప్రయోజకమని ప్రత్యేకంగా అంగీకరించినట్లవుతుంది. వీరి వ్రాతల ప్రకారం ఈ రెండు తర్కాలూ ఎప్పటికీ కావలసినవే. ఫార్మల్ లాజిక్ చేసేపని గతితర్కం చెయ్యలేదనిమరి, ఒప్పుకొన్నట్టే. గతితర్కం అదనపు అవసరం మాత్రమేగాని దానితోనే సర్వం గడుపుకోవచ్చుననేమాటకు వీరు తిలోదకాలిచ్చుకొన్నారనక తప్పదు. లాక్షణికతర్కం సులభం, ప్రాథమికం అని అంటే అర్థం, ఆదిమమానవావస్థ, అపరిపక్వావస్థ అని అర్థం కాదని సర్దుబాటు మాటలలో పడ్డారు. అది చూచాం.

న్యూటన్ సూత్రాలు మందవేగంలో సాగే ప్రకృతి గమనాన్ని వివరించాయి. ప్రచండమైన వేగాల్లో విఫలమైనాయి. ఐన్‌స్టీన్‌సూత్రాలు ఆ తీవ్రవేగాలలో ప్రకృతి గతులను వివరించడమేగాకుండా, మందవేగంలోని ప్రకృతిగతులనుకూడా వివరించగలుగుతున్నవి. న్యూటను సూత్రాలు యిచ్చేఫలితాలను ఐన్‌స్టీను సమీకరణాకూడా యిస్తాయి. ఉభయగతులకు ఐన్‌స్టీన్ సిద్ధాంతం వర్తిస్తుంది. అందుచేతనేఅది న్యూటన్ సిద్ధాంతంకన్నా ఉన్నతం అంటాము. న్యూటన్ సూత్రాల్లేకుండానే మొత్తంపని జరుగుతుంది. గతితర్కం ఫార్మల్‌లాజిక్ చేసేపనంతా చేయాలి. ఆపైన అఫార్మల్‌లాజిక్ చెయ్యజాలనిపనికూడా చేయాలి—అదే హెగెల్, మార్క్స్, ఎంగెల్సులభావంకావాలి. నిరపేక్షం—స్థితిసాపేక్షం—నిరపేక్షమైన స్థితినాస్తి – రెండుగతులతుల్యతే స్థితియని చెప్పినదాని అర్థమంతా స్థితితర్కంయొక్క పనిని గతితర్కం చేయలేకపోతే వ్యర్థమైపోయినట్టే. ఉన్నత తర్కమనే మాట సార్థకం గావడంలేదన్నమాటే.

## ఆ గతితర్కమంతా పరిశోధనలేక పడివుందట

లాక్షణిక తర్కవిజయ పరంపర తర్వాత గతితార్కికుల రచనలలో ఆత్మరక్షణాయత్నమేగాని లాక్షణిక తర్కం యొక్క కొరతనీ, అసమర్థతనీ చూపించే ఎదుర్కొనే ప్రవృత్తి(యత్నం) లోపించింది. "గతితర్కంలో విస్తృతమైన పరిశోధన గత పదిహేనేళ్ళనుంచే (1972 నుంచే) చేస్తున్నామనీ," "దురదృష్టవశాత్తూ

లాక్షణికతర్కశాస్త్రవేత్తల ఆక్షేపణలకు ఆహారమైపోయేట్టుగా వైరుధ్యాన్ని నిర్వచించి, నిర్దేశించిన గతితార్కికులుకొందరున్నారని, లాక్షణికతార్కికులుఆక్షేపించకుండా వైరుధ్యాన్ని నిర్దేశించవచ్చుననీ, "దురదృష్టవశాత్తూ యిప్పటిదాకా కూడా (1977 వరకు) శాస్త్రజ్ఞానావిష్కరణలో కొన్ని ఆలోచనారూపాలు గాఢమైనక్లిష్టమైన (Complexes) ఆలోచనా రూపాలుగావడాన్ని గూర్చి సోవియట్ తత్వరచనా వ్యాసంగం చాలా తక్కువగా వున్నదనీ" రాసుకోవడం బాగా కనిపిస్తున్నది. ఈ సందర్భంలో పశ్చిమ దేశాల మార్క్సిస్టులనుంచీ వెనుకటివలె రచనలు వెలువడటమే లేదు. సైబర్నెటిక్సుతో గతితార్కికుల ధోరణిలో పెద్దమార్పు యీ విధంగా వచ్చేసింది.

## సెమియోనోవ్ ఒప్పుకోలు

సైబర్నెటిక్సును వ్యతిరేకించేటప్పటికి రష్యన్ గతితార్కికు లేమే విజ్ఞాన శాస్త్రాల్లో ప్రగతిని వ్యతిరేకించి వున్నారో ఆ సెమియోనోవ్ చక్కగా చెప్పాడు.

"I have no wish to accuse soviet philosophers, most of whom adopted sound views Sound of them, however, and others who were not philosophers, rejected rather strongly, as a matter of fact, the principle of relativity, cybernetics and the concept of resonance in chemistry. There were also attempts to provide philosophical substantiation for the erroneus genetical biological theory propounded by Lysenko, Prezent and others who wished to dictate to science."

ఈ చెప్పినవాటిలో జీవశాస్త్రంలో వారసత్వలక్షణాలసంక్రమణ విభాగంలో టి. డి. లైసెంకోస్కాండల్ జగద్విదితమైనది. సైబర్నెటిక్సు సంగతి యిప్పుడే చూచారు. ఇక రసాయన శాస్త్రంలో రెసొనెన్సును, ఐన్‌స్టీన్ రెలిటీవిటీని రష్యనులు తిరస్కరించిన సంగతి వినేముందు యివన్నీ తాత్వికవ్యతిరేకతలని గతితార్కిక భౌతిక వాదదృష్టిదోషాలనీ జ్ఞాపకం చేసుకోవాల్సివుంటుంది. రెసొనెన్సు అన్నేది కెమిస్ట్రీలోని మెసోమెరిజం అనే అనుబంధ విభాగానికి సంబంధించినట్టిది.

## శాఖరోవ్ మొత్తుకోళ్ళు

వీరు రష్యన్ అధికార వ్యవస్థలో అణుక్కానిపోయి, లంచుకు వలసిన మెలకువ మెత్తనలతో పలుచాయల్లో లీలగా యేమిధ్వనిస్తున్నారో, ఎంత అనుక్రంతో ఏమి సూచిస్తున్నారో దాన్నే రష్యన్ ఉదజనిబాంబునిర్మాత, రష్యన్ న్యూక్లియార్ ఫిజిసిస్టుశిరోమణి అయిన శాఖరోవ్ తిరుగుబాటుదారుగా పేరొంది 1968లో బాహాటంగా తన ఆవేదనను వెళ్ళబోసుక్కొన్నాడు. స్పష్టంగా ప్రకటించాడు. తన దేశము-

మార్క్సిస్టు దృష్టికి కట్టుబడిపోయి వెనక బట్టిపోయిందని , సృజనాత్మకతను చంపు కొన్నదని ఆక్రోశించాడు. "ఇటీవలికాలంలో వైజ్ఞానిక, సాంకేతిక శాస్త్రాలు సాధించిన మహత్తర విజయాలన్నీకూడా సోవియట్ రష్యాకు వెలుపలనే సాధించారు"అన్నాడు "All the great scientific and technologicd discoveries of recent times have been made outside the U S. S. R." ఇదీ పరిస్థితి. స్టాలిన్ అనంతరకాలాన్ని గూర్చే శాఖరోవ్ ఇలా మాట్లాడాడు.

## గతితర్కంతో వెనుక బట్టిన రష్యా

రక్షణరంగంలో, సైనిక పాటవంలో సోవియట్ దేశం అమెరికాతో సమ ఉజ్జీగానో, అమెరికాను మీరిపోయో వుండవచ్చు. అంతమాత్రాన వైజ్ఞానిక సాంకేతిక రంగంలో తొలివిజేతలు వారే కానక్కరలేదు. ప్రపంచంలోకెల్ల పెద్దదైన ప్రోటాన్ యాక్సిలేటరును, ఆరుమీటర్ల గొప్ప టెలిస్కోపును నిర్మించి వుండవచ్చు. కాని విజ్ఞానశాస్త్రపరిశోధనలో, సిద్ధాంతీకరణలోమాత్రం యింకా వెనకేవున్నారు.రక్షణరంగ ములో అత్యావశ్యకమైన కంప్యూటర్లలో కూడా రష్యన్లు వెనకేవున్నారు. పైనా, రష్యాలకు ఆధునికమైన కంప్యూటర్లు కొన్నింటిని అమ్మడానికి ఒకఅమెరికన్ ప్రైవేటు సంస్థ చేసుకొన్న ఒడంబడికను ముందు మంజూరుచేసి, ఆపైన అమెరికా ప్రభుత్వం నిషేధించిన ఉదంతం దానినే నిరూపిస్తున్నది. ప్రకృతిపరిసరాలను,మనుష్య జీవనానికి గండముతూకాన్ని కాపాడాలనే ఇకాలజీలోను, గ్రహాంతర నాగరికతలకై సాగించే పరిశోధనలోనూ, యింకా యితర రంగాలలోను వెనుకబడి వున్నట్టురష్యన్ రచనలే తెల్పుతున్నాయి.

రష్యన్లు వైజ్ఞానిక సాంకేతిక రంగాలలో వెనుకబడివున్నా లేకపోయినా అక్కడ గతితర్కదృష్టి దోహదం కాలేదుగాని అదేమైనా ద్రోహదంగా లేదా అన్నదే ప్రస్తుతాంశం. వారింకా తత్వవేత్తలతో శాస్త్రకారుల ఐక్యసంఘటనఅంటూనే వున్నారు. గతితార్కికులను, పరిశోధకులను కలిపి ఉమ్మడి పరిశోధనా ప్రణాళికలు పెట్టుతున్నారు. Joint research by philosophers and scientists అని వ్రాస్తున్నారు. ప్రపంచములో యిదెక్కడా లేదు. ఈ ఉమ్మడి పరిశోధనా ఫలితాలేమిటో, అవెంత ఫలప్రదాలో వినవలసిన సంగతే.

## రెలిటివిటీని నిషేధించిన రష్యన్ గతితర్కం

రష్యన్లు రెలిటీవిటీని ఆమోదించలేదని, అడ్డుకొన్నారని ఇప్పుడుసెమియొనోవ్ అధికారికంగా చెప్పగావింటున్నాము. 1960 దాకా యీ దేశంలో మార్క్సిస్టులయిన సైన్సు విద్యార్థులు రెలిటీవిటీమీద రష్యన్ అభిప్రాయమేమిటో తెలియక కొట్టుకొనే

వారు, బ్రిటిష్ మార్క్సిస్టుల వ్రాతలే వ్రాతలు. ఆ రహస్యంకాస్తా ఇప్పుడు విప్పిచెప్తున్నారు. 1950 తరువాతనే రెలెటివిటీ, క్వాంటం సిద్ధాంతాల తాత్విక పర్యవసానాలను రష్యన్లు ఆలోచించసాగారు, అంతకుముందు ఆలోచించలేదంటారు.

రెలెటివిటీపట్ల రష్యన్ వ్యతిరేకత యెంత పిచ్చిగా సాగిందో, విజ్ఞాన శాస్త్రరంగం యెంత అశాస్త్రీయకరమైన తాత్విక ద్వేషానికి గురైనదో స్పష్టమైనచిత్రం బెర్ట్రాండ్ రస్సెల్ నుంచి దొరుకుతున్నది. 1940లో రస్సెల్ అమెరికాలో ఒక వ్యాసములో వ్రాసినప్పటికీ 1957 దాకా అది పుస్తకరూపం పొందలేదు. బహుశా 1970 దాకా ఇండియా దాన్నెరుగదు. 1938 డిసెంబరు సంచిక Astronomicai Journal of The Soviet Union నుంచి రస్సెల్ ఉల్లేఖించాడు.

"The modern bourgeois cosmogony is in a state of deep ideological confusion resulting from its concept the o l true dialectic materialistic concept, namely the infinity of the universe with respect to space and time.

విశ్వం ప్రదేశం అనంతం కాదు, కాలం అనంతంకాదు, పరిమితాలు అని రెలెటివిటీ చెప్పింది. గతితార్కికం విశ్వం, కాలప్రదేశాలు అనంతాలు. కాబట్టి రెలెటివిటీవిసిక్ ఖగోళశాస్త్రం, బూర్జువావిజ్ఞానశాస్త్రం అన్నారు. అంతటితో ఆగలేదు. ఫాసిజంతో దానికి సంబంధం కలిపారు. విప్లవవ్యతిరేకతతో ముడిపెట్టారు. ఐన్‌స్టీను తొలిసిద్ధాంతం నాటికిఒక పేటెంట్సు కొట్టులో గుమస్తాగా పొట్టపోసుకొనే పేదవాడు సుమా!

"The hostile work of the agents of Fascism, who at one time managed to penetrate to leading positions in certain astronomical and other institutions as well as in press has lead to the revolting propaganda of counter-revolutionary bourgeois ideology in the literature."

రెలెటివిటీని ఆమోదించిన సైంటిస్టులకు ఖగోళ పరిశోధనాలయాధికారాలనుండి తీసివేశారని కూడా పై వాక్యంనుంచి ఊహించగలరు. అదేజరిగింది.

"The Expose of the enemies of the Soviet people makes necessary the development of a new Soviet materialistic cosmology"

సోవియట్ భౌతికవాద ఖగోళశాస్త్ర మొకటి వినూతనంగా తయారుచెయ్యవలసి వున్నదన్నారు. కాని అటువంటిదొకటి యింతవరకు రష్యన్లు తయారుచేసినట్లులేదు గాని. ఆ పట్టీ కాస్తా స్టాలిన్ మరణంతో మరచిపోయారనుకొందాము, మానుకొన్నారను కొందాము.

# పూలతో పూజిస్తే రాళ్లతో కొట్టారు

ఫాసిజం, బూర్జువాజీల విపరీతవ్యతిరేకతతో ఇలా సాపేక్ష్యతను పుట్టిపెట్టిన వంతాఐనిస్టీన్ను సోవియట్ ఎకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో గౌరవసభ్యత్వాన్ని అయాచితంగా యిచ్చి, సోవియట్ మిత్రమండలి సభ్యుడిగా తీసుకొని లెనిన్ నాటి విద్యామంత్రి లూనాచార్‌స్కీని పంపి రష్యన్ సోషలిస్టు ప్రయోగాన్ని గూర్చి వినిపించి లెనిన్ గొప్పవాడనే మాటను. సోవియట్ పట్ల అభిమానసానుభూతుల్ని పలికించుకొని పట్టుకొచ్చి వాడుకొంటున్న తర్వాతనే యివన్నీ రాయించారు. రష్యా ఇలా రాయించినాకూడా ఐనిస్టీను సానుభూతి సహకారాలను చివరంటా అనుభవించింది. ఈ కథ సర్వందాచేసి ఆయన జీవితకథలిప్పుడు రాస్తున్నారు.
ఇదేమి ధర్మమో పాఠకులు ఆలోచిస్తారు. ఐనిస్టీన్ బ్రతికి వుండగానే రారు. క్రుశ్చేవ్ నాడు కూడా రష్యన్లు ఆయన తాత్వికాభిప్రాయాలేమిటి అనుమానంతీరలేదు. వారెప్పుడెప్పుడు ఏమిచేసినా, ఏమి అంటున్నా అదంతా తెలిసికూడా వారి ఉద్యమాలతో సహకరించారు. రష్యన్లు తన అప్రతిష్ఠాకరమైన యీ వైఖరి సర్వాన్నీ దాచేసి ఆయన జీవితకథలు, భాష్యవ్యాఖ్యానాలు రాయిస్తున్నారు.

రష్యన్ల ప్రవర్తన ఇలావుండగా, అంతకుముందే నాజీజర్మన్లు ఆయనసిద్ధాంతము ఆర్యవిజ్ఞానాన్ని భగ్నంచేస్తోందని, అది యూదుమర్విజ్ఞానమని 1919లోయాంటీ ఐనిస్టీన్ లీగు ఏర్పరచి, ఆ సిద్ధాంతం తప్పని నిరూపిస్తే పారితోషికాలిస్తామని వైజ్ఞానికులను ప్రలోభపెట్టి, రెచ్చగొట్టి సభలు ప్రదర్శనలతో వీధికెక్కారు. 1922 సోవియట్ సైన్సు ఎకాడమీ, సోవియట్ మిత్రమండలి సంబంధాలతో వారింకా మితిమీరిపోయి, రష్యన్ గూఢచారిగా అరోపించి మరణశిక్ష విధించాలని అలోచించారు. ఆయన ఇల్లువగుల గొట్టించారు. హత్యాప్రయత్నందాకా వెళ్ళారు. తప్పుకొని దూరముగా 1933 కి అమెరికాలో తలదాచుకోవలసి వచ్చింది. 1938 లో రష్యన్ దుష్ప్రచారం చూశారు గదా!

ఐనిస్టీన్‌పట్ల, ఆయన సిద్ధాంతంపట్ల, రూసో–జర్మన్ ప్రవర్తనలో సామ్య తారతమ్యాల వివక్ష పాఠకులవంతు. ఇది స్టాలిన్ యుగవైపరీత్యమేనా, మరేమీ కాదా! ఆయనపట్ల ముందువెనకల సంశయావస్థల మాటేమిటి? లూనా చరస్కీ–ద్వారా మంచిమాటలు రాబట్టిన లెనిన్, ఐనిస్టీన్‌ను గూర్చి మంచిమాటొకటన్నాడా? మాకిజం మీద ఖండనా గ్రంథం వ్రాసిన లెనిన్ – మాక్‌పు ఏకలవ్య శిష్యత్వం ప్రకటించుకొన్న ఐనిస్టీను సిద్ధాంతం ఫర్వాలేదు, ప్రమాదకారికాదు, ఇలా సరిపెట్టుకోవచ్చని

తాను తెల్సుకొని, తానుగా అలా వ్రాతలో పెట్టకపోతే, ఆయన సమీపవాసులు లెనినిజానికి నిజమైన ప్రతినిధులుగా పోటీపడి టజావు చేసుకోవాల్సినస్థితితో మార్క్సు సూత్రాను ప్రాణితంగా వుండే సాపేక్ష్యతను మార్క్సుప్రభావాన్ని చాటి చెప్పుకొన్న ఐనిస్టీన్ను తిరస్కరించకుండా మన్నించడం సాధ్యమా? ఇప్పుడంటే, అరవై యేళ్ళ తర్వాత అదుర్వైఖరివల్ల జాతిగా నష్టపడిన తర్వాత— మార్చుకొని మన్నించవచ్చుగాని అప్పటికది లెనిన్ సంశయాత్మను బట్టి వేసిన వైరితలు కాదా? అదంతా, భౌతికత, గతితర్కం సైన్సుపై సైన్సుగా భావించడాన్ని బట్టి కలిగింది కాదా? అటువంటిదికి ముందు జరగదని ఆశిస్తాం.

## నిన్న బూర్జువా సైన్స్, నేడు గతితార్కికమయింది

ఇంత నిరసనకు దుర్భాషణకు గురైన రెలిటివిటీగాని దానిక రిఐనిస్టీను ఆలోచనాగతులుగాని గతితర్కానికి సాక్షిభూతాలవుతున్నవని ప్రస్తుతం సోవియట్ గతితార్కికులు భాష్యం చెప్పుతున్నారు. ఐనిస్టీను సెమియొనోవ్ దృష్టిలో విప్లవతార్కికుడు (Revolutionary Logician) తర్క పరివర్తనా నిపుణుడు (Transformer of logic). ఒక్క ఐనిస్టీనే కాదు. ఆయన సిద్ధాంతాలేకాదు. ప్లాంకు, మాక్స్‌బార్న్, డిరాక్, ప్రబోలి, హైజన్‌బర్గ్ — వీరందరి శాస్త్రవిచారాలోచనాక్షణాల్లోనూ విప్లవ తర్కాన్ని, గతితార్కిక క్షణాలను చూస్తున్నారు. పరిశోధనలో సత్య సందర్శనా క్షణాలలో హేతువాద తార్కిక క్రమంకన్న వేరైన మానసిక వ్యాపారమేదో పని చేస్తున్నదేమోనని అన్వేషణలో గతితార్కికాలోచనను పెట్టేప్రయత్నం ఒకటి దండిగా సాగుతోంది. అది వెనకటికి మార్మిక క్షణంగా హేతువాదపరిధి కవతలిదిగా చెప్పడం వుంది. ఇప్పుడు దాన్ని గతితార్కిక క్షణం (Lialietic moment) చేయబోతున్నారు. దానిమీదే తగినంత రచన సాగలేదను ఆత్మవిమర్శలో వున్నారు.

ఇందులో అణునిర్మాణ చిత్రంలో వోల్ఫాంగ్‌పాలీ ప్రతిపాదించిన నిషేధక సూత్రం (Paulis exclusion principle) జె.బి.యస్. హాల్డేన్‌దృష్టిలోగతితర్కానికి



భిన్నమైన ప్రవర్తనకాగా, విస్మయకిప్పుడు గతితర్కానుగతముగా కనిపిస్తున్నది. ఇటువంటి భాష్యాల పుంపిడిలు మరొకసారి మరొకచోట విచారిద్దాముగాని యింకా ఇటువంటి గతితార్కికమైన ఆలోచనారీతి గల వాళ్ళలో యెన్నికగాకుండా యింకా మిగిలిపోయిన క్వాంటం శాస్త్రకారులుగిదవ వుండిపోయారు. అనిశ్చితా సూత్రకర్త హైజెంబర్గు, క్వాంటం తరంగ సమీకరణకర్త ష్రోడింగరు. వారి ఆలోచనమీద అనుమానం తీరలేదు కాబోలు, ఒరుదుజేవ్ సెమియొనోవ్‌ల గతితార్కికాలోచనాక్షణాల వాళ్ళపట్టీకలో యెక్కలేదు. మరెప్పటైనా అందులోకెక్కించారో లేక పాత అనుమా

నిపులుగానే వెలివేసే వుంచారో దొరికిన సమాచారాన్ని బట్టి తెలియడంలేదు. అనతి కాలంలో వారిద్దరి ఆలోచనా శిఖరాలనుకూడా గతితార్కికయోగం పట్టవచ్చునని ఆశించవచ్చు.

## గతితార్కిక భాష్యం కూడా చెప్పొచ్చు

గతితర్కమేమిటో అసలువినని ఆయా శాస్త్రకారులు కనిపెట్టిన సిద్ధాంతాలను, లాక్షణిక తర్కసూత్రాలు ఆధారంగా కనిపెట్టిన సిద్ధాంతాలను, ఫలితాలను ఒకప్పుడు గతితార్కికాలు కావని తెగడిన వానికి యిప్పుడు గతితార్కిక భాష్యం చెప్పేయత్నంలో రష్యన్లు నిమగ్నమై వున్నారంటే చాలా విపరీతంగా వుండొచ్చు. కాని ఆ విపరీతమే జరుగుతున్నది. దాన్ని పరిశీలించక తప్పేదేముందిగాని పాఠకు . కోసంగాను, అటువంటి భాష్యం సాధ్యమనేఅందాం. అయితే అంతటితోనే గతితర్కంయొక్క విజయం సాధ్యంకాదు.

## అంతే అయితే చాలదు సుమీ!

ఆ సిద్ధాంతాలు లాక్షణిక తర్కానికి విరుద్ధమని చూపించాలి. ఆ పనికూడా చేయకపోతే, ఆ విజ్ఞానశాస్త్ర సిద్ధాంతాలను రెండుతర్కాలూ సమానంగా అన్వయించే పరిస్థితి యేర్పడుతుంది. ఉభయతర్కాలకూ అనుగుణంగా భాష్యాలు వీలౌతాయి. అది గతితర్క విజయంకాదాలను. గతితార్కిక భాష్యమేగాని, లాక్షణిక తర్క భాష్యం చెల్లనేరదని నిరూపించినప్పుడే గతితార్కిక భాష్య విజయం. అంతపని రష్యన్లుగాని మరే పాశ్చాత్య గతితార్కికులుగాని చేశారంటారా? చెయ్యకపోతే ఏమీలేదు. అదే పోయినట్లు. చేశారంటే మాత్రం దాని చెల్లుబాటు విచార్యమవుతుంది. విజ్ఞానశాస్త్రంలో దానికి నూటికి చెల్లుబాటులేదని బెర్నాల్ అన్నాడనగాకూడా వింటాం. విజ్ఞానశాస్త్ర చరిత్ర గతికి చెల్లుతుందన్నాడట. ఆ విమర్శ మరోచోట మరొకసారి చూద్దాం.

ఇప్పుడు యిలా భాష్యం చేయడమంటే వరులు శ్రమించి సాధించిన ఫలితాలను కాజేయడంగా వుందని అనవచ్చుననుకొంటాం. సరే. అది అలా వుంచి యిప్పటి దాకా, అంటే ఒకటిన్నర శతాబ్ది వ్యవధిలో గతితర్కం విజ్ఞానపరిశోధనసిద్ధాంతానికి చేసినసేవ సున్న. పైగా తదభివృద్ధినిరోధకమయి వుంది. అది తీసికట్టుచేసిన పాత తర్కమే కొత్త పుంతలు త్రొక్కి యీ వైజ్ఞానిక సాంకేతిక యుగాన్ని ముందుకు తీసుకొని పోతోంది అని చెప్పుకోడానికి ఆక్షేపణ వుందా?

గతి తర్కాన్ని తలకెక్కించుకొంటే విజ్ఞాన శాస్త్రాలకు అది ఉపకరిస్తుందని, అదిలేకనే అవి బాధపడుతున్నవని, అది కలిగితే అదనపు జ్ఞానేంద్రియం కలిగినట్లేనని సూత్రించిన సిద్ధాంతమూలకర్తలు మౌలికంగా విజ్ఞాన శాస్త్రకారులు కాకపోతేకాకపోయారుగానివారి శాస్త్ర విజ్ఞానావగాహన గుణపరిమాణాలెట్టివి? వారిలోలేని లోపాలే తర్వాత వారిఅనుయాయులతోనే వచ్చాయనాలా? అక్కడున్నవే యిక్కడున్నవనాలా? అనే విషయము వుంది. అదే తర్వాత ప్రకరణం.

# మార్క్సు-ఎంగెల్సుల శాస్త్రవిజ్ఞానం-గతితర్కం

"A knowledge of mathematics and natural science is essentia to a concept of nature which is dialectical and at the same time, materialistic....Marx was well versed in mathematics .. went through as complete as possible a moulting in mathematics and natural sciences."   —Anti Duhring.

విజ్ఞాన శాస్త్రచరిత్ర సమాచారం ఒకపాటిగా తెలిసికొని ఎంగెల్సు డైలెక్టిక్సు ఆఫ్ నేచరుకు హాల్డేన్ వ్రాసిన పీఠికను మళ్ళీ చదివినట్టయితే ఎంగెల్సు విజ్ఞానానికి, గాఢావగాహనకు, దూరదృష్టికి పుస్తకం పొడవునా ఫుట్‌నోట్లలో ఆయన ఇచ్చిన కితాబులను అవతల బెట్టించే మరొక సంగతి ప్రాముఖ్యం వహించి పునరాలోచనలో పెట్టుతుంది.

## ఎంగెల్సు-ఐనిస్టీను హాల్డేన్లు

రివిజనిజానికి ఆది పురుషుడుగా ప్రసిద్ధిగాంచిన బెర్న్సుస్టీను ఎంగెల్సు యీ పుస్తకం వ్రాతపతిని 1924లో పట్టుకువెళ్ళి యీ శతాబ్దపు శాస్త్రపురుషుడైన ఐనిస్టీను చేతిలో పెట్టి చదివించినట్టూ, దానిలో ఎలక్ట్రిసిటీమీద ప్రచురణకు సిద్ధపరచిన పెద్ద అధ్యాయాన్ని (అనగా 70 అచ్చు పేజీల చిరుపుస్తకాన్ని) అయినా పూర్తిగా చదివించినట్టూ, అయితే ఆయనకు అదేమంత విశేషమనిపించలేదని, ఆసక్తిదాయకంగా కనిపించలేదని పీఠికలో ఆ హాల్డేనే చెప్పినసంగతి ఆకర్షించగా, ఆలోచనాప్రేరకంగాకా తప్పదు. ఐనిస్టీనులో యేకీభవించకా తప్పదు.

అయితే ఐనిస్టీను ఉత్సాహం చూపక ఉదాసీనంగా వుండిపోయాడన్న సంగతి తెలిసికూడా హాల్డేను ఆ పుస్తకానికంతటికీ ఆ అధ్యాయానికీకూడ ఫుట్‌నోట్లు కితాబులతోను, ఆ పీఠికతోను వెలువరించడమేమిటా అని మాత్రం ప్రశ్నకలగకపోదు. ఆ పీఠికరాసిన ఏటనే 1939లో **Great Soviet Biologist** అంటూ సోవియట్ సైన్సు స్కాండల్ సెంబర్‌పన్ టి. డి. లైసెంకోనుగూర్చి "కొందరు జీవశాస్త్రజ్ఞులు అతని సిద్ధాంతాలను శంకిస్తున్నప్పటికీ" **(although some biologists doubt his theories)** అని అంటూ, తాను ఆ కొందరిలో ఒకణ్ని కాదని సూచించుకుంటూ శాస్త్రాలు, ఆ తప్పుదారి పట్టేందుకు వాలుగా వుండి, అప్పటికి గొప్పగా ప్రశంసిస్తూ డైలీవర్కరు పత్రికలో వ్రాసిన సంగతి హాల్డేన్నుగూర్చి గుర్తుకువస్తే మాత్రం మార్క్సిజాన్ని అవలంబించిన కొత్త ఉత్సాహంలో చేసినసాహసం అనుకోకతప్పదు. అప్పటికి లైసెంకో జెనిటిక్స్‌ను అనుమానించని వాడుగదా,పిదప(పది)పదిహేనేళ్ళలో ఆ లైసెంకోకథ కాస్తా తెలుసుకొని కమ్యూనిస్టు పార్టీసభ్యత్వంనుంచి వైదొలగినపిదప యీ పీఠికలో జేసినతన సాహసం తనకే విస్మయం కలిగించి వుంటుంది.

ఇంతకూ ఎలక్ట్రిసిటీ మీద ఎంగెల్సు చర్చ యెలా సాగిందో, అనాటి శాస్త్ర విజ్ఞానం యెక్కడుందో,దాని పురోగతి యేదిశలో జరుగనుందో. ఎంగెల్సు గమనికలో అదెంతగావుందో హాల్డేన్ ప్రశంసా వాక్యాల సామంజస్యం యేమిటో కాస్త చూడదగిన విషయం.

## విద్యుత్సిద్ధాంతంలో త్రికసందర్శనం

విద్యుత్తు అన్నది ప్రత్యేకమైన రెండు విరుద్ధ విద్యుత్ ద్రవాలని అంతకు ముందు ఒక ప్రతిపాదనగా వుండేదట. అది విద్యుత్తుపదార్థమనే సిద్ధాంతం. అందుకు విరుద్ధంగా అది పదార్థం యొక్క ఒకానొకశక్తి (Force) అదొకచలన రూపము (Special form of motion) అని మరికొందరి ప్రతిపాదన అట. ఇది పదార్థంనుంచి విడివడిన వెలువడిన ఒకానొకశక్తి భేదం (Force) అన్నారు. అది మైకేల్‌ఫారడే (1815) మొదటి ప్రతిపాదనట. అంతకుముందే అటువంటి భావాన్నే వీరి గురువు హెగెల్, విద్యుత్తును గూర్చి ప్రతిపాదించాడని ఎంగెల్సు ప్రత్యేకంగా వ్రాశాడు. హెగెల్ ఫారడేల విద్యుత్సిద్ధాంతం అన్నాడుకూడా. ఇది మొదటి పక్షానికి ప్రతిపక్షం. వాటికిక సమన్వయం కావాలిగదా.దాన్ని హెగెల్ చనిపోయాక ఫారడే 1846లోమళ్ళీ సర్వప్రదేశ పరివ్యాప్తమైనట్టి ఒకానొక పదార్థంగాని పదార్థమైన ఈథరుసంచలనమే విద్యుత్తని కొత్త ప్రతిపాదనను సమన్వయ సిద్ధాంతంగా ప్రతిపాదించాడట, అనగా

త్రికగతి (Triad) పూర్తయిందన్నమాట. దీన్నే మాక్సువెల్ ధ్రువపరచాడట. ఈ విషయాలు 1882 నాటికి చదువుకోగలిగాడు ఎంగెల్సు. హెగెల్ విద్యుత్ సిద్ధాంతం మాట ఒక్కటేగాదు, గతినిత్యం, అవినాశి (motion is indestructible) వగైరా వంటివెన్నో పూర్వతత్వవేత్తలు చెప్పినవాటినే ఆనాడు విజ్ఞానశాస్త్రపరిశోధకులు నిరూపిస్తున్నారనే అభిప్రాయం ఎంగెల్సులో ప్రబలంగా వుంది. అనాటి సిద్ధాంతాల నెన్నిటినో గ్రీకు తదితరతత్వవేత్తలు చెప్పి వున్నారనీ, అదంతా చదువుకొని వుంటే శాస్త్రపరిశోధకుల కెంతో ప్రయోజనముంటుందని ఎంగెల్సు పదేపదే చెప్పుతుంటాడు. శాస్త్రపరిశోధనకు తత్వవిజ్ఞానం మార్గదర్శకం కాగలదన్నట్టుంటాడు ఎంగెల్సు. (ఇంగ్లీషు అనుబంధం చూడగలరు.)

## హాల్డేన్ ప్రశంసల ప్రహసనం

ఈ విద్యుత్సిద్ధాంతాలను అంత అలస్యంగా చదువుతున్నాడేమిటాయన్నది గాని, అప్పటి సిద్ధాంతాలెన్నో పాతతత్వవేత్తలవే నంటున్నాడేమిటాయనిగాని ఆలోచించని హాల్డేను, డీకార్టే చెప్పిన ఆ ఈథర్‌ను విద్యుత్సిద్ధాంతంలో ఫారడే ప్రతిపాదించడానికన్నా, ఆ ప్రతిపాదనను (తత్వవేత్తగా) ఎంగెల్సు ఆమోదించడమే గొప్పవిశేషమని, అదెంతో అద్భుతమని, దాన్ని అంగీకరించినందువల్ల మరో అరవై యేళ్ళకు సైన్సులో రానున్న పరిణామాలను ఎంగెల్సు వూహించినట్లని, ఈథర్ సిద్ధాంతం వుంటుండగా కనిపెట్టినరేడియో బ్రాడ్‌కాస్టింగ్ వగైరాలన్నీ ఎంగెల్సు భవిష్యదర్శనంగా జమకట్టాలన్నంతగా పుట్‌నోట్లు తెగరాశాడు.

1900–1930 కాలంలో ప్రాబల్యం వహించిన పదార్థకణప్రవాహంగా విద్యుత్తును చెప్పిన సిద్ధాంతానికి ఎంగెల్సు సుతరామూ యిష్టపడనివాడని, ఈథరు సిద్ధాంతాన్నే ఆమోదించకపోయినట్టయితే ఆ పదార్థకణాలన్నవి కణాలేకావని తరంగాలెన్నో కలిసినచోట తరంగాలే కణాలనిపించుతాయని 1920–1930ల్లో క్వాంటం ఫిజిక్సులో వెలువడిన పదార్థ తరంగసిద్ధాంతానికి భిన్నమైన పక్షం తీసుకొన్నవాడయ్యేవాడని యేమేమో యెంతెంతో విలువలు పలువలుగా పెంచి విజ్ఞానశాస్త్ర నిగ్రహానికి, నిష్కర్షకు, నీతికీ రీతికి తప్పినవాడై మితిలేని అసంభావ్య ప్రశంసల చిత్తజల్లులు కురిపించాడు. ఆ సిద్ధాంతాలను ప్రతిపాదించి, గణితరూపమిచ్చి, ఆచరణకెక్కించిన ఫారడే, మాక్స్‌వెల్ మొదలైన శాస్త్రకారులకంటే వారి నంగీకరించిన ఎంగెల్సే గొప్పవాడన్నట్టుగా వుంది హాల్డేన్. అప్పట్లో స్వీకరించిన కొత్తమతం మ(హ)త్తు యిది.

## అనుమానించినా గొప్పే, అంగీకరించినా గొప్పే

అంతేకాదు. ఆ యీథర్ వునికిని శంకిస్తున్నాడని అంతకుముందు మరొక సందర్భంలో వ్రాసుకొన్న నోట్సులో ఒకానొక వాక్యానికి అర్థంతీసి అలా శంకించడంకూడా గొప్పేనని మరొక ప్రశంస కురిపించాడు హాల్డేన్. ఈథరు ఉనికిని ఒప్పుకొని దానిమీదకట్టిన విద్యుత్సిద్ధాంతాన్ని ఒప్పుకొన్నదీ గొప్పే—ఆ ఈథరు అసలు లేనిదేమోనని శంకించినదీ గొప్పే. ఇంకేమి చెప్పేది !! వెర్రిముదిరి వేయి విధాలయిందనాలేమో !

"If only on account of light, the ether is not to be dispensed with. Is the ether of material nature? It, if exists at all, it must be of material nature, it must come under the concept of matter. But it is not affected by gravity."

ఈథరు భూమ్యాకర్షణకు లోనుకానిదట. అయితే అది పదార్థం కాకపోవాలి. పదార్థంకానిది లేకపోవాలి. (Gravity as the most general determination of materiality is commonly accepted.) అని వ్రాసుకొన్న ఎంగెల్సు ఈథరు నాస్తి అనలేకపోయాడు. అంటే విద్యుత్ ఈథరుయొక్క ఒకానొక చలనం అన్న పై సమన్వయ సిద్ధాంతాన్ని త్రోసివెయ్యలేకపోయాడు.

## ఈథరును నమ్మించిన గతితర్కం

గతితర్కం విజ్ఞానసాధనమయితే, అది సైన్సులో మధ్యవర్తిలాగా పనిచేయగలదైతే ఒరొక అదనపు జ్ఞానేంద్రియం, అదనపు తర్కముగనక అయితే ఎంగెల్సు ఈథరును ఎగురగొట్టివుండాల్సినవాడు. "ఈథరును శంకించిన స్థితినుండి అంగీకరించిన స్థితికి ప్రయాణించాడు అంటే గతితర్కంగాని భౌతికవాదంగాని అతనికి ఏమాత్రం ఉపకరించలేదనడమేగాదు అపకారం చేసిందనక తప్పదుగదా!"

అసలానాటికే ఈథరును విద్యుత్సిద్ధాంతంనుంచి త్రోసివేయడం ఆరంభమయింది. విద్యుత్తు పదార్థంయొక్క ప్రత్యేకకణాల ప్రవాహమని, అది అణువుకన్న చిన్నకణమని దానికి ఎలక్ట్రాన్ అని నామకరణంచేసి దాన్ని కనుక్కోవాల్సివుందని 1874లోనే ఎంగెల్సువుంటున్న ఇంగ్లాండులోనే జాక్సన్ స్టోనీ అనే శాస్త్రకారుడు సూచించివున్నాడు. ఆ విషయం ఎంగెల్సు యెరుగడు. అంటే ఆయనకు తాజాపరిశోధనలతో పరిచయంలేకుండా వున్నదని రుజువవుతున్నది. 1846 నాటికున్న సిద్ధాంతాల

కన్న వేరైన ప్రతిపాదనలేమున్నాయో పూర్తిగా తెలుసుకోకుండానే 1882లో 'విద్యుత్తు' మీద ఒక చిన్నపుస్తకంరాసినవాడు ఎంగెల్సు అని హాల్డేన్ కానలేదు.

కాంతిప్రసారానికి కూడా మాధ్యమంగా (Medium) ఈథరును నిలబెట్టారు. అందులోకూడ అది సమస్యలను సృష్టించింది. గ్రహాంతరప్రదేశాన్నిదాటి కాంతి భూమిమీదకు ప్రసరించాలంటే, ఆ ప్రదేశం శూన్యంగా వుండరాదని, అందులో ఒకపదార్థమేదైనా నిండివుండాలని, చెరువునీటిలో రాయివేస్తే తరంగాలు యేర్పడినట్లుగా, కాంతిప్రదేశంలో నిండివున్న ఈథరులో తరంగాలను లేపగలగాలని, అనగా తరంగాలు యేర్పడడానికి వీలుగా ఆ యీథరు వాయువుకన్నా తేలికైనదిగా వుండాలని, అదెటువంటి తేలికదైనా కాంతిప్రసారాన్ని యెంతో కొంత అడ్డుకోగలిగిందిగా వుండాలని, అసలడ్డుకోలేనిదైతే తరంగాలే కలుగనేరవని, కాని అడ్డగించేశక్తి ఎంత తక్కువగావున్నా, అనంతంగావుండే విశ్వాంతర దూరదూరాల నక్షత్రాలకాంతి భూమిదాకా చేరలేక ఆగిపోవలసివుండాలని, అనగా ఈథరు కాంతివేగాన్ని మందగించేది అవుతుందని అనగా కాంతివేగం నిత్యం, స్థిరాంకం కారాదని జోహన్ హెన్రిక్ మాడ్లర్ అనే జర్మన్ ఖగోళజ్ఞుడు 1861లో వ్రాయగా రష్యన్‌లోకి ప్రోవ్ అనే ఆయన 1875లో నిర్ధారించిన విషయం ఎంగెల్సు చదువుకొని కాంతివేగం-ఈథరు నిరోధం సమస్యగా పరిగణించాడు. ఈథరు నిరోధించడం కాదన్నారు శాస్త్రజ్ఞులు.

ఇలా 1875 నాటికే శాస్త్రప్రపంచంలో ఈథరంటేకొంత సందేహాస్పదంగా తయారై పర్యాప్తి కోల్పోతున్నది. తేలిపోతున్నది. అదివివాదగ్రస్తమయింది. నిరసిస్తుంటేనో గాని, భౌతికశాస్త్ర ప్రమాణాలతోగాని ఎంగెల్సు దాన్ని రద్దుచేసుకోవాల్సిన భావము లేకపోయాడు. 1881లోనే ఈథరులో భూమిపరుగెత్తుతుంటే యేర్పడే సమస్యలొక విధంగా వుంటాయనీ, దాని ఫలితాల పరిమాణాన్ని నిర్ణయించుదామని మైకేల్సన్ ఇంటర్ ఫెరోమీటర్ ప్రయోగం జరిగింది. అనుకొన్న ఫలితాలేవీ కానరాలేదు. అసలు ఏఫలితాలూ లేవు. అదొక విఫల ప్రయోగంగా అందరినీ విస్తుపరచింది. మళ్ళీమళ్ళీ ఇంకా యింకా కచ్చితంగా అదే ప్రయోగం చేశారు. మోర్లే అనే ఆయననుకూడా కలుపుకొని ఏలోపానికీ అవకాశంలేకుండా పరికరాలను, పరిస్థితులను పక్కాగా నిర్ణయించి "మైకేల్సన్ మోర్లేల ఉమ్మడి" ప్రయోగముగా 1887లో చేశారు. మళ్ళీ "నిష్ఫలమైన మైకేల్సన్ ప్రయోగంగానేలయమైంది. కాని అది ఏ ఫలితాన్నీ సూచించకపోవడమే ఆ ప్రయోగ సాఫల్యం అన్నాడు ఎర్నెస్టుమాక్. ఆ ప్రయోగ వైఫల్యం ఈథర్ అస్తిత్వ భావవైఫల్యం నాయనా అని విప్పి చెప్పాడు ఎర్నెస్టుమాక్.

అనాటి శాస్త్రజ్ఞులెవ్వరూ ఆమాక్ మాటను లెక్కచేయలేదు. ఎంగెల్సు అసలా మాట వినలేదు. 1905లో ఆల్బర్టు ఐనిస్టీన్ తన ప్రత్యేక సాపేక్ష్యతా సిద్ధాంతంలో అదే మాట వ్రాసినా వెంటనే దాన్నియెవరూ పట్టించుకోలేదు. 1907లో ప్రత్యేకంగా పనిగట్టుకొని ఐనిస్టీన్ విపరంగా విడమరచి ప్రకటించేదాకా ఈథర్ సైంటిస్టుల భావ

ప్రపంచం నుంచి వైదొలగలేదు. 1896 దాకా జీవించి ఏదో ఒకటి వ్రాస్తూనే వున్న ఎంగెల్సు విజ్ఞాన శాస్త్ర సమాచార సేకరణలో ప్రకృతిలో గతితర్కం అనే నోట్సు వ్రాసుకొన్నంతలో కూడా బాక్ (back) నంబరుగానే వున్నాడుగాని తాజాపరిణామాల కోసం వెంపరలాడి పోగుచేస్తున్నవాడు కాదని స్పష్టపడుతున్నది.

ఈథరులేదని ఎంగెల్సు చెప్పలేక పోవడాన్ని ఎత్తిచూపించడం అనాడుఆయన గాని ఆ మాట చెప్పివుంటే, వైజ్ఞానిక ప్రపంచం ఆమోదించి వుండేవని చెప్పడానికి కాదు, గతితార్కిక భౌతికవాదమే గనక ప్రకృతి పరిశోధనలో మార్గదర్శక పాత్ర వహించగలదైతే, ఆనాటికి ఈథరుమీద వచ్చిన సమస్యలకు ఎంగెల్సు దాన్ని లేని దానినిగా తేల్చివేయగలిగేవాడని చెప్పడంకోసమే.

మార్క్సు ఎంగెల్సులు గతశతాబ్దంలో ముఖ్యమని పరిగణించిన విజ్ఞానశాస్త్ర ప్రతిపాదనలు మూడున్నవని చెప్పుకొన్నారు. అవేమిటో, వాటి ప్రాధాన్యం వారి కేమిటో తర్వాత చెప్పుకొందాంగాని అందులో అప్పటికీ యిప్పటికీ అత్యంత ప్రాముఖ్యం గలది డార్విన్ పరిణామసిద్ధాంతం. దాని అవగాహనలో ఎంగెల్సు యెలా వున్నాడో చూద్దాము. దాని సామాజిక పర్యవసానాల విషయమైన అవగాహన మాట గాదు, అదెలాగూ వివాదానికి చోటేగాని, వైజ్ఞానిక పరిశోధనా పరిధిలోని మాటవరకే ప్రస్తుతాంశంగా తీసుకొందాం.

## డార్విన్ ప్రకృతివరణాన్ని కాదన్న గతితర్కం

డార్విన్ సిద్ధాంతాన్ని చర్చించి ఎంగెల్సు వ్యక్త పరచినట్టి అభిప్రాయాలు తెలిసినట్టయితే తన ఆలోచనలో కొంత తికమక తప్పి వుండేదని గదా హాల్డేన్ ప్రకటించాడు. ఆ అభిప్రాయాలు ఫలానావియని ఆయన చెప్పలేదు కావున తెలియడం లేదుగాని డార్విన్ నిజానికి ఆయువుపట్టయిన ప్రకృతి వరణసూత్రాన్ని (Natural Selection) మాత్రం సరిగా స్వీకరించక చాలా పొరపాటు అభిప్రాయాన్ని వ్యక్తం చేసినట్టు స్పష్టమవుతున్నది.

ఎర్నెస్టుహాకెల్ చెప్పిన "పరిసరాను వర్తన, వారసత్వము" (Adaptation and Heredity) అన్నవే ప్రకృతివరణం (Natural selection) లేకుండానే సమస్తమైన పరిణామ వ్యాపారాన్ని చక్కబెట్టగలవు, దిద్దగలవు, శాసించగలవని ఎంగెల్సు అభిప్రాయపడ్డాడు. "Hakel's adaptatio n and heredity can bring about the whole process of evolution, without need for selection and Malthusianism."

ఆ అభిప్రాయం వగ్గర హాల్డేన్ మట్టుకు హాల్డేన్ నేటి జీవశాస్త్రజ్ఞుల్లో అత్యధికులు యీ అభిప్రాయాన్ని శంకిస్తున్నారని ఆ క్రిందే గమనిక ఒకటిచేర్చిచేయికడు

క్కొన్నాడు. జీవపరిణామ వ్యాపారంలో నేచురల్ సెలెక్షన్ పాత్రకు ఎంగెల్సు ఇంచు మించు నూన్నాచుట్టినట్టు అయింది. కాని నేడీమాటను శాస్త్రపరిశోధన శంకించడంకాదు. తిరస్కరించింది.

ఆర్జిత లక్షణాల పరంపరా సంక్రమణ (Inheritance of acquired characters) మనే లామార్కు సిద్ధాంతాన్ని విశ్వసించి, వ్రాసినంతలో ఎంగెల్సు రష్యాలో లైసెంకో ధోరణి తలచూపడాన్ని సూచించాడు, దానికి దారి చేశాడు, బల మిచ్చాడు. జనుశాస్త్రంలో (Genetics) లామార్కిజానికి గతితార్కిక సమర్థనను సమ కూర్చాడు.

"By recognising the inheritance of acquired characters, it extends the subject of experience from the individual to the genus"

Adaptation as the negative side that continually destroys what has been inherited but one can just as well take adaptation as the creative, active, positive activity"

డార్వినిజంమీద ఎంగెల్సు వ్రాసిన నాలుగుముక్కల మీద హాల్డేన్ ఎంతో కొంత యేదో విధంగా విభేదించి ఫుట్‌నోటులు చేర్చని దెక్కడో అంటే వెదకవల సిందే. అయినా ఆ పీఠికలో పెద్ద ప్రశంసలకు కొదవలేక పోయింది.

## థెర్మోడైనమిక్సు రెండో సూత్రంపై తిరుగుబాటు

పదార్థ విజ్ఞానశాస్త్రంలో మరో సిద్ధాంతం వుంది.శక్తి నిత్యత్వ శక్తి రూపాంత రీకరణ సూత్రం (law of conservation and transformation of energy) యాంత్రికమైన చలనశక్తి (Mechanical energy), విద్యుచ్ఛక్తి, అయస్కాంత శక్తి ఉష్ణశక్తి.... అంటూ వున్నవి గదా? ఇవన్నీ పరస్పర పరివర్తనీయాలని 1842–1846 నాటికి కనుగొన్నారు. ఎంగెల్సు లెక్కలో ఆ శతాబ్ది విజ్ఞానం రెండో ముఖ్య ఘటన. కాని ఆ సూత్రానికొక సవరణవంటిది 1850 నాటికి వచ్చింది.

యాంత్రికచలనం మొత్తం నిరవశేషంగా ఉష్ణశక్తిగా మారిపోతుందిగాని ఉష్ణశక్తియావత్తూ యాంత్రిక చలనంగా మారదని, కొన్ని పరిస్థితుల్లో కొంతవరకే అలా మారుతుందని క్లాసియస్ చూపించాడు. అది తర్కానికి విరుద్ధంగా వుంది. ఉష్ణ శక్తిమొత్తం యాంత్రిక చలనంగా మారితే తర్కసమ్మతంగా వుంటుంది. కాని యథార్థం; అది తర్కబద్ధంగా వుండాలని ఎంగెల్సు దిమాండు.

రెండు ప్రదేశాల మధ్య రెండు వస్తువుల మధ్య ఉష్ణోగ్రతల్లో తేడా ఉన్నంత వరకే, తేడా యెంత యెక్కువగా వుంటే అంత యెక్కువగాను, ఎంత తక్కువగా

కాని క్లాసియస్ రెండవసూత్రం తరువాత యిలా చెప్పాడు.

"One form of energy can be converted into another form of energy but the quantity of energy never looses anything thereby, on the contrary the total energy present in the world is just as constant as the total amount of matter present in the world."

పదార్థ నిత్యత్వం, శక్తినిత్యత్వం అనేసూత్రాలను న్యూటన్ యాంత్రిక విశ్వ సూత్రాలను క్లాసియస్ అణుమాత్రంకూడా భంగించలేవు. న్యూటన్ విశ్వయంత్రానికి [illegible] ఏర్పాటు బయటనుంచి రావాలి. ఉష్ణోగ్రతాభేదము అధికంగా ఉంచివేసే క్లాసియస్ విశ్వయంత్రంలో ఉష్ణోగ్రతాసామ్యావస్థ ఏర్పడగానే మళ్ళీ మళ్ళీ ఉష్ణోగ్రతావ్యత్యాసాలను నెలకొల్పే సాధనము ఏర్పాటవ్వాలి కావాలి. లేకపోతే భౌతికశాస్త్రాలు ఎగిరిపోతాయి, భౌతిక విజ్ఞానమంతా మూలబడు తుందని అసంబద్ధంగా యిలా ప్రలాపించడం గతితార్కిక దృష్టిలోపమున్నట్లు కనిపించేదా!

యీ రెండోసూత్రం పుట్టిన పాతికేళ్ళతరువాత, వైజ్ఞానికులంగీకరించి స్థిర పరచినతరువాత, వేదాంతులొకరు విజ్ఞానశాస్త్రపాఠాలు చదువనారంభించి క్లాసియస్ నిజమైతే....(క్లాసియస్, if correct) యంటూ వ్రాయసాహసించారంటే విజ్ఞాన సూత్రాన్ని శంకించగలిగారంటే గతితార్కికులు సైన్సుకు మార్గదర్శకత్వం వహించదలుచుకుంటే ఏమిటో రుజువుచూపించాలనవచ్చునో లేదో చూడవలసిన విషయము.— 273°C ఉష్ణోగ్రత ...అనగా absolute Zero దగ్గరకూడా పదార్థచలనాలు సంభవించి పోవడములేదనికూడా తెలిసి వ్రాసినవాడే యిలా శంకించాడు. యిలాంటి తర్కం పాలయ్యాడు.

మళ్ళీ ఉష్ణోగ్రతా వ్యత్యాసాలేర్పడటానికి ప్రకృతిలో మరికొన్ని క్రమాలు, యింకా తెలియనివి తెలియవలసినవి ఉండవచ్చని వాటివిషయము పరిశోధించాలని భావించవచ్చును, సూచించవచ్చును కాని నిరూపితమైన సూత్రాన్ని నమ్మలేకపోవటము, దానికి అనావశ్యకమైన అసంభావ్యమైన తర్కవిన్యాసము నెరపడం మాత్రం శోచనీయం. మన అపేక్ష అవసరంలేనిది ప్రకృతి విజ్ఞానాన్ని మించే, మరిచే ధోరణికిది దారిచూపను. సిద్ధాంత మూలక రతే యీ ధోరణికి నాంది పలికినట్లయింది. యిది సైన్సును తలదాల్చినట్లా? తత్వశాస్త్రాన్ని సైన్సుపై సైన్సుగా ప్రతిష్ఠించినట్లా?

## ఎంగెల్సు విజ్ఞానం వెలితి-రష్యన్ పీఠిక

హాల్డేన్ పీఠికతోనూ ముద్రించిన బ్రిటిష్ ప్రచురణతో ఆగక, ఇటీవలి రష్యన్ ప్రచురణలోగాని హాల్డేన్ ఫుట్‌నోట్లు వగైరాలేమైనాయో, రష్యన్ వివరణలేం నవివాయో చూడటం బాగుంటుంది.

అందులో ఒక పెద్ద పీఠిక వుంది. చాలా ఆసక్తిదాయకంగా వుంది. మార్క్స్ ఎంగెల్సుల సైన్సు చదువుల ఆరంభం, అవసరం, పరిమాణం, పరిమితులు చెప్పిన తీరు బాగుంది. కన్నుగలిగిచదవాలేగాని చాలా కనువిప్పు కలిగిస్తుంది. విజ్ఞానశాస్త్రాల అవగాహన, ఆ చరిత్రజ్ఞానం కొంత సొంతంగావుండి విచారిస్తే మంచిఫలితాల నిస్తున్నది. పైగా ఆ పీఠిక చాలా అధికారికమైంది. **Institute of Marxism Leninism** ఒక్కదానితరపునే అది వెలువడినట్టిదిగాదు. రెండోసంతకంవుంది దానిక్రింద. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సంతకంచేసిన గొప్ప అధికార పూర్వకమైన పీఠిక. ఎంగెల్సుమీద తిరుగులేనితీర్పుగా వున్నది. ఎంగెల్సు విజ్ఞానపు పరిహద్దులను అందులో కొంత నిర్ణయించారు. ఎంగెల్సు సమకాలిక విజ్ఞానాన్ని పూర్తిగా యెరుగడని, ఆయన విజ్ఞానంలో వెలితినిచూపేప్రయత్నం అందులో కనిపించింది. అసలటువంటి ప్రయత్నం యెంత ఆశ్చర్యాన్ని కలిగిస్తుందో, రష్యన్లు మంచిదారిలో పడుతున్నారనే సంతోషంకూడా అంతగా కలిగిస్తుంది. మూలపురుషులను కొంత విమర్శాదృష్టితో కొలుచుకోవాలనే దృష్టికి యిది నాంది అనిపించుతున్నది.

**"Engels was unable to use such works, less known at the time but no less valuable historically, as those of Lomonosov, Lobachevsky, Rieman and Butlerev or Maxwell's works on the theory of the electromagnetic field."**

మాక్స్వెల్ విద్యుదయస్కాంతతత్వం గూర్చిన సిద్ధాంతం ఎంగెల్సు ఎరగడని వారు వ్రాస్తే ఆశ్చర్యం గొలుపుతుంది. నాన్–యూక్లిడియన్ క్షేత్రగణిత ప్రతిపాదకులైన రష్యన్ లొబచెవిస్కీ, జర్మన్ రీమాన్లకృషిని ఎంగెల్సు తెలుసుకోలేదనటం యెంతో అర్థాన్ని స్ఫురింపజేస్తుంది. విద్యుదయస్కాంతశక్తి విజ్ఞానం–యూకిడితర క్షేత్రగణితం రెండింటినీ ఎంగెల్సు వినలేదని కలిపి ఆలోచిస్తే ఐనిస్టీన్ సాపేక్ష్యతాసిద్ధాంతా విర్భావానికిగల పూర్వరంగం కారణక్షేత్రం ఎంగెల్సు దృష్టికెక్కలేదన్న సూచన వుందని స్ఫురిస్తుంది. దానితో ఎంగెల్సు విజ్ఞాన సమాచార పరిమితులమీద కన్నుపెట్టి పరిశీలిస్తే కానవచ్చే వెలితి అంతాఇంతాకాదు.

కాని లొమొనొజోవ్, లొబాచెవిస్కీ, బట్లరేవ్ల కృషి ప్రసక్తి రష్యన్ జాతీయాభిమానాన్ని స్పష్టపరుస్తుంది. (అయితే సైన్సులో కూడ జర్మన్ జాతీయాభిమానాన్ని దాచుకోలేకపోయిన ఎంగెల్సుపట్ల అదొక ప్రతిచర్య అనిపిస్తుంది) లెనిన్ రచనల్లోనే యీ రష్యన్లపేర్లు కానరావు. ఎంగెల్సుకు తెలియకపోవడమంత ఆశ్చర్యం కాదు. తెలియక పోయినందున వారుకోల్పోయింది లేదు. లొమొనోజోవ్, బట్లరేవ్లు చెప్పిన పదార్థవిజ్ఞాన రసాయన శాస్త్రవిశేషాలు యితరులు చెప్పారు. ఎంగెల్సు తెలుసుకొన్నవే.

యూక్లిడ్‌కు భిన్నమైన క్షేత్రగణితాలను ప్రతిపాదించడమే ఎంగెల్సుఎరుకలో లేని విషయమయింది. అయితే లొబాచెవిస్కీ జామెట్రీతోపాటే గాస్‌సహపాఠి, హంగేరియన్ బోల్యాయ్ అటువంటి దాన్నే సొంతంగా ప్రతిపాదించాడు, రీమాన్ విషయం తెలీసుండా జర్మనీలో సుప్రసిద్ధుడైన 'గాస్' మరో నాన్ యూక్లిడియన్ జామెట్రీని చెప్పాడు. అలా చూస్తే గతశతాబ్దం తొలిసగం క్షేత్రగణితం యూక్లిడ్‌కు భిన్నంగా నడిచే ధోరణి తీసుకొన్నది. ఆ ధోరణినే మార్క్సు ఎంగెల్సులు యెరుగరు. ఆ ధోరణి సాపేక్ష్యతా సిద్ధాంతానికి కావలసిన కొత్తధోరణి. అయితే లొబాచెవిస్కీ జామెట్రీ యింతవరకుకూడా యెందులోనూ ఉపయోగానికి యెక్కలేదు. తక్కిన నాన్ యూక్లిడియన్ జామెట్రీలు ఉపయోగ పాత్రమై వున్నాయి. రీమాన్ జామెట్రీని ఐన్‌స్టీన్ ప్రత్యక్షంగా ఉపయోగించి రెలిటీవిటీ జనరల్ థీరీని ప్రతిపాదించాడు.అంచేత యీ రష్యన్‌ల సంగతి ఎంగెల్సు యెరుగడనడంలో జాత్యభిమానం వెల్లడయినంతగా ఎంగెల్సు విజ్ఞానంలోపం వెల్లడికాదు.

## తాజాసైన్సుకు దూరంగా మార్క్సెంగెల్సులు

క్లార్కు మాక్సువెల్ పేరు ఎంగెల్సు ప్రకృతిగతితర్కం నిండా వుందిగాని యీ రష్యన్ పీఠిక చూచిన తర్వాత చూస్తే 1880 తర్వాత రాసుకొన్న యీ పుస్తకములో 1865 నాటి మాక్సువెల్ విద్యుదయస్కాంతశక్తి మాటే నిజంగా కనిపించడం లేదని అర్థమైంది. క్లార్కు మాక్సువెల్ ప్రశస్తి అంతా ఎలెక్ట్రోమాగ్నెటిజంతోవుంది. కాని ఎంగెల్సు ఉష్ణసిద్ధాంతాలలోను, విద్యుత్సిద్ధాంత విభాగాలలోను మాత్రమే మాక్సువెల్‌ను విన్నాడు. విద్యుదయస్కాంతత్వ జనకపాదుడుగాగాని వినలేదు. విద్యుదయస్కాంతత్వమే ఎంగెల్సుకు అశ్రుత విషయం. ఆశ్చర్యం కదా!

విద్యుదయస్కాంత వ్యాపారమే సాపేక్షతకు బాటవేసింది.విద్యుదయస్కాంత తరంగాల ప్రసారవేగాన్ని మాక్సువెల్ గణితంలో సూచించాడు కనుగొన్నాడు. అదీ, కాంతివేగమూ ఒక్కటే అయింది. కాంతికూడా విద్యుదయస్కాంత వ్యాపారమేయని ఆయన అన్నాడు. కాని అప్పటికి యింకా అందరూ అనడంలేదు. హెర్ట్జు 1888లో మాక్సువెల్‌ను ధ్రువపర్చాడు. 1875లో లోరెంట్జు కాంతి ప్రసరణ సందర్భంలో ఈథరు పరస్పర విరుద్ధమైన ధర్మాలు కలిగి వున్నట్టు చూపడంగాని. మైకేల్సన్-మోర్లే ప్రయోగఫలితాలుగాని, దానిమీద మాక్సు ఈథరు లేదనడంగాని మాక్‌చాలా కాలంగా గమనప్రదేశాలు రెలిటీవు అనడంగాని యేమీకూడా 1886 వరకూ బ్రాస్తూ జీవించివున్న ఎంగెల్సు తెలుసుకోలేదు. ఆలోచించలేదు.

సాపేక్ష్యతయొక్క పూర్వరంగం పొలిమేరలు త్రొక్కకుండా యింతవెనక బట్టిపోయివున్న ఎంగెల్సు అభిప్రాయాలకు ప్రత్యక్షరూపకల్పనే సాపేక్ష్యతా సిద్ధాంత

పని మళ్ళీ చెప్పి మాత్రం యీ పీఠిక నవ్వు తెప్పిస్తుంది. "Albert Einstein's theory of relativity concretised Engels theoris on matter, motion, time and space'' ఐనిస్టీన్ను రష్యన్లు ఆమోదించిన తర్వాత యిటువంటి మాట చెప్పడు రష్యనులు వ్రాయడం సర్వసాధారణమైపోయింది. అదంతా తాము నమ్మిన సిద్ధాంత పితృదేవరా తర్పణ విధి విధానంలో చెప్పేతప్పని సరిమంత్రపాఠం.

పదార్థం ప్రదేశం కాలం గమనం (బరువు, ఇనర్షియా) గూర్చిన్యూటోనియన్ భావాలకు భిన్నంగా ఎర్నెస్టుమాక్ చెప్పడం సుప్రసిద్ధమైన విషయం. ఐనిస్టీను రెలిటివిటీని ప్రతిపాదించటంలో ఆయనే పెద్ద ప్రభావమునేమాటలోకవిదితం. ఇంకా న్యూటన్ను భిన్నంగా ఆలోచించిన సమకాలికులంటే "లీబ్నిజ్" పేరు చెప్పాలి. లీబ్నిజ్ముందు న్యూటన్ అనుకరణకర్తగానూ Inductive ass గాను ఎంగెల్సుకు కనిపించాడు. (Leibniz - the founder of the mathematics of the infinite in contrast to whom the inductive Newton appears as a plagiarist and corrupter a) ఎంతయూ యెప్పటికీ న్యూటన్ స్వతంత్రంగా కాల్కులస్ను కనిపెట్టాడనే మాట ఎంగెల్సు కెక్కలేదనవచ్చు. (differential and integral calculus by leibniz and perhaps Newton). ఈ అంతర్జాతీయ శాస్త్ర సిద్ధాంతకర్తలోని జర్మన్ జాత్యభిమానం మితిమీరి న్యూటన్ను తిట్టించి లీబ్నిజ్ను పొగడిస్తున్నంతగా, విషయజ్ఞత మాత్రం పదునుతేది న్యూటన్తో లీబ్నిజ్ సిద్ధాంత విభేదం విశిష్టతయేమిటో గ్రహించి,అది గ్రహించినవారి దారిని నడిచి,ఆమోదముపలంతో దాన్ని తలదాల్చించే లాగాగాని, సమరించేలాగాని చేయలేకపోయింది. న్యూటన్ సిద్ధాంతాలు సర్వం ఆమోదించి, వాటికి కర్తమాత్రం న్యూటన్గాదు, లైప్నిట్, లీబ్నిజ్ అనే జర్మన్లు సుమీయని చెప్పేవాడేగాని మారాకటిగాదు. అతనికి న్యూటనిజంలో వారి న్యూటను బదులు జర్మన్ పేర్లుకావాలి.

## లీబ్నిజ్పై అభిమానం - న్యూటన్నుతో అంగీకారం

కాల ప్రదేశాల విషయంలో ఎంగెల్సు న్యూటన్అనుయాయిగాని లీబ్నిజ్ అనుయాయిగాదు. న్యూటన్ కాలప్రదేశాలు నిరపేక్షాలు, పారమార్థిక సత్యాలు (Absolute, అందులో పదార్థం కదులుతున్నదంటే పదార్థాన్ని (Monads) బట్టికాల ప్రదేశాలున్నవి, అవి పదార్థ గతినిబట్టి ఏర్పడినవని అన్నాడు లీబ్నిజ్. న్యూటన్తో పరోక్షంగా పోస్టల్ వాదోపవాదం (శామ్యేల్ క్లార్కు పేరిట) లీబ్నిజ్ చేసినసంగతి చాల ప్రచారంలో వున్న సంగతి.అది తెలిస్తే న్యూటన్ను దగుల్తికబడిందనితెలుస్తుంది. కాల ప్రదేశాలమీద లీబ్నిజ్ భావాలు నేటిసాపేక్ష్యతకు కొంచెం దగ్గరలోవుంటాయని దానికి వాలుగావుంటాయని, సాపేక్ష్యత న్యూటన్భావాలను త్రోసిరాజన్నదని గుర్తించుకొంటే ఎంగెల్సు విజ్ఞాన వైదుష్య స్వభావమేమిటో తెలియవస్తుంది.

# హెగెల్ ఫ్రావర్హ్సాకలే నయం

ఎంగెల్సు భావాలకు ప్రత్యక్ష స్వరూపకరణమే (Concretisation) సాపేక్షత అని చెప్పడానికి రష్యనులిప్పుడు ఉదేవనిగా ఉదాహరించే ఎంగెల్సు మహావాక్యం ఒకటుంది. గతిశూన్యంగా, పదార్థంగాని, పదార్థశూన్యంగా గతిగాని అనూహ్యం అన్నదది. యాంటీ డూరింగులోని వాక్యం. కాని దానికి మాతృక హెగెల్ వాక్యం. ఆయన Natural Philosophy లో నుండి యిది సంగ్రహీతమై వుంది. Just as there is no motion without matter, so also there is no matter without motion అన్నదే ఆ వాక్యం. కాలప్రదేశాలు–పదార్థగమనాలను గూర్చి హెగెల్ వ్రాసినదానిలో ఎంగెల్సు స్వీకరించినదంతా యీ ఒక్క వాక్యంతోనే సరి. తక్కిన దంతా న్యూటోనియన్ యాంత్రిక విశ్వచిత్రణంనుంచే నేర్చుకొన్నాడు ఎంగెల్సు. హెగెల్ లీబ్నిజ్‌ను గ్రహించాడు. హెగెల్‌ను ఫూవర్బాక్ గ్రహించాడు. కాలప్రదేశ పదార్థగమనాల పరస్పరసంబంధాల విషయంలో ఎంగెల్సు యీ 'జర్మన్' అవగాహనకు దూరమై, న్యూటన్‌పక్షం అవలంబించి, అందుకు భిన్నంగా భావించిన వారందరితోనూ వాదనకు దిగాడు. సాపేక్ష్యతా సిద్ధాంతానికి చేరువగా, సంగతంగా వెలిబుచ్చిన భావాలను పూర్వపక్షం చేయతలపెట్టాడు. ఆరిక శాస్త్రోపన్యాసమైన డూరింగు రచన పూర్ణరూపంలో పనుప బొంకిడుగాని డూరింగ్‌వని చెప్పి ఎంగెల్సు పూర్వపక్షంచేసి ఎగతాళిబట్టించిన కొన్నివాక్యాలుమాత్రం నేటి సాపేక్ష్యతకు దగ్గరలో కన్పిస్తున్నాయి.

"According to Herr Duhring, time exists only through change, not change in and through time. Matter for Duhring, is the bearer of all reality" యిలాగే కాలప్రదేశాలు, పదార్థగమనాలు, శక్తి, స్థితి వగైరా విషయాల్లో జర్మన్ వృక్షశాస్త్రజ్ఞుడు అయిన నాగేలీ (Karl Withelm Nageli) భావాలమీద ఎంగెల్సు చేసిన విమర్శకూడా న్యూటోనియన్‌గానే చేశాడు. సాపేక్ష్యతకు ఎదురుపక్షంనుంచే మాట్లాడినట్లు విశదమవుతుంది.

# ఐనిస్టీను మాక్, న్యూటన్‌తో లెనిన్

నాగేలీ, డూరింగ్‌ల ఖండనంలో గతశతాబ్దపు నాల్గోపాదంలో కాలప్రదేశాది భావాల్లో న్యూటన్ తరఫున ఎంగెల్సు యుద్ధంచేయగా, ఐనిస్టీన్‌మీద పెద్దప్రభావమైన ఎర్నెస్టుమాక్ అభిప్రాయాలమీద సాపేక్ష్యతా సిద్ధాంతం వెలువడిన మూడేళ్ళతర్వాత కూడా 1908లో న్యూటనిస్టుగా లెనిన్ యుద్ధంచేశాడు. లెనిన్ ఎంపిరో క్రిటిసిజం–

మెటీరియలిజం అన్న రచనలో కాలప్రదేశాలను గూర్చిన అధ్యాయం న్యూటన్ విజ్ఞానంలోనే కూరుకుపోయి వున్నది. ఇదంతా చివర ప్రత్యేకానుబంధంలో తులనాత్మకంగా నిదానంగా చూచుగానని పొందుపరుస్తున్నాం.

## న్యూటను వలయందాటని గతితర్కం

యాంత్రిక భౌతికవాదాన్ని నిరసించి సంచలనాత్మకమైన చలనశీలదృష్టి నెంత అపూర్వంగా మౌలికంగా వహిస్తున్నామని చెప్పినప్పటికీ ఆ మార్క్స్, ఎంగెల్సులు న్యూటోనియన్ యాంత్రిక విజ్ఞాన మూలసూత్రాలనుగాని, ఆ చట్రాన్నిగాని ప్రశ్నించనవాలేదు. కాంట్ నెబ్యులార్ ప్రతిపాదనను న్యూటోనియన్ ఖగోళ పరిణామ ప్రథమపదంగా అభివృద్ధిగా వీరు చెప్పవచ్చు– ఆ కాంట్ ప్రతిపాదనను స్వతంత్రంగా కనుగొని దానికో గణితరూపమిచ్చిన, న్యూటోనియన్ యాంత్రిక విశ్వానికి ఫ్రెంచి శాస్త్రవేత్త లాప్లేస్ ఒక పరిపూర్ణత చేకూర్చాడంటారు. ఆ యాంత్రిక చట్రంలోనే కేవలం విడిభాగాలుగానున్న శక్తులమధ్య అంతఃపరివర్తనా సంబంధాలు నెలకొనడానికే ముగ్గురై, ఖగోళంలో న్యూటన్ సూత్రసంగతంగానే ఆ కొంచెం పరిణామం రూపొంద డానికే దోహదించటమై అపాటికే అంతస్సంబంధాల శాస్త్రమైన (Science of inter-connections) గతితర్కం సవ్యతకు, సత్యతకు విజయానికి అదంతా సాక్ష్యమని చాటుకొన్నారు. ఏరా అలాగే అంతస్సంబంధాత్మకాలుగా అంతరి రావశ్యకతాబద్ధాలుగా కాలప్రదేశాలను చూచిచెప్పేసరికి అడ్డుకెదురు తిరిగారు. గతిసాపేక్షమనేసరికి గతి పారమ్యదృష్టిని చెప్పిన వీరి అనుయాయులెదురొడ్డారు. సరళరేఖలో స్థిరవేగంతో సాగేగమనము (Uniform motion along a straight line) నిరపేక్షమైన విశ్రామస్థితి (Absolute Rest) తో సమానమని చెప్పిన న్యూటోనియన్ విశ్వానికే గతితార్కిక భాష్యం చెప్పుకొన్నారు. అసలా రెండు స్థితులూ, అయథార్థాలు. ఉన్నా మన కెరుగలేనివి_అసలు సరళరేఖలేలేవు. వేగంలో మార్పు, పరిణామము వృద్ధి క్షయాలున్న ప్రపంచమే మనకున్నది. మార్పునుబట్టి పరిణామాన్నిబట్టి కాలంగాని, కాలాన్నిబట్టి కాలంకాదు. కాలాన్నిబట్టి మార్పుకాదు. అనేసరికల్లా గతిపారమ్యవాదానుయాయులు అడ్డంతిరిగారు. న్యూటన్ చట్రాన్ని కదలించేసరికి తట్టుకోలేకపోయారు. నిజంగా గతి విక్రమిస్తే గతితర్కం గతితర్కమై హాహాకారాలు చేసింది.

ఇప్పటికే ఎర్నెస్టుమాక్ పేరును చాలా ప్రస్తావించాము. లెనిన్ అతనిమీదే పుస్తకము రాశాడని ఇందాక విన్నాము. కాని ఎంగెల్సే అతని సిద్ధాంతాలనుగూర్చి చర్చిస్తే లెనిన్‌కు ఆ తత్వరచనాశ్రమ తప్పివుండేది. మార్క్సిజాన్ని మాకిజంతో కలుపుకోవాలనే వాదం కొత్తగా తలెత్తకపోయేది. అదేదో ఎంగెల్సునాడే తేలిపోయి వుండేది.

మాక్ ప్రసిద్ధుడు. ఆయన సంగతే ఎరగడు. వినలేదు అంటే శాస్త్రరంగ స్థలంమీద ఎవరున్నారో, ఎవరు పోతున్నారో తెలియనంత దూరంలో ఎంగెల్సు ఉన్నాడను కోవాలి. వినివదిలేశాడనో, పేరెత్తి విమర్శింపదగ్గవాడు కాడనో, అవాచ్యుణ్ణి జేసి పరోక్షంగా ఏదో మరోవాక్యంలో తీసిపారేశాడనో లెనిన్‌లాగా అంటే, అనుకొంటే విజ్ఞానశాస్త్ర పుటలకెక్కని ఎందరో అనామకులు, అప్రతిభులు తన ఖండనకో మండనకో తగినవారై ఎంగెల్సు నోట్సులో ఎక్కివుండగా అది పొసగనిమాట కాక తప్పదు. సైన్సులోని ఎంపిరిసిజంమీద, అందులో చిన్న చిన్న పేర్లమీద పాతిక ముప్పై సార్లయినా ఎంగెల్సు వాఖ్యలున్నాయి. ఎంపిరిసిజాన్ని అసలాయన ఎదుర్కోవలసివస్తే, ఎదుర్కోవలసిన సమకాలిక ఎంపిరిసిస్టు నాయకమణి ఎర్నెస్టు మాక్. అదే ఎంగెల్సు చేయలేకపోయాడు.

ఇక్కడే ఒకమాట చెప్పాలి. ఇంగ్లీషు భౌతికవాదంపట్ల మూలపురుషులు ఫ్రాన్సిస్ బేకన్, జాన్‌లాక్‌లపట్ల, వారు నిర్దేశించిన శాస్త్రపద్ధతిపట్ల (మార్క్సు) ఎంగెల్సు వైఖరిలో పూర్తి మార్పు కన్పిస్తున్నది. పాతికేళ్ళలో యీ మార్పు కలిగింది. 1844లో ఆగమనం (induction) విశ్లేషణ, తులనాత్మకత, పరిశీలన, ప్రయోగం అన్నవే ప్రధానపద్ధతులుగా నిర్దేశించిన పరిశోధనా ప్రధానమైన విజ్ఞాన శాస్త్రాలకు ఇంగ్లీషు భౌతికవాదానికి జనకపాదునిగా బేకనును, మానవుని అభిప్రాయాలకు ఇంద్రియానుభవమే మూలమని నిరూపించి, ఫ్రెంచి భౌతికవాదంమీద పెద్ద ప్రభావమైవున్న జాన్‌లాక్‌ను మార్క్సుకీర్తించాడు. 1872నుంచి అనుభవాన్ని ఆకాశానికెత్తి, భావనను ఆలోచనను పరమ అసహ్యతతో చూచి యోచనారాహిత్యంలో పరాకాష్ఠపొందిన సంప్రదాయం ఇంగ్లాండులో పలుకుబడి వహిస్తోంది; దానిపిత అతిగా కీర్తించబడుతున్న ఫ్రాన్సిస్‌బేకన్ అని, ఆయనబోధించిన పద్ధతిని whole swindle of induction అని దాన్ని బాగాపాటించిన న్యూటనును inductionist ass అని, physics; beware of metaphysics అన్న అతని హెచ్చరికను అతనికే మరొక అర్థంలో ఎదురుత్రిప్పి వెక్కిరించి, మహాఅయితే గణిత సమీకరణాల రూపంలో మాత్రమే ఆలోచించగల ఎంపిరిసిజం అంటూ, సమస్తమైన సిద్ధాంతీకరణకు, అసలు ఆలోచన అన్నదానికే శుద్ధవిరుద్ధమైన పద్ధతిగా చెపుతూ one-sided empiricism అంటూ పదేపదే వాడుతూ తమ వ్యతిరేకతను చాటనారంభించారు.

డాల్టన్ పరమాణుప్రతిపాదన ఎపిక్యూరస్ ప్రాచీన ప్రతిపాదనకన్నా ఏమంత కొత్తదికాదని, గతి అవినాశి (motion is indestructible) అనే సూత్రం విజ్ఞాన శాస్త్రాలు తత్వజ్ఞులనుంచి తీసుకొన్నదని, పదార్థాలలోని యాంత్రికచలనమే వేడి (mechanical theory of heat) బలపడినమాట నిజమేగాని, అసలా సూత్రం ఎప్పుడో డీకార్టే ప్రోక్తమని—ఎంపిరిసిస్టు సమకాలిక సైంటిస్టులెవ్వరూ హెగెల్

బుజాలవద్దకురారని, కిర్కాఫ్. హెల్మ్హోల్జులు తామిప్పుడు శ్రమపడి కనుగొన్నవి హెగెల్ చెప్పినవో, ఖండించినవో కాగా, కానక కొంగ్రొత్తగా తామే చెప్పుతున్నట్టు చాటుకొంటున్నారని, హెగెల్‌ను విశ్వవిద్యాలయపాఠ్య ప్రణాళికనుంచి ఎత్తివేసిన జర్మన్ జాతి శాస్త్రపరిశోధనలో సైద్ధాంతికాలోచనను (theore tical thinking) కోల్పోయిందని (అదేమీ జరగలేదు) అంచేత వైజ్ఞానికులకు తత్వశాస్త్రాధ్యయనం తక్షణావసరమని, గ్రీకు తత్వచరిత్రనీ, హెగెల్‌నీ అవశ్యంవారికి బోధించాలని పెద్ద పీఠికలు వ్రాసి వుంచారు. గ్రీకు హెగీలియన్ తర్కాన్ని శాస్త్రిల్లోని ఎంపిరిసిజానికీ పృథక్ దృష్టికీ (metaphysical outlook) విరుగుడుగా ప్రతిపాదించారు.కాని దాని నిర్వాకమెలావుందో చూచారుగదా: ఏమంటే యేముంది.

## పాతగణితానికే కొత్తబాష్యం

ఇంక గణిత విజ్ఞానము సంగతి చూద్దాం. గణితం మార్క్సువంతు. అందులో ఆయన నిధి అంటారు. ఆయన గణితానికి గతితార్కిక భాష్యము వ్రాసినవాడు. అది కూడా రష్యన్లు అచ్చువేశారట. అదీ కొద్దికాలంలో అందనున్నది. రీమాన్, లొబొ చెవిస్కీల కృషిని ఎంగెల్సు వాడుకోలేదని రష్యనులు అన్నారు. కాని అనవలసినది మార్క్సును గదా:

ఆయన కాలిక్యులస్‌కు భాష్యం వ్రాశారు. కాలిక్యులస్‌ను కనిపెట్టినవారు గతి తార్కికులుకారు. వారు న్యూటన్ లీబ్నిజ్‌లు. లీబ్నిజును యిప్పుడు సింబాలిక్ లాజిక్‌కు పితామహుడంటున్నారు. లీబ్నిజ్ ఫార్మల్ తర్కంతో రూపొందించిన కాలిక్యులస్ తద్విరుద్ధమైన గతితర్కంతో నప్పుతందని చూపటానికి యత్నించాడన్నమాట. In every field, even in that of mathematics; he made independent discoveries అని ఎంగెల్సు ఉపన్యసించాడు. కాని గణితంలో సొంతంగా మార్క్సు ఏమీ కనిపెట్టలేదు. యితరులు యితర సాధనాలతో కనిపెట్టిన దానిని కాస్తా గతితర్క సమ్మతమనికూడా భాష్యకార ప్రజ్ఞచూపాడు. కాని అది యొక నిరుపయోగశ్రమ.

## పాత తర్కంతోనే కొత్త గణితం పుట్టింది తెలీకనే

అదికూడా పాతగణితములో ప్రావీణ్యమేగాని సమకాలీన గణితములో నూతన నాంశాల ఆకళింపుకై ప్రయత్నములేదు. ఆర్జిగ్రా మార్క్సుకు అభిమానాంశము అని చెప్తారు. గణితంలో నైపుణ్యము సంపాదించాలని మార్క్సు భావించిన గడియల్లోనే

(1858) ఆల్జీబ్రాలోనే తాను నివసిస్తున్న ఇంగ్లాండులోనే ఒక మహామహుడు డైలెక్టికల్ తర్కము మాట ఎత్తకుండా, ఆ దృష్టితో దిగువాయి చేసి మాట్లాడుతున్న పాత లాక్షణిక తర్కం (Formal Logic) తోనే గణితంలో ఒక క్రొత్త రంగానికి రంగాన్నే పారదెరచాడు. నేటి విజ్ఞానశాస్త్రము సాధిస్తున్న విజయపరంపరకు అదే మంచి ఆయుధము సాధనము అయింది. ఆ గణితతర్కమే, ఆ మహామహుడు బూలే. అది బూలియన్ ఆల్జీబ్రా. ఆ క్రొత్త ఆల్జీబ్రా పుట్టుకే మార్క్సుకు తెలియదు.

పాతగణితానికి మార్క్సు గతితార్కిక భాష్యం వ్రాయనారంభించే సరికే (1873-1883) ఫార్మల్ లాజిక్ గణితరంగంలో పెద్ద పెద్ద అంగలతో జోరుగా నడిచిపోసాగింది. ఆ శతాబ్దపు నాలుగవభాగంలోనే "పేన్సు" వంటివారు. ఆ గణిత తర్కాన్ని పెంచుకొంటూపోయారు. 1896 దాకా జీవించిన ఎంగెల్సుకు ఆ లాక్షణిక తర్కం చేస్తున్న పందెపు పరుగుతెలియనే తెలియదు.

## ఒక చిన్న తమాషా

గణితంలో మార్క్సు ప్రావీణ్యాన్ని వెక్కిరించినట్లుండే ఒక వింత దామాషా లెక్కను తప్పుల తడకను-క్యాపిటల్ ప్రథమ భాగమునుంచి విజ్ఞులు ఎత్తిచూపించారని చెప్తే యిక్కడ కొంత వినోదప్రాయంగాను కుతూహలకరంగాను ఉండవచ్చు. అయితే అదేమంత ప్రమాదకరమైనది కాదు.

"Progressive production of a Relative surplus-population Industial Reserve Army" అనే శీర్షిక క్రింద 25వ అధ్యాయములో ఉంది. పెట్టుబడిదారీ విధానము విధిగా అనివార్యంగా నిరుద్యోగాన్ని తయారుచేస్తుందని, యంత్ర భాగం పెరిగేకొలదీ నిరుద్యోగం పెరుగుతుందని, అదెంత ప్రమాణంలో ఎంత దామాషాలో పెరుగుతుందో ఒక గణితం వేసి చూపించాడు.

కూలీలమీద వెచ్చించే మొత్తం, యంత్రవిభాగాభివృద్ధిమీద వెచ్చించేమొత్తమూ రెండూ పెరుగుతున్నప్పటికీ నిరుద్యోగం పెరుగుతూనే యుంటుందని చూపుతున్నాడు యాంత్రిక భాగంమీద పెట్టేపెట్టుబడి పెంపుదలశాతం చాలాచాలా ఎక్కువగాఉంటుంది. వేతనాలమీదపెట్టుబడి పెంపుదల శాతం చాలా స్వల్పంగా ఉంటుంది. పర్యవసానంగా మొత్తం పెట్టుబడిలో వేతన విభాగపు పెట్టుబడియొక్క శాతం ఆరెండు పెట్టుబడులూ పెరిగేకొలదీ విపరీతంగా పడిపోతుంటుంది. మొత్తం పెట్టుబడిలో వేతనపు పెట్టుబడి

శాతం ఎంత ఎక్కువవేగంతో పడిపోతుందంటే–మొత్తం పెట్టుబడి, అనగా యంత్ర భాగం, వేతన విభాగము రెండింటిమీద పెట్టుబడి–ఎంత శాతంలో పెరిగిపోతుంటుందో అంతకన్నా ఎక్కువ శాతములో పడిపోతుందని దామాషా గణితం ఒకటిచ్చాడు మార్క్సు.

"This accelerated relation decline in the variable constituent (wages), a decline that accompanies the accelerated increase in the total Capital (organic Capital + wages) and proceeds more rapidly than this increase, takes the inverse form at the other pole of an apparently absolute increase in the working population."

మొత్తం పెట్టుబడి పెరుగుదల శాతంకన్నా మొత్తం పెట్టుబడిలో వేతనపు పెట్టుబడి దామాషా తరుగుదల శాతం అధికంగా ఉండాలంటే వేతనపు పెట్టుబడి మొత్తం తగ్గిపోవలసిందేగాని పెరుగుదల అనేదే ఉండరాదు. ఉంటే దామాషా యొక్క పతనవేగం ఎక్కువకానేకాదు. అదేదో ప్రయత్నించి చూడటము బాగుంటుందని పాఠకులకే విడుస్తాం.

## ఎంగెల్సు మెచ్చిన ఏకైక గతితార్కిక శాస్త్రకారుడు

ప్రకృతిశాస్త్రాల్లో యీ విశేష పరిజ్ఞానం సంపాదించడంలో ఎంగెల్సుకు తోడ్పడిన వారొకరున్నారు. ఇంగ్లాండులో మాంచెస్టరులోనే రసాయన శాస్త్రోపన్యాసకుడుగా పనిచేసిన జర్మన్ జాతీయుడు, పేరు కారల్‌షోర్లిమర్. ఎంగెల్సు రాజకీయానుచరుడు, వారి జర్మన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీసభ్యుడు. హెగెల్‌ను చదివి జీర్ణించుకొని తన రసాయనశాస్త్రమంటే పరిమాణం గుణంగా మారడమనే గతితర్కసూత్రానికి నిదర్శనమైన శాస్త్రమని ఎంగెల్సుకు చెప్పినవాడనవచ్చు. అప్పట్లో ఏకైక గతితార్కిక భౌతికవాద సైంటిస్టు. రసాయనకారులనందరినీ–అందులో విఖ్యాతులనే పేరెత్తి–ఆలోచనమాలిన వాగాడంబరులుగా దిగదీసిరాస్తూ, అందుకు మినహాయింపుగా ఎంగెల్సు పేర్కొన్నాడు. యీ షోర్లిమరునే (Except for schorlimmer, who is acquainted with Hegel) 'ప్రకృతిలో గతితర్కం' అనే తనరచనా ప్రణాళిక ముందుగా అతనికే పుట్టింది. అతనిసూచనలు ఎంగెల్సుకూ ముట్టినై, అంత గొప్పశాస్త్రకారుడుగా వారికి కనిపించిన యీ రసాయనకారునిపేర ఏ పరిశోధనగాని, ఏ సిద్ధాంతంగాని చరిత్రకెక్కలేదని గమనిస్తేమట్టుకు గతితర్కం పైన్నుడు మార్గదర్శి, అదేనపునేత్రం అనేమాటలు ఎంగెల్సునాడే వట్టివనేందుకు గట్టి ఉదాహరణగా షోర్లిమరు పేరు నిల్చిపోతుంది. రసాయన శాస్త్రవాచకాలు, మాన్యుయెల్సు చాలా వ్రాసిన హెన్రీఎన్‌ఫీల్డురోస్కో అనే రసాయనజ్ఞునికి సహరచయితగా మాత్రమే రష్యనరు చెప్పవీలయింటంటే చాలుగదా!

రూడోల్ఫ్ విర్కో జీవకణ పరిశోధనలో చరిత్రప్రసిద్ధుడు. ఆయనకన్న మిన్నజేసి యీ షోర్లిమరును చెప్పిన ఎంగెల్సు తూకపురాళ్ళమీదా, తక్కెడమీదా నమ్మకం కుదుర్చుకోవచ్చా ?

# హెగెల్ చేసిన శాస్త్రసారధ్యం

మార్క్సు, ఎంగెల్సు. వారి ఆస్థాన గతితార్కిక శాస్త్రవేత్త షోర్లిమర్ల కథలు సైన్సులో ఇలాంటివికాగా ఈ గతితర్క విజ్ఞాన మూలవిరాట్టు హెగెల్ శాస్త్రపరిశోధనలో ఇంతకన్నా చాలా అన్యాయమైన కథ నడిపివున్నాడు.

సూర్యకుటుంబంలో ఏడవ ఉపగ్రహాన్ని 1781లో యురేనసును కనిపెట్టడంతో ఖగోళజ్ఞులు విశ్రమించలేదు. ఎనిమిదో ఉపగ్రహంకూడా వుండాలని లెక్కలనుబట్టి అనుమానించారు. శని శుక్రులమధ్య ఎక్కడో వుండాలని దూరదర్శినులు ఎక్కుపెట్టి వేటసాగిస్తున్నారు. కాని అది ఎంతకూ దొరకటంలేదు. ఆ సమయంలో అదంతా వ్యర్థప్రయాస,ఊహా మృగాన్వేషణ-సౌరకుటుంబంలో ఉపగ్రహాలు ఏడేసుమ, అంతకన్నా ఎక్కువ ఉంటానికే వీల్లేదని వేదాంత శాస్త్రనిర్ణయం, దాన్ని విని పించుకొని, అపహాస్యభాజనమైన మీ దూరదర్శినుల వేట చాలించి, బుద్ధిగాపు కొందురుగాక అంటూ పరిహాసపూర్ణమైన వి(అ)జ్ఞాపన ఒకటి హెగెల్ మహామనీషి 19వ శతాబ్ది ప్రథమ దివసాన ప్రచురించారు.

అంతులేని ఆ అన్వేషణా ప్రయాస ఆ సమాచారముఅంతా వింటున్న గణిత సమ్రాట్ ఫ్రెడరిక్ కారల్‌గాస్ (Gauss) కుతూహలించి కలగజేసుకొని గణితం వేసి సూచించిన దిశలో, దూరంలో హెగెల్ అవహసించిన రోజునే ఆ ఎనిమిదో ఉపగ్రహాన్ని నక్షత్రవేధశాలలో దూరదర్శినులు పట్టుకొన్నై. తర్వాత దానికి సెరీస్ (Ceres) అనే పేరిచ్చారు. సెరీస్ ఉపగ్రహ ఉపలబ్ధివృత్తాంతం హెగెల్ శాస్త్ర సారధ్యపై ఫల్యగాథను నిత్యమూ చాటుతున్నది. శాస్త్రజ్ఞుణ్ణిగా, గణితకారుణ్ణిగా ఎంగెల్సు చేసిచూపించిన గతితార్కిక బ్రహ్మ హెగెల్‌ను గణితసమ్రాట్‌వాక్యంలో యీ పుస్తకంచివర అనుబంధంలో చూడగలరు.

యీ సిద్ధాంతపురుషులు గతితర్కాన్ని శాస్త్రవిజ్ఞానములో సిద్ధాంతీకరణకు పరిశోధనకు మార్గదర్శకంగా ఉపయోగించడం యిలా ఉండగా వారి శాస్త్రపరిజ్ఞానము వెనుకవరుసలోనిది, భవిష్య ప్రాధాన్య శూన్యమయింది. అయివుంటుండగా వారి తద నంతర సిద్ధాంత సంచాలకులు విజ్ఞానశాస్త్రాలలో ఎక్కడున్నారో గతితర్కానికి వాటికి ఎటువంటి గాఢసంపర్కం కలిగించారో మూలపురుషులు చూపిన త్రోవలో దొమ్చుకుపోయారో చమ్చుబడిపోయారో తెలియడం ఉచితం.

-:-

## తదనంతర కథాక్రమంబు

ఎంగెల్సు ఎరుగని స్టోనీ చేసిన ఎలక్ట్రాన్ ప్రతిపాదన నిజమై, ఎంగెల్సు కిమిన్నాస్తిగా వదిలేసిన మాకిజమ్ విజృంభించి భౌతికవాదాన్ని వెనుకకు త్రోసివేస్తూ రష్యన్ కమ్యూనిస్టులలోకి వ్యాపించేసరికి లెనిన్ తప్పనిసరిగా శాస్త్ర తత్వవివేచకుడు కావాల్సివచ్చింది. విజ్ఞాన శాస్త్రాంశాలను పట్టించుకోవాల్సివచ్చింది.

ఎలక్ట్రాన్‌లో యాంత్రికభారమే (Mechanical Mass) లేదని, దానిబరువు సర్వము వేగాన్నిబట్టి ఏర్పడినట్టిదేనని, దాని బరువంతా శక్తిగా మారిపోయి, అది పదార్థముగా మిగలడములేదని, పదార్థము అదృశ్యమైందని అప్పట్లో శాస్త్రకారులు పొరపడటంతో భౌతికవాదం దెబ్బతినిపోయిందనే భావానికి అవకాశం యిచ్చారు. పెద్ద గోల చెలరేగింది. ఫిజిక్స్‌లో అప్పుడేసంక్షోభమన్నారు.పదార్థము నిరవశేషంగా శక్తిగా మారిపోయినప్పటికీ భౌతికతకు, భౌతికవాదానికి భంగం వాటిల్లలేదని, పాత యాంత్రికభౌతికవాదమే దెబ్బలేన్నదని, గతనాను ప్రాణితమైన తమ పదార్థవాదానికి పైగా బలం చేకూరిందని లెనిన్ చెప్పసాగాడు.

## ఎంగెల్సు చేయని సాహసం, లెనిన్ చేసిన సాహసం

ఎంగెల్సు చేయని సాహసం లెనిన్ చేశాడు. తనలాగానే ఆర్థికశాస్త్రవేత్త సామాజికవాదీ అయిన డూరింగు మీద ఖండనగ్రంథం వ్రాసి వెలువరించాడుగాని "బూర్జువా డార్వినిస్టు జీవశాస్త్రజ్ఞులు" సోషలిజానికి వ్యతిరేకంగా తమ సిద్ధాంతాన్ని వివరించుతూ ప్రసంగవ్యాసాలు, పుస్తకాలు నాడే వ్రాయగా, ఆ యా శాస్త్రపరిషత్తుల ముందు సమాధానం వ్రాసి చదువుతానని ఉత్తరాలు రాశాడేగాని ఆ పని చెయ్యలేదు. నోట్సులో నాగేలీవంటి వారిమీద చాలా రిమార్కులు వ్రాసుకొన్నాడుగాని అచ్చులోకి తేలేదు. ఆనాటి శాస్త్రజ్ఞులతో సూటిగా ఎంగెల్సు తలపడలేదు. తప్పుకొన్నాడు.

లెనిన్ మాత్రం రష్యన్‌భాషలో ఆనాటి పెద్ద పెద్ద యూరోపియన్ శాస్త్రకారులమీద నిస్సంకోచంగా ఖండన వ్యాసంగం నడిపాడు. నడిపించి నడిపించి ఈథరు అన్నది పదార్థంగా పరివర్తనం చెందవచ్చునని, ఈథరంటే భారరహితమైన పదార్థమని, అదే భారయుతమైనపదార్థమవుతున్నదని, యాంత్రికభారంఅసలే లేకపోయినట్టి

ఎలక్ట్రాన్, విద్యుదయస్కాంత ద్రవ్య (electromagnetic mass) మయమై యుంటున్నదన్న వాస్తవం గతితార్కిక భౌతికవాదాన్ని ధ్రువపరుస్తున్నదని వ్రాశాడు,

"(1) However bizarre from the stand point of commonsense, this transformation of imponderable ether into ponderable matter and viceversa may appear, (2) however strange may seem the absence of any other kind of mass in the electron save electromagnetic mass, (3) ... all this is another corroboration of dialectical materialism."

## ఫిజిసిస్టుగా లెనిన్ !

ఈథరుమీదుగా ఇటువంటి ప్రతిపాదనలు చేయడానికి ఎంగెల్సులోనే ఆకరాలున్నై. ఇటువంటి ప్రతిపాదనను ముందొకరెవరో చేసినట్టు లెనిన్ చదువుకొని, తానే చెయ్యడం ఆరంభించాడు. కాని ఈ ప్రతిపాదనలు రెండూ తప్పులేనని తేల్చింది. ఆనాటి విజ్ఞానశాస్త్రం. ఈథరు అసలువట్టిది, హుళిక్కి అని తేల్చింది. యాంత్రికభారం [mechanical inertial mass] ఎలెక్ట్రాన్లో లేదనేమాట తప్పని ధ్రువపడింది. అప్పట్లోనే యివి స్పష్టపడ్డాయి. కాని తెలుసుకోకుండా లెనిన్ ఫిజిసిస్టు ప్రతిపాదనలు చేయతలపడ్డాడు. ఫిజిసిస్టులకు డైలెక్టిక్సు తెలియకపోవడంతో కొత్త ఫిజిక్సు భావవాదంలో పడుతున్నదని (Because the physicts did not know dialectics, the new physics strayed into idealism), అస్తిత్వంలేనివాటితో పదార్థాన్నీ, ఫిజిక్సునూ నిర్మించాడు. డైలెక్టిక్సు చేయించగల సాహసిక్యం కదా ఇది. గతితర్కమనే అదనపు నేత్రం తెచ్చే విపరిమాణం!

ఈథరు, విద్యుత్తు, పదార్థం అన్నవి పదార్థం యొక్క మూడుదశలని, భార రహిత స్థితిలోకూడా పదార్థముంటుందని, అదే ఈథరని, పాతఫిజిక్సు చెప్పుతుందని, ఇప్పుడందులో ఈథరుఎగిరిపోయిందంటున్నారని,అలాగననక్కరలేదని, భారగుణంలేని ఈథరే ఘనీభవించి అణువై భారగుణాన్ని నూతనంగా వహిస్తుందనుకొమ్మని, భౌతికవిజ్ఞానశాస్త్రంలో నాడు ఏర్పడిన సంక్షోభాన్ని గతితార్కిక భౌతికవాదదృష్టిరీత్యా లెనిన్ పరిష్కరించాడు. ఎర్నెస్టుమాక్ 1883, 1887లోనూ, ఆల్బర్టు ఐనిస్టీన్ 1905, 1907లోనూ లేదన్న ఈథరును,అసలీ యిరవయ్యో శతాబ్దమేతిరస్కరించిన ఈథరును 1908లో పునరుద్ధరిస్తూ పుస్తకం రాసిన లెనిన్‌గాని, ఆయన గతితర్కంగాని విజ్ఞాన శాస్త్రకారులకొక ప్రహసనంగా పుండకుంటుందా? ఎలెక్ట్రానులో యాంత్రిక భారం బొత్తిగాలేదని భ్రాంతిపడిన వారిని నమ్మి, అదికూడా గతితార్కిక భౌతికవాదాన్ని

నిరూపించే విషయమేనన్నా తర్వాత, ఎలెక్ట్రాన్లో యాంత్రికభాగం వున్నదని రుజువు అయినట్టుతేలితే, ఆ గతితర్కం, ఆ భౌతికవాదం పరిస్థితి ఏమైనట్టు? ఏమవుతుంది? చెక్కుచెదరంటారు. ఉన్నదన్నా లేదన్నా రెండు పక్షాలలోనూ గతితర్కంనిలుస్తుంది. అదే దాని మహత్వం.

ఎంగెల్సు లెనిన్లు ఇద్దరూ తమ గతితర్కంతో శాస్త్రవిజ్ఞాన రంగంలో హాస్య రసాన్ని అద్భుతరసాన్ని అమోఘంగా పోషించారనవలసిందే గదా!

ఎంపిరో క్రిటిసిజంపై విమర్శా గ్రంథము వ్రాసి, హెగెల్ వగైరాలను చదివి రాసుకొన్న ఫిలసాఫికల్ నోట్సును పూర్తి చేసేంతవరకూ — అనగా 1916 లోగా ఐనిస్టీను పేరుగాని, రెలిటీవిటీనిగాని లెనిన్ వినలేదు. మాక్ ప్రభావంలో, మాక్ సూత్రాన్ని స్వీకరించి ఐనిస్టీన్ సాపేక్ష్యతను తయారు చేశాడని, కాలప్రదేశాలు స్వయం సిద్ధాలు స్వతస్సత్యాలు కావు, పదార్థం యొక్క గుణధర్మాలని, విడిగా సత్యాలు గావని, పరస్పరాపేక్షితాలని, ఏకీభూత మిశ్రమమైన కాలప్రదేశానవరతత్వమని, విశ్వం అనంతంగాక పరిమితమని, స్థితిలాగే గతి కూడా నిరపేక్షం (Absolute) కాదని చెప్పుతున్న సాపేక్ష్యతను శాస్త్రకారులంతాయింకా ఆమోదించలేదని, మాకిస్టులే ఆమోదించలేదని చెప్పి, ఈ విషయంలో మాక్ (ఐనిస్టీన్ల)ను తిరస్కరించినట్టే రెలిటీవిటీని తిరస్కరించివుండేవాడు. మాక్ ప్రదేశం సాపేక్ష్యమంటే లెనిన్ తిరస్కరించేవున్నాడుగదా! త్రిదిశా విస్తృతంగా కాకుండా ఇంకా బహుదిశా విస్తృతమైన (N-dimensions) ప్రదేశంగూర్చి గణితశాస్త్రజ్ఞులాలోచిస్తున్నారంటే ఎగతాళిచేసి వున్నాడు, కాలప్రదేశాల అవగాహనలో హెగెల్ పూర్వాచార్యులతో తానూ ఎంగెల్సూ విభేదిస్తున్నామన్న స్ఫురణేలేనివాడు, కాలప్రదేశాలసారమే గమనం అన్న హెగెల్ వాక్యశకలాన్నొకదాన్ని నోట్సులో ఎక్కించుకోవడమేగాని, అవి పదార్థాశ్రితాలేగాని స్వయం సత్తాకాలుకావని వారి భావమని మాత్రంకానలేకపోయినవాడు, రెలిటీవిటీకి ఆయన ఇంకా ఎక్కడ చేరువకాగలడు? దానిమీద అనుమానం అప్పట్లో ఎలా ఆయనను తీరగలదు?

ఇట్టిస్థాయిలో సైన్సుచర్చచేసిన ఆ ఎంపిరో క్రిటిసిజ విమర్శనాన్ని 1920లో పునర్ముద్రిస్తూ వ్రాసిన పీఠికలో ప్రకృతి విజ్ఞాన శాస్త్రాల్లో యిటీవల కనుగొన్న నూతనాంశాల (new discoveries) తాత్విక పర్యవసానాల పరిచయానికి తనరచన ఉపయోగపడుతుందని, చాలస్వల్పమైన మార్పులేచేశానని వ్రాశాడు. ఐనిస్టీను సిద్ధాంతం 1919లో సూర్యగ్రహణపరిశీలనతో ధ్రువపడి ఆయన ఖ్యాతి తారాపథానికెక్కిన తర్వాతకూడా ఇలా వ్రాయగలిగాడు లెనిన్. ఏమనుకొందామంటారు మరి?

ఇక్కడ చర్చ సైన్సులో లెనిన్ గూర్చేగాని, సైన్సుతాత్వికపర్యవసానాల విషయంలో లెనిన్ గూర్చిగాని, మాకిజాన్ని గూర్చిగాని కాదని గమనించాలి.

మాక్సువెల్ - హెర్ట్జులు కాంతిని తరంగ వ్యాపారంగా నిర్ణయిస్తే, ఐనిస్టీను యితరులు కణ రూపిణిగా భావించి లెక్కలు గట్టి సిద్ధాంతించిన సంగతిగాని, అసలు శక్తి సర్వం కణరూప ప్రసారిణి గా చెప్పే క్వాంటం సిద్ధాంతం వెలువడిన సంగతిగాని దానితాత్వికపర్యవసానాల సంగతిగాని లెనిన్ తెలుసుకోలేదు. దానికర్త మాక్సుప్లాంకు వ్రాసిన పుస్తకాన్ని బెర్న్లైబ్రరీలో చూచి నంబరువ్రాసి పెట్టుకోవడంతో ఆవ్యాసంగం ముగిసింది. 1924లో చనిపోయిన లెనిన్ 20వ శతాబ్దపు సైన్సు యేమంటున్నదో చర్చించని గతి తార్కిక భౌతిక వాద సిద్ధాంత ప్రధాన సంచాలకుడు. అటువంటి లెనిన్ "The electron is inexhaustible as atom అని అన్నాడు. దీయెట్ జెన్ అనే కార్మిక తత్వజ్ఞుడు The subject matter of science is endless, for nature in all her parts has no begining and no end" అన్న వాక్యాన్ని, దానిలోని తర్కాన్ని పొడిగించి పై వాక్యాన్ని నిర్మించాడు. ఆ వాక్యానికి నిరూపకం గానే నేటి క్వాంటం ఫిజిక్సులో అభివృద్ధి జరిగిందంటూ వల్లె వేస్తారు. ఆ లెక్కన క్వాంటం ఫిజిక్సు అంతా ఆ జోసఫ్‌దీయెట్ జెన్‌ను ధ్రువపరుస్తున్నదనటం న్యాయం:

లెనిన్ గూర్చి యిక్కడే ఒక విషయం సూచించి విడవొచ్చు. హెగెల్‌ని చదివి వ్రాసికొన్న నోట్సులో "మానవుని జ్ఞానం(చైతన్యం)బాహ్య ప్రపంచాన్ని ప్రతిబింబించటం మాత్రమే గాకుండా సృజిస్తున్నది కూడా")"Man's conciousness not only reflects the objective world, but also creates it) అని గుర్తుపెట్టుకొన్నాడు.కాని తనఎంపిరో క్రిటిసిజం ఖండనలో తానితబెట్టిన జ్ఞానసిద్ధాంతంలో జ్ఞానక్రియ యొక్క సృజనాత్మకత యేమైనా వున్నదా, లేదా?అది గతి తార్కిక జ్ఞాన సిద్ధాంతమేనా?అది కూడా భౌతిక వాద జ్ఞాన సిద్ధాంత భేదంకాదా?ఆలోచించండి. దాని లోతుపాతులు మరొకసారి వివేచించుదాము.

## లెనిన్ తర్వాత సైన్సుకు సెలవు

మార్క్సిస్టు సిద్ధాంత ఆధికారిక సంచాలకుల్లో లెనిన్ తర్వాత శాస్త్ర విజ్ఞానం జోలికి వెళ్ళిన వారు లేరు సరికదా,దాని పురోగతికి ఎదురు దామాషాలో దానినుంచి తిరోగమించారు,కాని ప్రకృతి విజ్ఞానంతో ముడిబడి వుంటుందనే ఆగతి తర్కాన్ని సవరించడానికి, మార్చడానికి మాత్రం జంకు గొంకులు లేకుండా నడిచారు.

స్టాలిన్ గతితార్కిక భౌతిక వాదాన్ని సంక్షేపించిన వాడు. అందులో నవ్య విజ్ఞానం మాట అనవసరంగాని,అభావాభావ సూత్రాన్ని చల్లగా లాగివేశాడని చెప్ప

పలసిందే.మార్క్సిజం ఆయనతో శాస్త్రిలకు శాస్త్రమై,విజ్ఞానంపైన సుజ్ఞానమై, శాస్త్ర సిద్ధాంత,పరిశోధనల నెంత అదమాయించిందో,శాసించిందో చెప్పేదేముంది, ఆయన నాడు లెనిన్ గ్రాడ్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫిలాసఫీ వారిచేత Text Book of Marxist Philosophy ఒకటి వ్రాయించి రష్యాలో సాంకేతిక విద్యాలయాల్లో పరిశోధనా గారాల్లో బోధించే వాచకంగా1940లో తయారు చేయించారు.దాన్ని ఆ పిమ్మట 1944లో ఇంగ్లీషు చేయించి ప్రపంచం ముందుంచారు. స్టాలిన్‌కు పట్టని సైన్సు వ్యాఖ్యానం యీ వాచకంలో వారుగానిచేశారేమో అనుకొంటే అందులోను యిరవయ్యో శతాబ్దంఅసలేలేదు. లేక పోవడమేమిటీ. అనడానికి మాత్రం, ఇటీవలి సిద్ధాంతం చొప్పున ఎలక్ట్రా న్నది ఒకా నొక ప్రత్యేక తరంగ వ్యాపార కేంద్రీకరణ స్థానం (Nuclear centres of special wave process) అన్న మాటొకటివుందిఅంతే.

ఆమీద విప్లవాధినేత అయిన మావో మరొక సిద్ధాంత సంచాలకుడు. ఆయన గతితర్కంలో కూడ విప్లవాధినేతే. సుదీర్ఘమైన ఒకటిన్నర శతాబ్దికాలంలో హెగెల్ దిద్దితీర్చిన త్రైతరూప మైన గతితర్కానికి పరిణామ అభివృద్ధియోగాన్ని ప్రసాదించకుండా, స్వరం తప్పకుండా వల్లించే వేదపాఠంగా తయారుచేయగా, ఆగతితర్కానికి అద్వైతరూపమిచ్చిన గొప్ప సాహసి. గ్రీకు విజ్ఞాన సర్వస్వమైన అరిస్టాటిల్ నుంచి రెండువేలేండ్లుగా చలనం స్థంభించి స్థాణువుగా మారిపోయిన లాక్షణికతర్కం హెగెల్ తన్నిన తాపుతో రాస్తా సంచలించి, తేరుకొని చురుకెక్కి చిత్ర విచిత్ర చలనచిత్ర శైలూషియై నవీన విజ్ఞాన శాస్త్ర, సాంకేతికశాస్త్రపరిశోధనా విజయ సారథిగా తిరిగినందుకు యిరుపోటిగా యివతల గతితర్కరంగంలో నైరాశ్యంఅలము కోనక్కరలేకుండాకొంచెం పరిణామ రేఖా విలాసం యిలా వెలయించినవాడు. కాని గతితర్కాన్ని యిలా పునర్వ్యాఖ్యీకరించటానికి ప్రేరణ, ఆవశ్యకత ప్రకృతిశాస్త్ర వైజ్ఞానిక రంగంనుంచి యెంతమాత్రం కలగలేదు. మావోకు గతశతాబ్దపు విజ్ఞానమైనా యెంతవరకు సోకిందో నిదానించి పరిశోధన మీద తేల్చి చెప్పాల్సిన విషయమే వారిక్షేత్రం నూటికి నూరుపాళ్ళు మానవ సమాజమే. గాని అందులోకి మరొకటేమీ ఎక్కలేదు.వారు కేవలం సంఘవ్యవస్థా ప్రవర్తకులు.అంతే.మావో గతితర్క సంస్కర్త కావడమంటే సైన్సుతో, అనగా ప్రకృతితో గతితర్కానికి అనుబంధం తెగిపోయినట్టే.

మావోతో గతితర్కం ఆలోచనా చలన సూత్రావళిగా గాకుండా, ప్రత్యేకించి రాజకీయ శాస్త్ర చలన సూత్ర పంక్తిగా 'పరిణతి' నందింది. గతితర్కం అద్వైత

మూర్తి గావటమేగాకుండా ఏకత్వంలో భిన్నత్వ మన్నట్టుగా మరికొన్ని మార్పులకు లోనైంది.వాటికి కూడ విజ్ఞాన పరిణామం పునాదికాలేదు.గతితర్కాన్ని ప్రత్యేకంగా విచారించే రచనలో అవన్నీ చర్చించాల్సి వుంటుంది. ఇంత చెప్పిన తర్వాత తర్క రంగంలో గతితర్కం యొక్క వెనుకబాటు తనాన్ని చూపి ముగించడం యీరచనా ప్రణాళికకు ఉచితమ వుతుంది కదా!

## గతితర్క ఖండన - మార్క్సెంగెల్సుల మౌనం

మార్క్స్, ఎంగెల్సు లిద్దరూ జీవించి యుండగానే గతితర్కంమీద విమర్శ తార్కికులనుంచి చాలా వెలువడింది. హెగెల్ ఆచార్యకం నెరపిన ఆ బెర్లిన్ విశ్వవిద్యాలయాన్ని లాక్షణిక తర్కం ఏలుకొనటం కాదు విషయం; హెగిలీయ తర్క ఖండనం అక్కడబాగాసాగింది. మార్క్సిస్టు సాహిత్యంలో అటువంటి ఖండన కర్త అడోల్ఫు ట్రెండులెంబర్గు పేరొకటి వింటాము. ఆయన 1872 సరికే కాలం చేశాడు. మార్క్స్, ఎంగెల్సుల నుంచిగాని, మార్క్సిస్టుల నుంచిగాని ఆ శతాబ్దములో ట్రెండులెంబర్గుకు సమాధానం వెలువడలేదు. హెగెల్‌నుతోసి తోలేసిన జర్మన్ విశ్వవిద్యాలయాల్లో కలగలుపు తత్వాల పల్చనిపులుసు నీళ్ళు (Paupers broth of eclecticism) పోస్తున్నారని, హెగెలిజంతో పాటుగా గతి తర్కాన్ని కూడా విసరిపారేసిన జర్మనీ,ప్రకృతి విజ్ఞాన శాస్త్రాల్లో సిద్ధాంతీకరణ శక్తిని కోల్పోయిందని, 1886లో ఏమేమో వ్రాసిన ఎంగెల్సు (మార్క్స్) గతితర్కంమీద యెందరో వ్రాసిన విమర్శలకు సమాధానం వ్రాసిన వారు కాకపోయారంటే ఏమనాలో పాఠకులు ఆలోచించాలి.

ఆట్రెండు లెంబర్గుకు మార్క్సిస్టులనుండి గతశతాబ్దంలోసమాధాన మంటూ లేక పోయింది.1908 నాటికి మాత్రం వారిలో ప్లెఖనోవ్ ఒకరు ప్రయత్నించాడు. ఆసమాధానం చదివి lwrge logic మీదేమీలేదండూఅంటూ అతృప్తి నొకమాటలో చూపించిన లెనిన్ తానేమీ ప్రయత్నించక పోయాడు.లెనిన్ అతృప్తి ఎందుకో అంతు బట్టించుకొని,ఆ సమాధానపు పరిమితులను చూపినవాడు మళ్ళా 1946లో యం.యన్. రాయ్. ఆ ఒక్కరి ఖండనమే గాదు, ఇతరులనుండి యింకా మరికొన్ని ఖండనలు జర్మనీలో గత శతాబ్దం ఉత్తరార్థ ప్రారంభంలోనే గతితర్కంమీద వెలువడి వున్నై.

ఆ ఆక్షేపణ లన్నింటికీ 1896లో సమాధానం యిచ్చిన వాడు ఒక యింగ్లీషు హెగీలియన్ భావవాద పండితుడు, కేంబ్రిడ్జి విశ్వ విద్యాలయంలో సుప్రసిద్ధ హెగీలియన్ ఆచార్యుడు J. E MacTaggart. ట్రెండులెంబర్గుకే గాక లోట్జే (Lotze of Gottenberg) మొదలైన ఇంకొందరి విమర్శలకు కూడా ఆయన సమాధానం చెప్పాడని, సమర్థుడని, అయితే Arch - Idealist అని మాత్రం ఒక రివ్యూ చదివి లెనిన్ నోట్సు రాసి పెట్టుకొన్నాడు. అంతటితోసరి. మార్క్సిజంలోని యీ దురవస్థను ఒక యదార్థగాథతో ముగించడం బాగుంటుంది.

## రస్సెల్ జీవితమే గతితర్కంపై పెద్ద తీర్పు

అది బెర్ట్రాండ్ రస్సెల్ భావ జీవితంలో ఆరంభాధ్యాయం. పద్దెనిమిదేళ్ళ నూనూగు మీసాల నూత్న యౌవనంలో రస్సెల్ కేంబ్రిడ్జిలో ఉన్నత విద్యలో ప్రవేశించినప్పటి మాట. గణితశాస్త్రం కోసం వెళ్ళాడు. అయినా తత్వంలో తర్కంలో పడ్డాడు. గతితార్కికుల ప్రభావంలోనే మరీపడ్డాడు. కాంట్, హెగెలులనే చదివాడు. ఎందరో ఆయన కాచార్యులు. అందరిలోకి గట్టివాడు పైన చెప్పిన Mac Taggart మేక్టేగార్ట్. ఆయన ప్రభావంలోనే కాంట్‌ను వెనుకబెట్టి హెగెల్‌ని కొలిచాడు. హెగెల్‌ను గణితంలోకి యెక్కించి భాష్యం చెప్పాడు. అంకెలకు పరిమాణాలకు గల సంబంధాలమీద 1896లో ఆయన ప్రచురించిన పరిశోధనా పత్రంలో కల్తీ లేని హెగీలియన్ గతితర్కమే నింపేశానని చెప్పాడు. మచ్చు చూపించాడు కూడా.

హెగీలియన్ గతితర్కానికితోడు సోషలిజం అర్థశాస్త్ర ప్రావీణ్యం ఆయనలో జతపడినై. అసలు రస్సెల్ సర్వతోముఖ ప్రజ్ఞాశాలియని-తత్వం తర్కం గణితం ఫిజిక్సు యితర ప్రకృతి శాస్త్రాలు, మన స్తత్వశాస్త్రం, చరిత్ర, మతం సామాజిక శాస్త్రాలు సమస్తంమీద ఆరేడుడజన్ల గ్రంథాలు వ్రాసిన ప్రఖ్యాత మేధావి నోబెల్ బహూమతి గ్రహీత అయి ప్రపంచ శాంతి ఉద్యమంలోకి ఐనిస్టీను వంటి వైజ్ఞానికులను ఆకర్షించి దానికో నైతిక బౌద్ధిక ప్రతిష్ఠనిచ్చి కీర్తిశేషుడైనవాడు.

ఆయన హెగెల్‌ని ఎనిమిదేళ్ళు కొలిచాడు. గణితంలో హెగీలియన్ గతితర్కాన్ని నింపి విశ్వవిద్యాలయాధికారుల ముందు పెట్టిన తర్వాత ఆయన చేసిన తొలిరచన జర్మన్ సోషల్ డెమోక్రసీ అనగా కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర పరిశీలన అన్నమాట. ఆ ఉత్సాహంలో మరో పెద్ద పని పెట్టుకొన్నాడు. ఎంగెల్సు గణిత ప్రకృతిలో గతి తర్కం యెలా వుందనిచెప్పడానికి పూనుకొన్నాడో అలాగే అది చూచి కాదు, వినికాదు - స్వతంత్రంగా ఒక్క ఫిజిక్సు మీద కేంద్రీక

రించి క్లార్క్ మాక్స్వెల్ హైర్ట్జులు విద్యుదయస్కాంత తరంగ వ్యాపార పరిశోధన, సిద్ధాంతాలను - జె. జె. థాంసన్ ఎలక్ట్రానును కనుగొన్న తర్వాత మైకేల్సన్-మోర్లేల ప్రయోగం తర్వాత ఫిజిక్సులో గతి తర్కాన్వయాన్ని చెప్పడానికని నిశ్చయించు కొన్నాడు.రెండేళ్ళు ప్రబలమైన కృషి చేశాడు.'ఫిలాసఫీ ఆఫ్ ఫిజిక్సు' అనే పేరుతో ఒక పుస్తకం రాసేశాడు. 1898 జనవరికే వ్రాసేశాడు. అచ్చు వేయబోయేముందు నిదానించి, వ్రాసిన దాన్ని తిరిగి చదువుకొన్నాడు. బాగా ఆలోచించాడు. అదంతా తప్పుదారి అనిపించింది. అలాగని గట్టిగానమ్మకం కుదిరింది. అంతే, అచ్చు వేయరాదనుకొన్నాడు. అవతల బెట్టాడు, ఆ రెండేళ్ళ పరిశ్రమను పూర్తిగా మరచి పోవాలనుకొన్నాడు. మరచిపోయాడు. హెగెల్‌నీ, గతితర్కాన్నీ, గణితంలో ప్రకృతి శాస్త్రాల్లో వెదకటం తప్పనుకొన్నాడు. హెగెల్‌కూ కాంటుకూ యెదురు తిరిగాడు; పెడమొకం పెట్టాడు.

ఇక గతితర్కానికి బదులు లాక్షణిక తర్కాన్ని గణితంలో దట్టించిన గణిత తర్కాన్ని పట్టుకొన్నాడు. పదమూడేళ్ళ కృషి-ఆచార్య ఎ.యన్. వైట్ హెడ్‌ను కలుపుకొని-అజరామరమైన గ్రంథం గణితశాస్త్ర సూత్రాలు మూడు సంపుటాలుగా వెలువరించాడు. ఆ 'ఫిలాసఫ్ ఆఫ్ ఫిజిక్సు'నుతానలా వ్రాయదలంచడమే యిప్పటికీ తవకాశ్చర్యం కలిగిస్తుందన్నాడు.

ఎంగెల్సు తదితరులు ప్రకృతిలో విజ్ఞాన శాస్త్ర సూత్రాల్లో గణితంలో గతి తర్కాన్ని చూచే ప్రయత్నం సందర్భంలో రస్సెల్ జీవితగాథే ఒక పెద్ద విమర్శ. అవునో కాదో విజ్ఞులు ఆలోచించాలనుకొంటాను. రస్సెల్‌తో ఆగిపొమ్మని కాదు. ఆగిపోరాదు. అంతటివారం కాకపోయినా మనవిచారం మనం చేయవలసిందే. ఎందరో చేశారుకూడా.

రస్సెల్ మాట తెలిసో తెలియకో, తెలిసినా పర్వాలేదనో భౌతిక విజ్ఞాన శాస్త్రంలో గతితర్కం చెల్లుతుందో లేదో విచారం సాగుతూనేవుంది. సిద్ధాంత ప్రవర్తకులిలా సైన్సునందుకోలేని వారుకాగా మార్క్సిజంవేపు మొగ్గినవిజ్ఞానశాస్త్రకారులు శాస్త్ర పరిశోధనా జిజ్ఞాసువులు కొందరు 1930 తర్వాత సైన్సు తాజా ఫలితాలను మార్క్సిజంతో గతితర్కంతో భౌతిక వాదంతో సరిపోందుతాయని చెప్పడానికి ముందు కొచ్చారు. సోవియట్ వెలుపల పాశ్చాత్య దేశాల్లో ముందుగా ముందు కొచ్చారు. వారెంతటివారు గానీ వచ్చారు.

సరిపోందుతాయని కొందరు చెప్పారు. కొందరు అసలీ నవీన విజ్ఞాన సిద్ధాంతాల్లోనే తప్పున్నది, విజ్ఞానశాస్త్రరంగంలో సంక్షోభమున్నది, అది పెట్టుబడిదారీ ప్రపంచాన్ని ముంచెత్తుతున్న ఆర్థిక సంక్షోభ రోగంతోడిదేనని, దాని ప్రభావ ఫలితమేనని, దాన్ని మాక్సుప్లాంకు, ఐనిస్టీన్, ష్రోడింగరు, మాక్సుబారన్‌వంటి బూర్జువా శాస్త్రకారులు మాన్పలేరని హాల్డేన్, జోసెఫ్‌నీధాం, హాగ్బెన్లవంటి మార్క్సిస్టు శాస్త్రకారులు వచ్చి మాన్పవలసిందేనని చెప్పారు. "ప్రకృతి శాస్త్రరంగంలో కొత్తశకాన్ని ప్రారంభించే ప్రతి గొప్ప విజ్ఞాన సంపల్లబ్ధి (Epochal Discovery) తోనూ భౌతిక వాదరూపం మారాల్సిందే"నని ప్రవచించిన ఎంగెల్సు వాక్యంలో నిజముందని స్వీకరించి, రెలిటీవిటీ క్వాంటం సిద్ధాంతాలు అటువంటి యుగప్రాధాన్యం కలిగినవని మదింపువేసుకొని, భౌతికవాదానికి తదనుసారమైన నూతన రూపం ఇవ్వాలనికొందరు ప్రయత్నించామంటున్నారు. వాటిని అజదీసుకొంటూ గతితర్కం యొక్క లోతుపాతులు, లోటుపాటులు. ఏమిటో సూటిగా విచారించవలసి వుంది.

దానికంటే ముందుగా సోషలిజము శాస్త్రీయమనే సంగతేమిటో — దానికి శాస్త్రవిజ్ఞానంతోగల సంబంధమేమిటో, దాని శాస్త్రీయతకు ప్రాతిపదిక ఆ శాస్త్రవిజ్ఞానమేనా లేక యీ గతితర్కమా అనే విషయం సమాలోచించుదాం

—o—

# మార్క్సీయ సోషలిజం-సైన్సుతో దాని అనుబంధం

"Without German Philosophy, particularly that of Hegel, German scientific socialism - the only scientific socialism that ever existed - would never have come into being"

— Engels.

"Like every new theory, it (Modern Socialism) had, at first to link itself on to the intellectual material which lay ready to its hand, however deep its roots lay in (material) economic facts."

—Engels.

సోషలిజం, కమ్యూనిజం సిద్ధాంతాలు మార్క్సిజం కంటే ముందటివి. ఎందరెందరో దానికి కర్తలు. అదీ ఎన్నో తీరులు. దాని సాధనకు మార్గాలువేరు. వాని ప్రయోగాచరణలు వేరు. వాటన్నిటికీ వేర్వేరుకర్తలు. ఎవరికి వారుగా కొన్ని కొన్ని అంశాలను చెప్పి, చేస్తూ, రాస్తూ వచ్చారు. ఎవరికి వారుగా నడచిన ఆ నడకలన్నీ పరిశీలించి, వారూ వారూ చేసి చెప్పిన దానంతటినుండీ తీసుకొన్న కొంత కొంతటితో మార్క్సిజం వెలువడింది.

మార్క్సిజంలోని ఏ అంశమూ ఆ అంశంగా కొత్తదిగాదు. వారికి ముందు ఇతరులు చెప్పనిదేదీ అందులోలేదు (*) ఎవరెవరినుండో వేర్వేరుగా విన్నవెన్నో కలిసి ఒక సిద్ధాంతంగా మార్క్సిజం కావటమే విశేషం. మార్క్సు సోషలిజం ఒక క్రోడీకరణ. క్రోడీకరణయత్నాలుకూడ కొన్ని మార్క్సుకు కొంచెం ముందుగా

---

(*) అదనపు విలువ విషయం మార్క్సు కొత్తగా కనిపెట్టాడని చెప్పుకొన్నారు. అంతకుముందు ఇంగ్లాండులో పలువురు చెప్పినట్లుగా చరిత్రకారులు తెల్పుతున్నారు. చరిత్ర పరిణామాన్ని గూర్చి భౌతికకారణాలు ప్రతిపాదించినవారూ పలువురున్నారు. అది కొంత యీ అధ్యాయంలోనే చూస్తాము.

వున్నాయి. కాని ఇంత విస్తృతమైన క్రోడీకరణ ఇంకొకటిలేదు. సోషలిస్టులలోకెల్ల మార్క్సు గొప్ప క్రోడీకర్త. ఆ క్రోడీకరణే మార్క్సుసోషలిజం విశిష్టతగా ప్రసిద్ధిపొందకుండా, శాస్త్రీయమైన సోషలిజంగా పేరొందాలని వారు కోరుకొన్నారు. Darwin of social sciences అని మార్క్సుకు ఎంగెల్సు బిరుదం ఇచ్చాడు. తక్కినవారి సోషలిజాలన్నింటినీ ఊహాసౌధాలు, స్వాప్నికాలు (UTOPIA) అన్నారు. Socialism, UTOPIAN or Scientific అన్న పేరు పెట్టి పుస్తకం ప్రచురించారు. తమదొక్కటే సైంటిఫిక్ సోషలిజం అని చెప్పుకొన్నారు. అదే మార్క్సిజానికి ప్రథమ బౌద్ధికాకర్షణ.

సైంటిఫిక్ సోషలిజం అనేపేరుకే వారు ఆద్యులా? వారసలు విజ్ఞాన శాస్త్రాల విశేష పరిశీలన, అధ్యయనాలు ముమ్మందుగా చేసి, ఆ పరిశోధనా పద్ధతులను జీర్ణం చేసుకొని, ఆ పద్ధతులు ప్రయోగించి తమ సోషలిజాన్ని ప్రత్యేకంగా కొత్తగా కనుగొన్నందువల్ల ఆపేరు పెట్టుకొని సార్ధకంచేశారా? వారిపద్ధతి విజ్ఞానశాస్త్రాల పద్ధతేనా? ఆనాటి శాస్త్ర విజ్ఞానంతో వారి సోషలిజానికి ఎటువంటి అనుబంధం వున్నది? అవి ఎప్పటినుంచి ఏర్పరచారు? సైన్సంటే మొదట్లో వారి అర్థం ఏమిటి? ఇలాంటివీ ఇక్కడ ప్రశ్నలు.

## మార్క్సుకు ముందే శాస్త్రీయ సోషలిజాలు

సోషలిజం ఫ్రెంచి వారిదే కావచ్చుగాని శాస్త్రీయ సోషలిజం జర్మన్లది కావాలని మార్క్సుతో సహా యువహెగిలీయన్లందరూ పెనుగులాడారు. ఆ పేరు ఫ్రెంచి వారికి దక్కకుండా జర్మన్లే చేజిక్కించుకోవాలని జర్మన్లంతా పనిజేసినవారే. నిజమైన సోషలిస్టులమని పేరు పెట్టుకొని జర్మనీలోని ప్రథమ కమ్యూనిస్టులు ఆ పనిని ప్రారంభించారు. అదేమి, ఇదేమియని మార్క్సుఎంగెల్సులు ఏకంగా "జర్మన్ శాస్త్రీయ సోషలిజం" అని బాహాటంగా చెప్పుకొన్నారు. ఈ అధ్యాయం ఆరంభ ఉల్లేఖనే ఆ విషయం చెప్పుతున్నది గదా! ఫ్రెంచి సోషలిస్టు సిద్ధాంత పురుషులందరినీ అవహేళన చేస్తూ, తమతాత్విక ఆధిక్యాన్ని స్థాపించుకొంటూ నిజమైనసోషలిస్టులు సృజించిన సాహిత్యం జర్మనీలో "ప్లేగులాగా" వ్యాపించిపోతోంటే, ఆ ఫ్రెంచి సోషలిస్టుమహామహులను సూటిగా చదవకుండా, సెకెండుహాండు వ్రాతలోచదివి వేళాకోళముచేస్తున్న ఆ నిజమైన సోషలిస్టులు ఫ్రెంచివారంపరిముందూ మనుగుజ్జులని, మందబుద్ధులనీ వారి తప్పునేమాటాన్ని, అది ఆధారంగా వారుచేసే తప్పు విమర్శనీ బహిర్గతంచేస్తూ,తాము

పారిస్‌వాసంలో, ఫ్రెంచిసోషలిస్టులనుగూర్చి ప్రత్యక్షంగా తెల్సుకొన్న సమాచారంతో యువహెగీలియన్ల తప్పు సమాచారాన్ని, అసలు సమాచార రాహిత్యాన్ని ఎత్తి చూపుతూ, ఎగతాళి చేస్తూ అప్పట్లో ఫ్రెంచి పెద్దరికాలను వెనకేసుకొని సమర్థించి, అనతికాలంలో తీసికట్టు చేయ మొదలిడి, వారిని తీసికట్టుచేయ తగిన వాళ్ళం మేము మాత్రమే నన్నట్టుగా వర్తించి, కాలంచేసినవారిని మెత్తగాను, సమకాలికులైన వారిని ఘోరంగాను విమర్శించి తమ పేర్లమీదుగా సైంటిఫిక్ సోషలిజాన్ని జర్మన్ సోషలిజంగా చెల్లించబూను కొన్నవారు మార్క్సు‌ఎంగెల్సులు. ఈ అంతర్జాతీయ ప్రచారకుల జాతీయ దురభిమానాన్ని గమనించి ఆశ్చర్యపోకుండా ఉండలేము. గత అధ్యాయంలోనే చూచారు. మరికొంచెం అనుబంధంలో వుంది. ఎంతో ఎన్ని సందర్భాలలోనో అది విస్తారంగా తీవ్రంగా వ్యక్తమైవుంది. అదంతా ఒక మాదిరి పుస్తకంగానే యివ్వొచ్చు.

జర్మన్ యువహెగీలియన్ల చేత గేలిచేయబడి, మార్క్సెంగెల్సులచేత సోషలిస్టు సిద్ధాంత పితృదేవతలుగా చేయబడిన పూర్వప్రతిభలు, ఖండంగా ఖండించబడివున్న సమకాలిక ప్రతిభలు అయిన ఫ్రెంచి సోషలిస్టు సిద్ధాంత కారులెందరో తమ తమ సోషలిజాలను సైంటిఫిక్ సోషలిజంగాచెప్పుకొన్నారు.అలా చెప్పనివాడు లేడేమో. ఆ విజ్ఞాన శాస్త్రపరిభాషను వాడని వాడేలేడు. అది ఆనాటి ప్రత్యేకలక్షణము. మార్క్సెంగెల్సులు యుటోపియన్లని బిరుదిచ్చిన వారంతా తమది శాస్త్రీయ సోషలిజముగా చెప్పుకొన్నవారే.

సెయింట్‌సైమన్ తన సోషలిజాన్ని Science of Universal Gravitation గా పేర్కొన్నాడు. అలా పేర్కొన్నందుకు అతడు నిజంగా ఔత్సాహిక శాస్త్రపరిశోధకుడుగానైనా వున్నాడు. న్యూటన్ కౌన్సిల్ పేరుతో విజ్ఞాన శాస్త్రకారుల కొక సహకార సంఘ ప్రతిపాదనచేసి, పరిశోధనల అభివృద్ధికి, వానిని శాస్త్రకారులే ఆచరణలోకి తెచ్చే అవకాశాలను కల్పించడానికి కృషి చేశాడు. 18వ శతాబ్దాంతం వరకు గల సైన్సుకు విజ్ఞాన సర్వస్వరచయిత, విజ్ఞానశాస్త్ర వర్గీకరణకర్త. హెగెలంత ఎన్‌సైక్లోపేడిక్ అని ఎంగెల్సుచేత అనిపించుకొన్నవాడు. అంతేగాక, అసలు సమాజ పరిణామ సూత్రాలను ప్రతిపాదించిన మొదటి మేధావి. సమాజ పరిణామానికి ఆర్థిక రాజకీయాంశాలు కారణాలని, అవి రెండూ అవినాభూతాలని, అందులో పూర్వం ఆర్థికం కన్న రాజకీయాంశమే బలీయంకాని, పారిశ్రామిక దశలో ఆర్థికాంశం బలవత్తరమైనదవుతుందని . Politics is the science of

production అని - అసలా రెండింటి వెనుక తట్టునుంచీ సైన్సు, ప్రత్యేకంగా దాని సాంకేతికాభివృద్ధి, పారిశ్రామిక సైన్సు నిర్ణాయకంగా వుంటుందని సిద్ధాంతించి, తన తను ధనమనః ప్రాణాలను సోషలిజానికి అర్పించిన వైజ్ఞానికుడు, సైంటిఫిక్ సోషలిజానికి అగ్రచరుడు, మార్గదర్శి (Pioneer of scientific socialism) అని అనాటికే పేరొందినవాడు. సోషలిజం అనివార్యమని కూడ భావించి వ్రాసినవాడు. ఆయన అనుచరుడైన Bazard చరిత్ర యిప్పటికి రెండు విముక్తిదశలను గడచి, మూడో విముక్తిదశలోనడుస్తున్నది. దానిసలు కొల్లార్లుగాను, కొల్లారు కూలివాళ్ళగాను విముక్తులైన దశలుగడచి, కూలివాళ్ళు సహచరులుగా పరివర్తన చెందవలసిన దశ ఆరంభమయిందని స్పష్టంగా వివిధ చారిత్రక దశలను విభజించి చూపించాడు. మార్క్సు చారిత్రక భౌతికవాద ప్రతిపాదనను, అంతకు పావుశతాబ్దం ముందటి సెమన్ సమాజపరిణామ సూత్రాలతో తులనాత్మకాధ్యయనం చేస్తే సైమన్ విజ్ఞత మౌలికత గొప్పగా నిరూపణకెక్కుతాయి. అదొకటి చేయదగిన పని.

పెట్టుబడిదారీ సమాజ ఆర్థిక కౌటుంబిక వ్యవస్థలను సనిశిత విమర్శ గావించినట్లు వీరిచే గణుతించబడిన యుటోపియన్ ఫూరియర్ తనది The certain science అని చాటుకొన్నాడు. ఆటవికదశ, బర్బరదశ, తెగపెద్దల పాలనా వ్యవస్థ (Patriarchate) గడచి భూస్వామ్య దశ (ఫ్యూడలిజం) నాగరికదశ(పెట్టుబడిదారీ వ్యవస్థ) జరుగుతున్నదని చరిత్ర దశావిభాగం చేసి చెప్పినవాడు.

అర్థశాస్త్రాన్ని నిజమైన సైన్సు గావించినవాడుగా (Who makes real science of political economy) మార్క్సు ప్రశంసకు తొలుత పాత్రుడై పిదప ఆయన ఖండనాఖండపరశుఆఘాతాలకు జీవితాంతం గురియై, ఆయన ఖండించినకొలదీ ఫ్రెంచి కార్మికవర్గంపై అఖండప్రభావంగా అల్లుకొనిపోయి, తాను మృతుడై కూడా మార్క్సు సజీవుడైయుండగా ఫ్రాన్సులో మార్క్సిజానికి వాడి సూదిమొన మోపినంతచోటు పుట్టనీయని ప్రాభవం మిగిల్చినవాడై, యూరపు నాయకత్వవిషయంలో మార్క్సిజానికి గత శతాబ్దాంతందాకా ప్రబలాటంకమై, ఫ్రెంచివారిపై జర్మన్ ప్రభుత్వ విజయాన్ని మార్క్సు కోరుకోవలసినంత ప్రభావ వ్యాప్తికలవాడు పియెరీజోసెఫ్ ప్రౌధాన్. Communism is oppression అంటూ ప్రభుత్వ సోషలిజాన్ని మాత్రం కాదన్నప్పటికీ ఫ్రెంచి కార్మికవర్గపు సైంటిఫిక్ మానిఫెస్టోయని మార్క్సు కీర్తించిన "ఆస్తి అనగానేమిటి?" అనే రచనచే, యూరపును ఆకర్షించిన సిద్ధాంతకారుడు. జన్మచే కార్మికుడు. కంచరపు

పనివానికొడుకు. వృత్తిచేత తానుకూడా కార్మికుడు, పేద. ముద్రాశాలలో అచ్చు తప్పుల దిద్దుబాటుదారు ఆ వృత్తి యిచ్చిన అవకాశంలో జర్మన్‌విద్య అయిన హెగీలియన్ గతితర్కంతో పరిచయం సంపాదించి, దాన్ని తనరచనల్లో ప్రయోగించినవాడు. వ్యష్టిఆస్తి పెట్టుబడిదారీఆస్తిరూపం తీసుకొని అగాథమైన అపారమైన దారిద్ర్యాన్ని తనకు ప్రతిరూపంగా ప్రతిద్వంద్విగా సృష్టించిందని, ఆ పెట్టుబడిదారీ ఆస్తిరూపాన్ని అభావం చెందించాలని అప్పటికది అభావాభావకరణంగా హెగెలిజాన్ని ప్రప్రథమంగా ఆర్థికాంశనికి అన్వయించి పెట్టుబడిదారీ విధాన నిర్మూలనం తప్పనిసరియని చెప్పిన ప్రథముడు. "When socialist writers ascribe this world historic role to the proletariat...."అంటూ మార్క్స్ వ్రాసిన వాక్యంలోని సోషలిస్టు రచయిత ప్రౌథానే. ఆదిమ కమ్యూనిస్టు దశ—దానికి శుద్ధవిరుద్ధమైన వ్యష్టిఆస్తి. వ్యక్తి యాజమాన్యపుదశ చరిత్రలో గడచిన రెండు విరుద్ధదశలు. ఆ రెండింటి సమన్వయదశ, ఆ రెండుదశలందునా గల చెడుగులనుండి తప్పించి మూడోదశ-స్వేచ్ఛాదశ భవిష్యదశ కానున్నదన్నవాడు. సెయింటుసైమన్ ఫూరియర్ సిద్ధాంతాలను యుటోపియాలని పిలిచి వారితర్వాతనే సోషలిజం సైన్సు స్థాయి నందుకొంటున్నదని, కేవలం అర్థశాస్త్రంగామారి జైత్రయాత్ర ప్రారంభించనున్నదని వ్రాసినవాడు. మార్క్సిజానికి మూలాధారాలు మూడని, అవి ఫ్రెంచి సోషలిజం, ఇంగ్లీషు అర్థశాస్త్రం, జర్మన్ గతితర్కం అని, ఆ సిద్ధాంతత్రయ సమన్వయమే మార్క్సిజమని కంఠపాఠంగా చెప్పుకొంటారుగదా! అటు జర్మనీకి, ఇటు ఇంగ్లాండుకి మధ్యగా ఫ్రాన్సు ఉన్నందుకు ఆ సంస్కృత ప్రత్యేకతల, ప్రతిభల సమన్వయం ఫ్రాన్సులోనే ప్రప్రథమంగా జరిగింది—ప్రౌధాన్ చేతిమీదగానే జరిగింది ఆ సమన్వయం ఆకర్షకంగా వుందని, అందులో జర్మన్ విద్య అయిన గతితర్కం పరుసవేదిలాగా ప్రౌధాన్‌కు ఉపయోగపడిందని, జర్మన్ గతితర్కానికి మంచి గిరాకీవుందనే నమ్మకం పదహారుమాసాల పారిస్‌వాసంలో మార్క్సుకు కలిగిన మహత్తరలాభం. మార్క్సుకు ప్రౌదానే దారిగా కనిపించాడు. కాని ప్రౌధాను మీద ప్రౌఢత్వాన్ని నిరూపించుకోవటమే కర్తవ్యంగా మార్క్సుకు మిగిలింది.

The most important thing in Proudhan's "On the Creation of Order in Humanity" is his serial dialectics, the attempt to establish a method of thought in which the process of thinking is substituted for independent thoughts. Proudhan is looking, from the French standpoint, for a dialectic such as Hegel has already given us. A relatiouship with Hegel is therefore here

really in existence.....It would have been an easy matter to offer a criticism of Proudhan's dialectic, if the criticism of Hegel's had been mastered" అని జర్మన్ ఐడియాలజీలో (మార్క్సు)ఎంగెల్సులు వ్రాయనే వ్రాశారు. హెగెల్ గతితర్కం జర్మన్ సత్యసోషలిస్టులకు వశపడిన విద్యకాదని, అది తమకే స్వాధీనమైన విద్యయని, ప్రౌధాను. గతితర్కాన్ని ఖండించడం సత్య సోషలిస్టులకు చేతనైనపనికాదని, అదేదో తామే చేయవలసివున్నపనియని, చారిత్రక భౌతికవాదాన్ని ప్రప్రథమంగా ప్రతిపాదించిన ఆ పుస్తకంలోనే వ్రాసుకొన్నారు. అప్పటికికూడా ప్రౌధాన్ వారికి అభిమానపాత్రుడే కాని అతని గతితర్కం తప్పని ముందొకనాడు తాము నిరూపించవచ్చునని సూచించారనుకోవచ్చు.

1844లో పారిస్‌లో వుండగా మార్క్సుకు Scientific French Communists ఇంకెందరో కనిపించి వారి వ్రాతల్లో చోటు చేసుకొన్నారు. జర్మన్ సత్య సోషలిస్టులైన బాయర్ సోదరులు, స్టిర్నరు, కారల్ గ్రూన్ మొదలైన వారి దాడి నుండి,ఎగతాళినుండి వారందరినీ మార్క్సెంగెల్సులు సమర్థించవలసివచ్చింది. ఆ సైంటిఫిక్ ఫ్రెంచి సోషలిస్టులతో జర్మన్ సోషలిస్టులు సరికారని చూపిస్తూ వ్రాసి వ్రాసి ఆ సైంటిఫిక్ ఫ్రెంచి సోషలిస్టులను యుటోపియనులని, పెటీబూర్జువా సోషలిస్టులని తేల్చి చెప్పగల అధికారం తమదేయన్నట్లు వర్తించారు. సోషలిజాన్ని కార్మికులకు చేర్పించి, కార్మికవర్గ ప్రాధాన్యాన్ని తెలిపే మాటగా కమ్యూనిజాన్ని ప్రత్యేకార్థంలో వాడుకలోపెట్టి, దాన్ని శాస్త్రీయమనేమాటతో గౌరవగణ్యతలను కూర్చాలనే యత్నమే ఫ్రెంచివారిది.

## జర్మన్ సైన్సు అనగా

సోషలిజం ఫ్రెంచివారి సొత్తుఅని, దానికి వారే నిర్మాతలని అన్నప్పటికీ, వారి సోషలిజం సైంటిఫిక్ సోషలిజం కాదని, కాజాలదని, వారి సోషలిజం మొరటుది ముడిసరుకనీ, దానిని సైన్సు చేయగల శక్తి జర్మన్లకే వుందని, అటువంటి పరుసవేది వంటి జర్మన్ సైన్సొకటి వున్నదని, దాన్ని ప్రయోగించి ఆ ఫ్రెంచి రాజకీయపు ముడి సోషలిజాన్ని సైంటిఫిక్ సోషలిజం చేయాలని జర్మన్ యువ హెగెలియనులు ఎందరో ఏకోన్ముఖంగా ప్రయత్నించారని యింతవరకు చూశాము. వారంతా హెగెలిజాన్ని తలక్రిందులు చేసి భౌతికవాదాన్ని జర్మనీలో స్థాపించిన ఫూయర్బాక్ అనుయాయులు.

వారివద్దనున్న జర్మన్ సైన్సంటే మనమనుకొనే సైన్సుకాదు. ఫ్రెంచివారు అనుకున్న సైన్సుకాదు. జర్మన్ తత్వశాస్త్రమని వారి అర్థం. ప్రపంచంలో సైన్సులో చెప్పుకొనేందుకు వారి ప్రత్యేకత ఏమీలేకపోయి, వారిజాతే పరమతాత్విక మైన జాతియని (ఎంగెల్సుకూడా అదేవ్రాశాడు) దాన్నే జర్మన్ సైన్సు అనసాగారు. అందులో హెగెలిజాన్ని ఎదురుతిరగేసి భౌతికవాదాన్ని, మానవసారతత్వాన్ని, మానవసారమంటే "సామాజిక మానవుడు, కమ్యూనిస్టు" అని నిరూపించినట్టి ఫూవర్బాకిజమే జర్మన్‌సైన్సని యువ హెగీలియన్లు అనజొచ్చారు. కేవలం రాజకీయ ఆర్థిక సిద్ధాంతంగా మాత్రమేవున్న ఫ్రెంచి కమ్యూనిజాన్ని తాత్విక కమ్యూనిజంగా జర్మన్ తత్వశాస్త్ర పరిణామ పర్యవసానంగా సాధించి చూపడమే సైంటిఫిక్ కమ్యూనిజమంటే అప్పటి జర్మనుల అర్థం.

## తత్వశాస్త్రం, అందులో గతితర్కం

మార్క్సు ఎంగెల్సులు ఆ అర్థాన్ని కాదనలేదు. వారూ జర్మన్లే. అదీకాక, వారివద్ద అంతకన్నా అప్పట్లో వేరొక సైన్సు, అనగా మనమనుకొనే సైన్సు అసలులేదు. వారు బడిలో సైన్సు చదువుకోలేదు. క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ రచన పూర్తిచేసేదాకా సైన్సులో వారి స్వయంకృషి కూడా లేదు. ఆయన డాక్టొరల్ థీసిస్ ప్రాచీనగ్రీకు పరమాణువాదంలో ఎపిక్యూరస్–డిమోక్రిటస్ తత్వాల పరస్పర భేదాలను ఎన్నిచెప్పడంకాగా అందులోకూడా డాల్టన్ పరమాణు నవీన విజ్ఞానాన్ని పోలికకైనా ప్రస్తావించే స్థితిలో లేకపోయాడు మార్క్సు. ఆ దశలో సైన్సంటే ఆయనకు కూడా తత్వశాస్త్రమే.

అయితే జర్మన్ సైన్సంటే ఏ జర్మన్ తత్వశాస్త్రం కావాలి అనేదాన్లో యువ హెగీలియనులందరితోనూ మార్క్సు భేదించాడు. వారు ఫూవర్బాకిజమే, అతని భౌతికవాదమే, అతని మానవసారమే జర్మన్‌సైన్సు అంటున్నారు. అదే అయితే జర్మన్ ప్రత్యేకత అనలేము. అవి రెండూ ఫ్రెంచి సోషలిజంలో ఎప్పటినుంచో ఉన్నవి. భౌతికవాదానికి మానవతకు జర్మనులే కొత్త. ఫ్రెంచివారిలోనూ మరెవ్వరి లోనూ లేని విశేషం జర్మనులలో వుంది–అది గతితర్కం. అది కాంటునుంచి పెంపొందుతూ హెగెల్‌తో సర్వసమగ్రమయింది. అదీ జర్మన్ ప్రజ్ఞ. ఫూవర్బాక్ దాన్ని ఖండించలేదు. అది ఖండించతగ్గదికాదు. ప్రక్కన పెట్టవలసిందికాదు. ఫూవర్బాక్ దానిపట్ల చక్కనివైఖరి అవలంబించినట్లు ఆదిలో తలంచిన మార్క్సు,

అతిదంతగా వట్టించుకోలేదని, వాడుక చెయ్యలేదని త్వరలో మార్క్సు భావించ సాగాడు ఎంగెల్సు ఆ తర్వాత అదే గట్టిగా వ్రాయసాగాడు. హెగెల్ గతితర్కానికి అసలైన సిసలైన వారసుడను తానేనని మార్క్సు విశ్వసించసాగాడు. ఇక జర్మన్ సైన్సంటే గతితర్కమనసాగాడు. సోషలిజాన్ని సైన్సు చేయడమంటే గతితర్కానుబద్ధం గావించడమేయని మార్క్సు, ఆయననుబట్టి ఎంగెల్సు భావించాడు. "జర్మన్ తత్వశాస్త్రమే లేకపోతే, శాస్త్రీయ సోషలిజమే లేకపోయేద"ని నిజమైన సైన్సుతో తర్వాత పరిచయం పెట్టుకొని, మరెప్పటికో దానితో సోషలిజానికి చుట్టరికం కలపసాగిన తర్వాతకూడా ఎంగెల్సు సిద్ధాంతించాడుగదా!

గతితర్కానికి ఆ తర్వాత కల్పనా పూరితమైన వివరణను కూర్చిన ఎంగెల్సుకు గతితర్కంపట్ల తొలుత మార్క్సుకున్న గాఢమైన అభిరతిలేదు. జర్మన్ సరిహద్దులుదాటి యింగ్లీషు ప్రపంచ సమస్యలను, సత్యం ఎరిగి, ఫ్రెంచి యింగ్లీషు సోషలిస్టుల విశ్లేషణాత్మక యథార్థకథనాలను మెచ్చుకోగలిగినవాడై యుండి, మార్క్సుతో కలిసి ఒకరచనను ఉమ్మడి కర్తయైన పిదపకూడా గతితర్కప్రక్రియపట్ల వైముఖ్యాన్ని వెల్లడించి యున్నాడు. సోషలిజాన్ని జర్మన్లు హెగెలైజు చేసి భ్రష్టుపట్టిస్తున్నారని వ్రాసియున్నాడు.

Right now the Germans have begun to spoil the Communist movement, too. As always, the late comers and the least active believe that they can cover up their sleepiness by contempt for their fore runners and philosophical bragging — What the French and the English said some ten, twenty or even forty years ago--and said very well and in very beautiful language, this the Germans at long last in the past year have learned fragmentarily and Hegelised. At best, they have been rediscovering and publishing in much worsened, abstract form, as a wholly new discovery, what was done by their predecessors. Nor do I exclude my own works from this stricture ... And what can one say of the fact that these wise theoreticians also mention with contempt the only German who has really done something, Weitling, whom many of them don't even mention at all? (Engels-A Fragment of Fouriers', on Trade-1845.)

అటువంటి ఎంగెల్సు మార్క్సు ప్రభావంలో పడి గతితర్కాన్ని తలదాల్చి, దానికి ప్రధాన వ్యాఖ్యాతగా శాశ్వతుడై చా. భౌ. వాద నిరూపణార్థం మీరు ముందు చూడనున్న వివరణలను తయారు చేశారు. చరిత్రను తర్కబద్ధంగా కల్పించడంవల్ల కలిగే సౌకర్యాన్నికూడా ఎన్ని చెప్పారు. అదీ ఇందులోనే ముందు చూడనున్నారు.

## అందుకే ఎంగెల్సు ముందు, వెనుక మార్క్సు

ఎంగెల్సు ఆమోదించినంత తేలికగా కమ్యూనిజాన్ని మార్క్సు ఆమోదించ లేదు. అందుకు ఎంగెల్సు కన్నా ఏడాది వ్యవధి తీసుకొన్నాడు వారిద్దరికీ ఒక్కరే, ఒక్కసారే కమ్యూనిజాన్ని పరిచయం చేశారు. చేసింది సాటి యువ హెగీలియను, మార్క్సుకు సహ సంపాదకుడు అయిన డాక్టర్ మోజెస్ హెస్. ఫ్రెంగు రాజకీయార్థిక కార్మిక కమ్యూనిజంతో నిమిత్తం లేకుండా హెగీలియన్ తర్క పరిణామఫలంగా తలెత్తిన మేధావుల తాత్త్విక కమ్యూనిజానికి ఇతడే ప్రారంభకుడు. Philosophy of Action ప్రతిపాదకుడు. ఫూవర్బాక్ మానవ అన్యతాకరణకు ఆర్థికాన్వయం చెప్పి, ప్రోదాన్ చేసిన వ్యష్టి ఆస్తి దుష్టరూపఖండనను విస్మయముగావించి, National economy is the science of the earthly, as theology is the science of the hcavenly acquisition of goods " అని పొలిటికల్ ఎకానమీకేసి చూపు పెట్టమన్న ప్రథముడు. 1843లోనే పారిస్ వెళ్ళి ఫ్రెంచి సోషలిజాన్ని కవివిని చర్చించి తిరిగి వచ్చి పుస్తకం వ్రాసి, పత్రికలో వ్యాసాలు వ్రాసి, 1842 కడలో దాన్ని కమ్యూనిస్టు పత్రిక అనిపించగా అధావ ప్రకటనా స్వేచ్ఛ యిచ్చిన మార్క్సు అంత మాత్రానే అది కమ్యూనిస్టు పత్రిక కాబోదని, కమ్యూనిజానికి జర్మనీ అనువైన నేలకాదని, అప్పటి రూపంలో ఆ వూహా ప్రణాళికలకు (in their present form) సిద్ధాంతస్థాయిగాని, ఆచరణీయతగాని నాస్తియని వ్రాసిన మార్క్సును పారిస్ ప్రత్యక్షానుభవ మొక్కటే మార్చగలదని, వెళ్ళమని, వెళ్ళేట్టు మార్క్సుచే వాగ్దానం చేయించుకొని ఆ యాత్రకై ఎదురు చూశాడు. కాని మార్క్సుకు కావలసింది యాథార్థ్యానుభవం కాదు. కమ్యూనిజానికి తిరుగులేని గతితర్కానుబద్ధ స్వరూపసిద్ధి కలిగే, కలిగించే వీలున్నదా అన్నదే అతని ప్రశ్న, అన్వేషణ.

## జర్మనీలోనే కమ్యూనిస్టు అయ్యాడు :

నిజానికి మార్క్సు పారిస్ వెళ్ళకముందే మారాడు. ఆ పత్రిక మూసేసిన మూడుమాసాల్లో మార్పు ప్రారంభమయింది. పారిశ్రామిక వ్యవస్థ, సొంత ఆస్తిదారీ దోపిడీ వ్యవస్థ సంఘంలో పడనున్నగండిని, అనగా విప్లవాన్ని తప్పించలేదు – The system of industry and trade, of ownership and exploitation

of people, however, leads even for more rapidly than the increase in population to a rupture in the present day society, a rupture. which the old society is not able to heal అని 1843 మేలోనే వ్రాశాడు. మరో ఐదునెలల్లో, అక్టోబరులో వెలువడిన ఎంగెల్సు వ్యాసం The Progress of Social Reform on the Continent మార్క్సును ఒక జర్మన్ తాత్విక కమ్యూనిస్టుగా పేర్కొన్నది. అప్పటికి మార్క్సు పారిస్ చేరలేదు. మే నెల లగాయతు Philosophy of Right (Law)చదువుతూ ఉండినా గ్రంథం చిత్తుపాఠం తయారు చేసుకొన్నాడు. పారిస్ చేరగానే ఆ చిత్తును క్రమరచనగా ప్రచురించాలని, దానిని ముందుగా పీఠికతో ఆరంభించి పత్రికలో వేయసాగాడు. ఆ పీఠికతో పాటు యూదుల సమస్య అనే మరో వ్యాసం వేశాడు. 1843 డిసెంబరు సరికి వ్రాసిన ఈ రెండు వ్యాసాలు మార్క్సులో కమ్యూనిస్టు పరిణామం పూర్తయిందనేందుకు దాఖలాలు.

## కమ్యూనిజాన్ని గతితర్కపు పునాదిలో పెట్టాలి

సోషలిస్టు సమాజానికి కార్మికుడే ఏలికయని, తత్వశాస్త్రానికి కార్మికవర్గమే గట్టిసాధనమని, మానవుని అన్యతాకరణకు పరాకాష్ఠ కార్మికుడని, మానవత్వము, అభావంచెందిన కార్మికుడే మానవత్వ పునరుత్థానానికి పరమసాధనమని, అన్ని అన్యాయాలకు గురియైన కార్మికుని స్వీయవిముక్తి సర్వమైన అన్యాయాలనుండి మానవాళిమొత్తాన్ని విముక్తి చేయగలదని, వ్యాపారధనారాధనమనే యూదుమత భౌతికరూపం నుండి సర్వమానవ విముక్తితోనే యూదుజాతి స్వేచ్ఛకూడా ముడిబడివుందని జర్మన్ స్వేచ్ఛ మానవస్వేచ్ఛతో పెనగొని వున్నదని, మానవుని ఆర్థిక పరమైన అన్యతాకరణనుండి ముక్తేముక్తియని, ఆ రెండు వ్యాసాలనిండా హెగీలియన్ తర్కవిన్యాసం చేశాడు. కమ్యూనిజం మానవతాపునరుద్ధరణమని, కమ్యూనిజానికి కార్మిక వర్గము వెన్నెముక అనే భావాలు ఫ్రెంచి కమ్యూనిజంలో వున్నవే-అవి గత ఏణ్ణరంగా మార్క్సుకు తెలిసివున్నవేగాని తెలియనివికావు. కాకపోతే ఆ భావాలను గతితర్కాను బద్ధంగా చెప్పకోవడం కుదిరించుకొన్నాడు. ప్రత్యేకంగా కార్మికుణ్ణి ఆధారం చేసుకొని ఇతరవర్గాలన్నింటికీ కూడావిముక్తిని మానవతావికాసాన్ని కలిగించడానికి అడ్డంకి ఏమీ వుండదని, పైగా కమ్యూనిజం కార్మిక కమ్యూనిజమయితేనే అది సుసాధ్యమవుతుందని నమ్మకం ఏర్పరుచుకొన్నాడు. కమ్యూనిజం అనేది సోషలిజానికి కేవలం పర్యాయపదంగాకాక, కార్మిక ప్రాముఖ్యంగల సోషలిజానికే ప్రత్యేకంగా వర్తించదగ్గదన్నది ఫ్రెంచి వారి ప్రయోగముగా అప్పటికేవుండేది. అది మార్క్సు ఎరుకలో వున్న సంగతి. ఆ కార్మిక ప్రాముఖ్యాన్ని పాలకత్వం దాకా అలవోకగా యిక ఎవరో ఒకరు-దుష్ప్రచారకులైన శత్రువులో, ప్రోత్సాహకంగా మిత్రులో-అనగలవీలున్నది. అది కొత్త మిత్రుడు మార్క్సుచేశాడు. కార్మిక కమ్యూనిజాన్ని తార్కికావధికం

చెయ్యడమయింది. అది ఆయన ప్రథమావస్థలోనే చేశాడు. "In regard to the world which is coming into being, the proletarian then finds himself possessing the same right as the German king in regard to which has come into being, when he Calls the people as he calls the horse his horse."

## కార్మికులను కళ్ళజూడకుండానే -

కార్మికులను పాలకులుగా చెప్పే ఈ వాక్యాలు వ్రాసి అచ్చువేసేదాకా (1844 ఫిబ్రవరిదాకా) పారిస్‌వాసంలో మార్క్సు ఇంకా కార్మికులను కార్మిక సంఘాలను కళ్ళజూచిన దాఖలాలేదు. కార్మికవర్గ సిద్ధాంతులెవ్వరినీ కలియలేదు. తన పత్రికకు వ్యాసాలు పంపమని ఉత్తరాలు వ్రాసే పేరున్న ఫ్రెంచి వాడెవ్వడూ పలకలేదు. ఫ్రాంకో-జర్మన్ ఉమ్మడి పత్రికగా నడపాలనుకొన్న ప్రణాళికే విఫలమయింది. కార్మికుని పాలకునిగా ప్రకటించిన గొప్పను వెంటబెట్టుకొని కార్మిక సిద్ధాంతులను, సోషలిస్టు విప్లవకారులను, వీరులను పత్రికమూతబడిన తర్వాత తీరుబడిగా మార్చి ఏప్రిల్ నెలల్లో కలియసాగాడు. ఆ పిదప ఫ్రెంచి జర్మన్ కార్మికులను రహస్య సంఘాలలో కలిసిన దాఖలాలున్నై. ఒదీ రెండు మూడుసార్లే కలిశాడనవచ్చు. కార్మికులతో కలిసినప్పటి అనుభవాలను వెంటనే కాగితాని కెక్కించి జర్మనీలో వలెటూళ్లో వున్న ఫూవర్బాక్‌కు ఆగస్టులో (1844) బట్వాడా చేసేశాడు; తన ఆర్థిక వ్రాత ప్రతుల్లో వ్రాసిపెట్టుకొన్నాడు.

అందుచేత ఫ్రాన్సులోనైనా కార్మికుని కళ్ళజూడకుండా, జర్మనీలో అసలింకా పుట్టని, పుట్టుక పూర్తిగాని కార్మికుణ్ణి జర్మనీ పాలకుడననడం విజ్ఞాన శాస్త్రశిక్షితమైన బుద్ధి యొక్క పని మాత్రం కాదు. కార్మిక కమ్యూనిజాన్ని విని, దాన్ని గతితర్క సమ్మతం చేసుకొని, కార్మికపాలకత్వం దాకా తార్కికావధికంగా వూహచేసి, వాస్తవం తర్కానుగతం, తర్కానుగతమైనది వాస్తవం real is rational, rational is real అనే హెగెలీయ సమీకరణను తిరుగులేని సత్యంగా నమ్మి చెప్పినవాడు మార్క్సు.

## కార్మిక సిద్ధాంతులెవరూ చెప్పని కార్మిక పాలకత్వం

కాని కార్మికులుగా పుట్టి, కార్మికులుగా బతుకుతూ, కార్మికోద్యమ ప్రస్థలై వున్న ఆనాటి కార్మిక సిద్ధాంతులెవ్వరూ కూడా-పీరీలిరో, ప్రౌథాన్, వీటింగు-ఇంత పదవిని కార్మిక వర్గానికి యివ్వలేదు. ఇంగ్లాండులో రెండేళ్ళుంటి, కార్మికులసంగతి కళ్ళారా చూచి, చెవులారావిని, చేతులారా సేకరించి. దేశదేశాల సోషలిస్టు, కమ్యూనిస్టు సిద్ధాంత, ఉద్యమాలనెరిగి - సర్వం చక్కగా అధ్యయనంచేసి ఇంగ్లాండులో

యిక రేపో మాపో సోషలిస్టు మహా విప్లవం చెలరేగబోతున్నదని, ఫ్రెంచి విప్లవం దాని ముందు చిన్నపిల్లలాటగా తేలిపోనున్నదని ప్రకటిస్తూ అదిలోనే 1845 లో వ్రాసిన The condition of the working class in England in 1844లో కూడా మార్క్సులాగా ఎంగెల్సు కార్మికుల్ని పాలకులుగా ప్రకటించలేకపోయాడు. మార్క్సు భావాలను తెలిసి వుండీ, ఆ భావాలను ఇంకా బలంగా చెప్పిన హోలీఫామిలీ రచనలో కొన్ని భాగాలను స్వయంగా వ్రాసి, మార్క్సుతో జంట రచయితగా అచ్చుకెక్కి కూడా ఆ భావాన్ని ప్రత్యేకంగా కార్మికవర్గం గూర్చే వ్రాసిన ఈరచనలో ప్రతిపాదించకపోవడం ఆనాటికి మార్క్సుతో ఏకీభవించకపోవడన్నే తెలుపుతుందనుకోవాలి. In this book — great stress is laid on the dictum that communism is not a mere party doctrine of the working- class but a theory compassing the emancipation of the society at large; including the capitalist class అని 43 యేళ్ళ తర్వాత మళ్ళీ ఆ పుస్తకము అచ్చువేస్తూ పీఠికలో ఎంగెల్సు తెలుపుకొన్నాడు. హోలీ ఫామిలీ రచనలో సహకర్త అయిన ఎంగెల్సు 1845 లో హెగెలైజింగు పులుముడుని నిరసించినా, కార్మికుణ్ణి ఏలికగా చెప్పకపోయినా దాన్ని మార్క్సుతో ఏకాభిప్రాయం తెలపకపోవడమే అవుతుంది.

కార్మికవర్గం యింకా అవతరించని జర్మనీలో ఉన్నత మధ్యతరగతిలో పుట్టి పెరిగిన ఒక తత్వశాస్త్ర (చరిత్ర) విద్యార్థికి కార్మికులను కళ్ళజూడకుండానే వారి పాలకత్వపు రేఖ గోచరించింది. అది సిద్ధాంతంగా, కార్మికవర్గ పాలనగా కమ్యూనిస్టు ప్రభుత్వాలు ఏర్పడి స్థిరపడిన ఎంతోకాలానికి యూరోపియన్ కమ్యూనిస్టుపార్టీలు ఆ కార్మికవర్గ పాలకభావాన్ని, నియంతృత్వ, నాయకభావాన్ని ప్రశ్నిస్తున్నాయి. అరవై యేళ్ళుగా ఏర్పడుతున్న కమ్యూనిస్టు ప్రభుత్వాలన్నవి యథార్థంగా కార్మిక ప్రభుత్వాలేనా అన్నప్రశ్నకు తావివ్వడం కలిగింది? ఆ భావం అసలు సవ్యమైనదేనా అనే చర్చలో చాలా భాష్యవైచిత్రి వెలసింది.

ఇక్కడే మరో వాస్తవాన్ని చెప్పాలి. కార్మికజన్ములై, కార్మికులుగా జీవిస్తూ కార్మిక విప్లవ ప్రణాళికలువేసి, విప్లవించి, కుట్రదార్లుగా శిక్షలుపడ్డ ఆనాటి కార్మిక సిద్ధాంతకారులందు ఏ వొక్కరూకూడా మార్క్సిజాన్ని ఒప్పుకోలేదు మార్క్సు వారందరినీ విని, చదివి, వెదికి, కలిసి, మాటాడి, మెచ్చి, తలకెత్తుకొని వారి సిద్ధాంతశక్తే కార్మికుల పాలనార్హతకు నిదర్శనంగా చూపుకోసాగి, అనతికాలంలో వారందరినీ నేలకు విసిరేసి, విమర్శించి. వెలివేసి, విరోధించి—బూర్జువావర్గంలో పుట్టి, బూర్జువా వృత్తి నవలంబించి తన పోషణను చూడగలవానినిమాత్రం తనసిద్ధాంత సహస్రష్టగా అంగీకరించి కార్మిక నియంతృత్వ కమ్యూనిజాన్ని ప్రవచించాడు అనే యధార్థం విస్మరించదగ్గదికాదు. కార్మికప్రజకు జర్మన్ ఉదాహరణగా తాను పొగడి చెప్పిన

పీటింగును ప్రౌఢానుభావాలతో ఏకీభవించినందుకు వెలివేశాడు. ఆ వెలితో హెస్సు విభేదించి, అతడుకూడా అతనితోపాటుగా ప్రౌఢానుతో వుండిపోయాడు. ఆ శార్మిక సిద్ధాంతకారులను బూర్జువా, పెటీబూర్జువా, యుటోపియన్ సోషలిజాలవారని పేర్లు తగిలించి దెబ్బతీయబూనుకొన్నారు. ఆ కార్మిక మేధావులుమాత్రం వీరిని కార్మికులు గారనిగాని బూర్జువావర్గ స్వభావపూరితమైనవారనిగాని, తదనుగతమైన సిద్ధాంతులనిగాని వారివర్గజన్మలను తడవి ప్రచారం చేయలేదు. ఇదే వారికీ వీరికీగల తారతమ్యం. మార్క్సు మెట్టిన ఫ్రాన్సు, బెల్జియం, ఇంగ్లాండుదేశాల కార్మికవర్గం ఆయనను ఆమోదించలేదు ఫ్రెంచి కార్మిక లిప్పటికీ అధికులు ఆయనకు లోబడలేదు, ఆలోచించాల్సిన సంగతికాదా?

## అర్థశాస్త్రం పరిచయం లేకుండానే

ఫ్రెంచి కార్మికుల రాజకీయ సోషలిజాన్ని జర్మన్ తాత్విక తార్కికరూపంలో తర్జుమాచేయడంలో మార్క్సు కృతకృత్యుడయ్యాడు. అది కుదిరించుకోవడమే ఆయన కమ్యూనిస్టు కావడమన్నమాట. అదే ఎక్కువకాలం పట్టింది. ఈ రెండు వ్యాసాలతో కమ్యూనిస్టు ననిపించుకొన్నమార్క్సు అర్థశాస్త్ర ప్రథమ పాఠాలైనా చదివినవాడుకాడు. ఆడంస్మిత్, దేవిడ్ రికార్డో, జె. బి, సే. జేమ్సుమిల్‌లను తెరచినవాడుకాడు నాటికి మార్క్సుజర్మన్‌తాత్వికకమ్యూనిజంలోనివాడు మాత్రమే. ఆ విషయాన్నే ఆర్థిక తాత్విక వ్రాతప్రతులలో చెప్పుకొన్నాడు. Communism is the position as the negation of negation....If we characterise communism itself, because of its character as negation of negation, as the appropriation of the human essence through the intermediary of the negation of private property....in the way of Hegel's phenomenology....అంటూ తన కమ్యూనిజం జన్మస్థానం హెగెల్ ఫినామినాలజీయని, హెగెల్ అభావాభావకరణ సూత్రమని చెప్పుకొన్నాడు. అదే ఆయనజర్మన్ సైన్సు. ఫ్రెంచి కార్మిక కమ్యూనిజాన్ని తాను గతితర్క సమ్మితం చెయ్యడంతో కమ్యూనిజానికి నిజమైన విజ్ఞానశాస్త్రస్థాయి సమకూరినట్లు భావించాడు. ఆ విజ్ఞానశాస్త్ర సూత్రాలకున్న నియతి అనివార్యత కమ్యూనిజానికి ఇంతటితో సిద్ధించిందని తలంచాడు. బూర్జువా ఆస్తి వ్యవస్థాపతనం తప్పించరానిది; అనివార్యం అవశ్యం అది చరిత్ర శాసనం, కార్మికులను చరిత్ర ఆదేశిస్తోంది అంటూ అనివార్యతాభావ ఉద్ఘాటనాపాఠంతో యిక తన పారిస్ రచనలను నింపేయసాగాడు.

## చారిత్రక నియతివాదం

It takes actual communist action to abolish actual private property....History will lead to it—E&P. Manuscripts, 1844

It follows that the proletariat can and must emancipate itself...It is a Question of what the ptoletariat is and what, in accordance with this being, it will historically be compelled to do· Its aim and historical action is visibly and irrevocably foreshadowed in its own life situation as well as in the whole organisation of bourgeois society to-day.

Indeed private property drives itself in its economic movement towards its own dissolution—only in as much as it produces the proletariat as proletariat, poverty....The proletariat executes the sentence that private property pronounces on itself by producing the proletariat—Holy Family.

ఈ చారిత్రక అనివార్యత, నియతిని పారిస్ తర్వాత నిర్విరామంగా ఘోషించడం సువిదితమే. ఆర్థిక వ్రాతప్రతులన్నమాటకు తగినట్టుగా అందులో ఆర్థిక సమాచార వర్ణన, విశ్లేషణ, వర్గీకరణ, సునిశితవిమర్శ విశిష్టంగా లేనేలేదు. ప్రౌధాన్ విశ్లేషించి ప్రపంచదృష్టిలో పెట్టిన వ్యష్టిఆస్తిని మనుష్యశ్రమయొక్క అన్యతాకరణగా వ్యాఖ్యానించడమే ప్రధానాంశం. ఫూవర్బాక్ మతవిషయంలో దారి చూపగా, ఆ దారిలోనే మోజెస్‌హెస్ వ్యాపార రాజకీయరంగంలో హెగెల్ భావ క్రమాన్ని తలక్రిందులు గావించి(Inversion)కుదనుమొదలు గావించి ఆ రంగాలలో భౌతికవాదపరమైన ప్రతిపాదనలను సాధించినట్టే ఆర్థికవిభాగంలో హెగెల్‌ను ఉల్టా జేసి ఆర్థిక భౌతికవాదాన్ని తయారించి, ఫూవర్బాక్ అభావాభావకరణంలో క్రొత్తగా చేసిన కృషితో ముడికమ్యూనిజమనే (Raw Communism) దశ రూపు రేఖలు సూచించడంకన్న వేరేమీలేదు. ఎంగెల్సు అప్పటికి గావించిన ఆర్థిక విశ్లేషణతో ఈ ఆర్థికప్రతులను చూస్తే చాలాచాలా వెనుకబాటుతనం కనిపిస్తుంది. నిజంగా ఆ వ్రాతప్రతుల తయారీకి ఎంగెల్సు, హెస్, కడకు వీట్లింగు రచనలను ముందు పెట్టుకొన్నాడు మార్క్సు. ఎంగెల్సు వ్రాసిన అర్థశాస్త్ర విమర్శ్యసూత్రాల చిత్రణమనే వ్యాసానికి నోట్సురాసుకొని అర్థశాస్త్రపు టక్షరాభ్యాసం చేసుకొన్నాడు మార్క్సు. కాగుణితపుదశ ఆ వ్రాతప్రతుల్లో వుందేమో। కాని ఆ కాసంత ఆర్థిక దినుసునీ హెగెలైజు చేయడంలోమాత్రం అద్వితీయమైన ఆధిక్యం చూపాయి. అదే మార్క్సు ప్రత్యేక ప్రజ్ఞ.

కాని ఇంగ్లీషువారు ఫ్రెంచివారు నూటిగా సులభసుందరంగా చెప్పిన కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని భ్రష్టుపట్టిస్తున్న హెగెలైజింగును గూర్చి 'ఇంగ్లీషు కార్మికుల జీవన పరిస్థితులన్న' రచనతర్వాతే ఎంగెల్సు విమర్శించిన సంగతి ఇంతకుముందే చెప్పుకొన్నాం. ఆ విమర్శ మార్క్సుకు వర్తించదనుకోనక్కరలేదు. అందుకేమాత్రం ఆస్కారంలేదు. హెగెలైజింగు ధోరణినెంతో చంపుకొని, ఇంగ్లీషు ఎంపిరిసిస్టు వాస్తవిక కథనాన్ని సిద్ధాంతీకరణ రీతిని ఎంతో గ్రహించి ఇంగ్లీషు కార్మికుల జీవన పరిస్థితులను చిత్రించిన ఎంగెల్సు అటువంటి తనరచనలను కూడా ఆ హెగెలైజింగు క్రిందనే చూపి, ఆ వాసన మచ్చుకైనాలేని జర్మన్ కార్మికుడైన వీట్లింగు రచనను ఎన్నికజేసిన ఎంగెల్సు ఆ విమర్శ అప్పటి మార్క్సు రచనలకు వర్తించకుండా చెప్పాడనుకోడానికి ఆస్కారం ఎక్కడుంది? లండన్ చేరుకొని మార్క్సు అర్థశాస్త్రంలో గాఢమైన పరిశోధనకు ఉపక్రమించేవరకు చేసిన రచనలన్నింటికీ ఆ విమర్శ నిజంగా వర్తించాల్సివుంటుంది. ఆ లోపటి రచనల్లో సిద్ధాంతీకరణమేగాని ఆర్థికాది యథార్థాంశాల ప్రత్యక్షసేకరణ విశ్లేషణల ప్రాబల్యంలేదు. ఆ సిద్ధాంతీకరణ మాట అందామా అది హెగెలీయం. అందులో హెగెలీ పరిణామచిత్రణలోని దిశను మార్చడంతప్ప మరొక విశేషంలేదు

ఐతే ఆ విమర్శచేసిన అనతికాలంలో ఎంగెల్సు బ్రసెల్సు చేరుకొన్న మార్క్సుతో కలిసి, చారిత్రక భౌతికవాదాన్ని ప్రథమంగా సూత్రించిన జర్మన్ ఐడియాలజీ రచనలో చేయికలిపాడు, అ. చా. భౌ. వాద ప్రతిపాదనతోనే మార్క్సు మార్క్సిజాన్ని తయారుచేసినట్లు చెప్పాల్సివుంది. అది 1845, 1846 సంవత్సరాల తుది మొదళ్ళలో జరిగింది.

## మళ్ళీ హెగెల్‌ను తిరగేస్తేనే చారిత్రక భౌతికవాదం

ఉత్పత్తి విధానాలు–శక్తులు, ఉత్పత్తి సంబంధాలు సమాజభావజీవితం సర్వానికి మూలకందమై, ఉత్పత్తిశక్తుల సంబంధాల పరస్పర మైత్రీఘర్షణలే సమాజ పరిణామానికి చోదకసూత్రమవుతున్నవనే సిద్ధాంత ప్రతిపాదనా ప్రాథమికరూపాన్ని మార్క్సు వెలువరించాడు. యావత్ప్రపంచ మానవ సమాజ చరిత్ర సమస్తంలోను అది వర్తిస్తుందన్నాడు,

కాని ప్రపంచవ్యాప్తంగా నానాదేశాల, నానాజాతుల చరిత్రల పలుదశల ఆర్థిక వాస్తవాల భూరిసేకరణ ఇతరులుగాని, తాముగాని చేసి, ఆ విస్తారమైన సమాచార పరిశీలనా ప్రాబల్యంమీద అనుభవమితమైన ఆగమన విధానఫలంగా (empirical and inductive method) గాని, తగినంత హేతుప్రత్యయ సామగ్రిని పురస్కరించుకొన్న ఆనుమానిక (Inferential) ప్రక్రియాఫలంగాగాని అప్పట్లో అ.చా.భౌ. వాదాన్ని వారు కనిపెట్టలేదు. మళ్ళీ హెగెల్ చారిత్రకవాదపు దిశమార్చడమే

పద్ధతి. హెగెల్ చెప్పిన చరిత్రాంశాలకన్న అదనపు సమాచారాన్ని అంతగా ప్రోగు చేసి చూపలేదు. హెగెల్ చెప్పిన ఆలోచనోత్పత్తి విధానమనే (thought production) భావాన్ని జీవితావసర వస్తూత్పత్తివిధానంగా మార్చి, ఉత్పత్తి పరికర నిర్మాత (tool-maker) గా మానవుని ప్రాధాన్యాన్ని, ప్రకృతితో అతనిపోరాటాన్ని సిద్ధాంతించినట్టి హెగెల్ చరిత్రతత్వాన్ని (Philosophy of History) ఉత్పత్తి విధాన ప్రాతిపదికగల చా.భౌ. వాదంగా చెప్పడమే దానిలో యితివృత్తం. లెనిన్ హెగెలును స్వయంగా చదువుతూ దీన్ని గమనించాడు. Germs of Historical Materialism in Hegel అంటూ తన ఫిలసాఫికల్ నోట్సుతో సొంత వ్యాఖ్యలు వ్రాసి పెట్టుకొన్నాడు. [సెయింట్ సైమన్ వ్రాసిన రాజకీయాలు, నీతి, తత్వశాస్త్రం—పరిశ్రమలు అన్న రచన కూడా మార్క్సుకు ఇందులో ఎంత ఉపకరించిందో చూచి చెప్పుకోవాల్సివుంది.]

వ్రాతప్రతిలోనే పడివున్న ఆ రచనను 43 యేళ్ళ తర్వాత మార్క్సుమరణానంతరం 1888లో తిరిగి చదువుకోగా, అందులో వున్న ఆర్థిక చారిత్రక వాస్తవాంశాల పరిజ్ఞానం ఎంత అసంపూర్ణంగా, అసంతృప్తికరంగా వుందో ఎంగెల్సుకే అర్థమయింది. అప్పటికే అది ఉపయోగం మాలిన రచనగా ఆయనకే తోచింది.

"The completed portion consisted of an exposition of the materialist conception of history which proves only how incomplete our knowledge of economic history still, was at that time.... for the present purpose, therefore it was unusable" (పూర్వవాక్పీఠిక)

ఆర్థిక యథార్థాంశాలు అత్యస్వల్పాతి స్వల్పంగావున్న ఆ రచనను చూస్తే, ఆ సమాచారబలంమీదే ఇంత పెద్ద సిద్ధాంతాన్ని విశ్వజనీనంగా ప్రతిపాదించ సాహసించడమేమిటాయని శాస్త్రపరిశోధనా ప్రమాణబద్ధమైన బుద్ధి నివ్వెరపోకతప్పదు. నేడు మన విశ్వవిద్యాలయాల్లో వెలువడే థీసిస్‌లలో కూడా సమాచారభాగం ఇంత అరదాకొరదాగా ఉండటంలేదు. నిజానికి హెగెల్ చారిత్రక సిద్ధాంతబలంమీద విశ్వాసమే పూతంగా, దాన్ని దృష్టిభేదంతో సర్దిచెప్పే ప్రక్రియకు జర్మనీలోగల పరపతి ఆధారంగా ప్రతిపాదించడమేగాని అందులోవున్న గుప్పెడు చారిత్రక సమాచారం మీదే ఆ సిద్ధాంతాన్ని ప్రతిపాదించడమంటే వూహించలేకపోతాము.

# చారిత్రక భౌతిక వాద నిర్వచనం, వర్ణనలు

ఈ చా. భౌ. వాదాన్ని మళ్ళీ పద్నాలుగేళ్ళ తర్వాత, పరిణత చిత్రంతో పాండిత్య పరిపాకంతో ఒక్కపేరాలోకి కుదించి క్లుప్తంగా మార్క్సు తన Critique of Political Economy పీఠికలో నిర్వచించాడు పరమ ప్రమాణమైన లాక్షణిక నిర్వచనంగా దాన్ని ఉదాహరించుకొంటుంటారు. కాని అది తార్కికుని రచన కాదు. అంతకన్నా, అది విజ్ఞానశాస్త్రకారు నిర్వచన అనపేక్షదు భాషలో నిష్కృష్టత లేదు. అసలు ఆలోచనలో భావంలో స్పష్టత ఏర్పడనప్పుడు జరిగే భాషాదోషమని అర్థమౌతుంది. ఆపేరాకు ప్రతిపదార్థం చందాస్వయం వ్రాసి, అర్థం చెప్పితే గాని తాత్పర్యం తెమల్చుకొనటం దుర్ఘటం. దాని అర్థనిర్ణయానికి పతితయుక్త సహాకారం ఔదార్యము చాలా అవసరం. అంతకన్నా మానవసమాజ దశల చిత్రణలో ఆదిలోనే ఎంతో అ యథార్థాంశం వుంది. తెలిసిపట్టించుకోకుండా అందరం వదలిపేస్తున్న అవాస్తవిక మైన ఊహా మాత్ర దశా ప్రతిపాదనే వుంది. స్టాలిన్ సైతం పర్యాయిగా దాటించాల్సి వచ్చిన సంగతి అది. ప్రాథమిక పరిశీలన, వాస్తవసమాచార సేకరణ లోపించిన స్థితిని చాటుతుంది. జరిగిన విప్లవాలను, జయించిన విప్లవాలను, జరిగే విప్లవ ప్రయత్నాలను సంభవాలు, సంభావ్యాలు, అవశ్యాలుగా చెప్పుకోడానికే ప్రతిబంధకమైన భావాన్ని పొందుపరచిన అవాస్తవిక సూత్రీకరణ వున్నది. కొంతకాలం రష్యన్ ప్రచురణలలో ఆ భాగంలో చుక్కలుంచి అచ్చునుంచి దాచవలసినంతపనిఅయింది * అంత అయథార్థ చిత్రణ, అవాస్తవంగా తేలిన సిద్ధాంతీకరణ అందులో వుంది.

మార్క్సుసమ్మతితో వెలువడిన ఎంగెల్సు రచన యాంటీడూరింగు లోను, మార్క్సు రచన Capital లోను, మార్క్సు నోట్సు సాయముతో ఎంగెల్సు వ్రాసిన ORIGIN of the Family, Private Family and the STATE వంటి రచనల్లోనూ వర్గాలు, ప్రభుత్వం ఏర్పడటం గూర్చి, వ్యష్టిఆస్తి జానిసత్వం ఆదిలో రూపొందడంగూర్చి, ఇంగ్లాండులో పెట్టుబడిదారీ విధానావతరణకు అవకాశమిచ్చిన పూర్వ సమాజదశను గూర్చి, ఆ క్రమపరిణామానికి ఉత్పత్తి పరికరాల అభివృద్ధే, స్వభావమే కారణమనడాన్ని గూర్చి యిచ్చిన చారిత్రక ఊహాచిత్రణలు, చారిత్రక యథార్థాంశాల వర్ణనలు వారి చా.భౌ. వాదసిద్ధాంతాన్ని నిరూపించడానికి బదులు ఖండించడానికి ఉపకరించే సమాచారంగా వుందని చెప్పితే విపరీతమనిపించ వచ్చుగాని జాగ్రత్తగా వివేచించి విశ్లేషిస్తే మాత్రం అదేపరిస్థితి. ఈ వైపరీత్యాన్ని ప్రత్యేకించి సోదాహరణంగా మరొకసారి చూపాల్సే వుంది అటువంటి పరిస్థితిలో చా. భౌ. వా. సిద్ధాంతం యథార్థ చరిత్ర పరిశీలనా పర్యవసానంకాదని, అసగా విజ్ఞానశాస్త్రీల అన్వేషణామార్గావలంబన ఫలంకాదని–హెగెల్ తత్వశాస్త్ర ఉల్టాకరణతర్కప్రక్రియా ఫలమేనని రుజువవుతుంది. గతితార్కిక చారిత్రక భావవాదంగా వుండే హెగెల్

* K. Marx Selected works 1941, 1946

చరిత్రతత్వాన్ని (Philosophy of History) భౌతిక వాదపరంగా, ఆర్థికాంశం పరంగా చెప్పి గతితార్కిక చారిత్రక భౌతికవాదాన్ని తయారుచేశారు.

## చరిత్రలో తార్కిక కాల్పనికత

చారిత్రక పద్ధతికి తార్కిక పద్ధతికి మార్క్స్ ఎంగెల్సుల దృష్టిలో భేదంలేదు. జర్మన్ ఐడియాలజీలో వెలువరించిన చా. భౌ. వాదాన్ని పద్నాలుగేళ్ళ తర్వాత నిష్కృష్టంగా నిర్వచిస్తూ వ్రాసిన క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ మీద సమీక్షలో ఎంగెల్సు ఇదే అభిప్రాయాన్ని నిరాఘాటంగా చాటివున్నాడు. ఆ పరిణత రచనలో అవలంబించిన పద్ధతే అదియని చెప్పాడు. చారిత్రకవాస్తవాలు కొరవడిన ఘట్టాలలో తార్కికంగా వూహించి చరిత్రను తయారించి పూరించడం తప్పుకాదని, చారిత్రక వాస్తవాలతోనే చరిత్రనురచించాలనే విధానంలో అప్రధానమైన వివరాలతో దృష్టి విక్షేపం కలిగేట్టుగా చరిత్రను నింపాల్సివస్తుందని, అందుచే తార్కికోపసతమైనఊహా చిత్రణమే చరిత్ర రచనలో ప్రశస్త విధానమని కూడా ఘంటాఘోషం చేశారు. అప్పటికి బూర్జువా సమాజ ఆర్థిక చరిత్ర కూర్పరాకున్న స్థితి (!), అందుచేత తార్కికంగా వూహ సారించి, ఆ వూహతో నింపడమే చరిత్ర రచనలో మేల్తరమైన పద్ధతియని నొక్కి వక్కాణించాడు. తార్కిక కాల్పనికతే చరిత్రకుచాలు అన్నాడన్న మాట. హెగెలైజింగును నిరసించిన ఎంగెల్సు ఎంత మార్పుకులోనయ్యాడో కదా !! ఎంగెల్సును ప్రత్యక్షంగానే వింటే బాగుంటుంది.

He (Hegel) was the first who attempted to show an evolution, an inner coherence, in history; and while today much in his "Philosophy of History" may seem peculiar to us, yet the grandeur of his fundamental outlook is admirable even today, whether one makes comparison with his predecessors or with any one who since his time, has taken the liberty of reflecting in general concerning history. Everywhere, in his "Phenomenology, Esthetics, History of Philosophy, this magnificient conception of history penetrates, and everywhere this material is treated historically, in a definite, even if abstractly inverted, interconnection with history.

This epoch-making conception of history was the direct theoretical prerequisite for the new materialist outlook, and thereby provided a connecting point for the logical method, too,

The criticism of economics, even according to the method secured, could still be exercised in two ways, historically or logically. Since, in history as in its literary reflection, development as a whole also proceeds from the most simple to the more complex relations, the historical development of the literature of political economy provided a natural guiding thread with which criticism could link up,-and the economic categories as a whole would thereby appear in the same sequence as in the logical development. This form apparently has the advantage of greater clearness, since indeed it is the actual development that is followed but as a matter of fact it would thereby at most become more popular. History often proceeds by leaps and zigzags and it would in this way have to be followed everywhere by not only would much material of minor importance have to be incorporated, but there would be much interruption of the chain of thought, furthermore, the history of economics could not be written without that of bourgeos society and this would make the task endless, since all preliminary work is lacking. The logical method of treatment was, therefore, the only appropriate one. But this, as a matter of fact, is nothing else but the historical method; only divested of its historical form and disturbing fortuities. The chain of thought must begin with the same thing with which this history begins and its further course will be nothing else but the reflection of the historical course in abstract and theoretically consistent form, a corrected reflection but corrected according to laws furnished by the real course of history itself, in that each factor can be considered at its ripest point of development, in its classic form - 1859.

తార్కికమైన వూహతో చరిత్రను కల్పించమనటం, పూరించమనటం, అదే ప్రశస్తమనటం వైజ్ఞానికుల పరిశోధనా విధానం కాదు. ఈ వాక్యాలకు పరిశోధనా ప్రపంచంలో పరపతి వుండదు. శాస్త్రశిక్షణకు గురియైన మనస్సు దీనిని నిరాకరించక తప్పదు.

# కాపిటల్‌లోని వాస్తవ చిత్రణ

ఇలా బూర్జువా ఆర్థికచరిత్రను కూర్చేస్థితే లేదన్న ఎంగెల్సు మాటకు భిన్నంగా అయిదేళ్ళలో మార్క్సు తన కాపిటల్ గ్రంథంలో ఆ చరిత్రను దండిగా కూర్చాడు. కొండంత సమాచారాన్ని త్రవ్వితెచ్చి దానినిండా నింపేశాడు. శుద్ధతార్కిక పద్ధతికేగాక, వాస్తవానుశీలన పద్ధతికికూడా పెద్దఉదాహరణ అనిపించేట్లు కూర్చాడని చెప్పకొంటారు. బూర్జువా వ్యవస్థపతనం అవశ్యం అనివార్యం అని తర్కబలంతో ఎంతగా చెప్తాడో, అంతకెంతో ఎక్కువగా వాస్తవాంశాల సమీకరణ బలంతో చెప్పి నమ్మకము కలిగిస్తాడు. కాని అందుకు ప్రతికూలమైన ధోరణుల ఊహ, వాస్తవాల అన్వేషణ సేకరణ, పరిశీలన, ఆ వాస్తవాలపరిగణింపు, అనుకూల ప్రతికూల అంశాల తూకం, ఆపైన పర్యవసానం తేల్చే సరళి మాటేమిటన్న ప్రశ్నే పొడమనీయకుండా అనుకూల సమాచారం రాశి పోశాడు కాని ఏమరపెరుగని బుద్ధిశాలికెవరికైనా ఆ ప్రశ్నే కలిగితే అందులో ఆభాగం లోపించిందని తెలిసిపోతుంది. 1843లో పాతికేళ్ళ యువ విప్లవకారుడుగా మార్క్సుకు కలిగిన భావాల సమర్థనకు కావలసిన సాక్ష్యాధారాలను రెండు మూడు దశాబ్దాలు అదేపనిగా పోగుచేసి, వ్యతిరేక పార్శ్వాన్ని పట్టించుకోకుండా, వాదన పెంచి చేసిన రచన అది. అనగా నిర్ణయం ముందు వెనుక సాక్ష్యము సమకూర్చుకోవడంగా మార్క్సిజం రూపుగొన్నదనిపిస్తున్నది. మార్క్సు కాపిటల్ విప్లవంతరపువకీలు చరిత్రకోర్టులో దాఖలు చేసేందుకు కూర్చిన కేసుగాని శాస్త్రకార రచనకాదు. ఆ వ్యవస్థ సత్వరపతనకారణాల మాటేగాని, పతనాన్ని ఆలస్యము చేసే, నిరోధించే, తప్పించే స్వసంస్కరణపర్వం ఆరంభంకావడాన్ని మార్క్సు కానలేకపోయాడు అటువంటి సంస్కరణసాధ్యం కాగూడదాయని ప్రశ్నించుకోలేకపోయాడు. ఉత్పత్తిశక్తుల అంతులేని అభివృద్ధి శకం నెలకొనడం ఆకళించుకోలేదు పారిశ్రామిక తత్వాన్ని పెట్టుబడిదారీతత్వాన్నుంచి విడదీసి చూడలేకపోయాడు. 1866 లోనే ఇంగ్లీషు సమాజం క్షీణ ముఖమయిందని కాపిటల్ పీఠికలో ప్రకటించాడు. పది గంటల పని కాలము శాసనమైన పిదప మన విజయము మననే చంపేస్తున్నదని మథనపడటమే తప్ప అది రానున్న పరిణామపు ఆకారరేఖల్ని సూచిస్తుందేమోనన్న సందేహమే కలుగలేదు. పాశ్చాత్య ప్రపంచమంతటిలోనైనా యింకా అధికారంలోకి పూర్తిగారాకుండా, ఒకటి రెండుదేశాల్లో నూరేళ్ళుగామాత్రమే అధికారం హస్తగతం చేసుకొన్నదని తామే చెప్తున్న ఆ పెట్టుబడిదారీ వ్యవస్థ తప్పక అంతరిస్తుందని నిరూపించినతర్వాత ఆ దేశాల్లోను, యూరపులో అధికభాగం లోనూ నూటపాతికేళ్ళుగా నిలిచి, ఉత్పత్తిశక్తుల అఖండమైన అభివృద్ధికి ఆలవాలమై ఆ అభివృద్ధి ఆ బూర్జువా ఉత్పత్తి సంబంధాలవల్ల ఆగిపోవలసివస్తుందన్న పరిస్థితి ఎక్కడా కనుచూపుమేరలో కనబడకుండా వుందంటే చారిత్రక భౌతికవాద యాథార్థ్యత భగ్నమైనట్లు కాదంటారా?

మార్క్సిస్టు పరిభాషలో ఉపరితల నిర్మాణంగా చెప్పబడుతున్న మతం, నీతి, న్యాయం, రాజకీయం, తత్వం, సాహిత్యం, కళలు మొదలైన సామాజిక, భావ జీవితాంశాల్లో ఆర్థికపునాదిలో కలిగే పరివర్తనాన్నిబట్టి కాస్త వెనుక ముందులుగా కలిగే మార్పులను అంచనావేసి చెప్పడమంటే వీలుకాదుగాని చరిత్ర వివిధ దశలలో ఉత్పత్తి సంబంధమైన ఆర్థిక పరిస్థితుల భౌతిక పరివర్తనాన్ని అంచనావెయ్యమంటే ప్రకృతి విజ్ఞానశాస్త్రాల్లో సాధ్యమౌతున్నంత కచ్చితముగా బటాబటిగా నిర్ధారణ చేయవచ్చునని వక్కాణించి మరీ తన చా. భౌ. వాద నిర్వచనం చేశాడు మార్క్స్. కాని అది సాధ్యంకాని మాట. సమకాలిక బూర్జువావ్యవస్థలోనౌతున్న ఆర్థిక పరివర్తనమే ఆయన అంచనాలకు అందలేదు ఆయన అంచనాలు శాస్త్రనగరి సరిహద్దులే త్రొక్కలేకపోయినై. శాస్త్రంలో సాధ్యమైనంతకచ్చితంగా చెప్పడం ఆయనకేకాదు మరెవ్వరికీ సాధ్యంకాలేదు. Statistics వచ్చినతరువాత ఇప్పటికికూడా విజ్ఞాన శాస్త్రస్థాయి ఆర్థికాంశాలనిర్ణయం కేర్పడలేదు. గతచరిత్ర దశలనుగూర్చిఅయితే అసలామాట అనదగినంత సమాచార సామగ్రిలేదు. గతచరిత్ర విషయంలో ఉపరి తల నిర్మాణమనేపేర పిలుస్తున్న మతం సాహిత్యం రాజకీయం న్యాయం నీతివంటి భావవ్యాపారం వ్రాతకూ పాటకూ కథాకథనాలకూ నమోదైనట్లుగా ఆర్థికచిత్రంగాని అర్థికవిచారంగాని మానవుని చరిత్రలో నమోదుకాలేదు. ఎంతో సమాచారంవున్న సామాజికభావ జీవితాంశాల విషయంలో మార్క్స్ కచ్చితమైన నిర్ధారణ సాధ్యం కాదన్నాడు అత్యల్పమైన సమాచారం మాత్రమే వుండి, అదీ మార్క్స్‌నాటికి ఏమంతగా సేకరించబడనట్టి సమాచారక్షామములో ఆ ఆర్థికాంశాల పరివర్తనా స్వరూప పరిణామాలను విజ్ఞానశాస్త్రపు టంచనాలంత కచ్చితంతో నిర్ధారణ గావించ వచ్చన్నాడు. ఆస్కారంలేని మాటఅన్నాడు–అదే విచిత్రంగా వుంది. సమాచారమే కరవైన రంగంలో విజ్ఞానశాస్త్రపుటంచనాలు సాధిస్తానంటున్నాడు. ఇదెక్కడిమాట! శాస్త్రశిక్షణగల వాక్కేనా ఇది? అసలా ఆర్థికాంశపువెలితే చరిత్రలో మార్క్సిస్టుల తార్కిక కాల్పనికతకు అనువైనదై కూర్చున్నది. భిన్నకథనాలతో తమ చారిత్రక సిద్ధాంతాన్ని వారిద్దరూ నెలకొల్పజూచారు. పెట్టుబడిదారీ ఆదిమదశనుగూర్చే భిన్న కథనాలు చేశారు. అందులో ఒకటి గతితార్కికచట్రంలో యిమిడేటట్లు బాగా అను వైనది. కాని అదే మార్క్సిస్టుల వాడుకపాఠాల కెక్కలేదు. ఆ కథ మరొకచోట చెప్పుకోవచ్చు.

"In considering such transformations a distinction should always be made between the material transformation of the economic conditions of production, which can be determined with the precision of natural science, and the legal, political, religious, aesthetic or philosophic-in short, ideological forms."

ముందు మూడువ్యవస్థలుగడచి, కొద్దికాలంగా ఏర్పడిన బూర్జువా వ్యవస్థ కూడా శాశ్వతమైనదికాదని ఎప్పటికైనా తప్పక యిదీ అంతరించవలసినట్టిదేయని చెప్పడానికే అయితే మార్క్సెంగెల్సులు చేసినంత బహుముఖ పరిశ్రమా అక్కర లేదు-అందులో సైన్సుఅనేమాటా అక్కరలేదు. లోకజ్ఞానం చాలు-లేదా వేదాంతం చాలు. కాని సైన్సుమాటగా చెప్పదలిస్తేమాత్రం కాలనిర్దేశం కావాల్సిందే. అదేద్దో లేకుండా సైన్సుగా చెప్పామనటం సరికాదు. కాగా పడిపోతుందన్నతర్వాత ఇదేళ్ళో యీ వ్యవస్థ ఇంత దీర్ఘకాలం బ్రతికివుండంటే మార్క్సిజం సైన్సుకాకపోయినట్లే ఇంకా దాన్ని సైన్సుగా విశ్వసించదమంటే జ్యోతిషాన్ని విశ్వసించినట్టు విశ్వసించడమేగాని అన్యంకాదు. సోషలిజాన్ని మానవత్వపు ఆకాంక్షగా, అవసరంగా నీతిమూలకమైన వ్యవస్థగా సాధించమనటంవేరు-మార్క్సు అలా కాకుండా సైన్సులో లాగా అంచనా సాధ్యమని, తాను అదే చేశానని అన్నాడు. అమాటే రుజువుతప్పినమాటయిందనవలసివస్తున్నది.

## తార్కిక పద్ధతి - చరిత్ర తారుమారు

వారి కాల్పనిక పద్ధతిని ప్రయోగించినతీరు అర్థంకావడానికి, ఒక ఉదాహరణ తీసుకొందాం గతితర్క ఆవిర్భావ పరిణామాల చారిత్రక నేపథ్య చిత్రణవంటి ముఖ్యమైన సంగతినే చూస్తాం. 19వ శతాబ్ది రెండు మూడుపాదాల్లో విజ్ఞాన (శాస్త్ర) విప్లవమేదో కలిగిందని, ఆ నవ్యవిజ్ఞానమే తమ గతితర్కానికి జన్మభూమియని, ఆ కొత్తవిజ్ఞానపు వెలుతురుసోకని జర్మన్ పల్లెటూరివాసంకారణంగా ఫూవర్బాక్ గతి తార్కికుడు కాలేకపోయాడని, నూత్న విజ్ఞానానికి నిలయాలైన దేశదేశాల పట్న వాసంలో విజ్ఞానశాస్త్రపరిచయం లభించినట్టు, ఆ ప్రభావానికి వారు అడినుంచీ గురైనట్టూ, అది పునాదిగా తమ గతితర్కమో గతితార్కిక భౌతికవాదమో రూపు గొన్నట్టుగా 1886లో వృద్ధ ఎంగెల్సు చెప్పుకొన్నాడు. తమ గతితర్కాన్ని సైన్సు శిశువుగా చిత్రించుకోవడం వాస్తవచిత్రణకాదు-యథార్థ చరిత్రకాదు. తార్కిక కాల్పనికతకే ఒక ఉదాహరణగా తీసుకోవాల్సివుంటుంది.

ఎంగెల్సు ప్రకృతిశాస్త్రాల్లోను, మార్క్సు గణితంలోనూ ప్రత్యేకంగా కృషి చేయాలని 1858-59లో సంకల్పించారు. ఆ కాలానికి మార్క్సిజం పూరిగా ఆకారం దిద్దుకొన్నది. ప్రౌఢిమ సంతరించుకొన్నది. అప్పటి క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ రచనతర్వాత మార్క్సు కొత్తగా కనిపెట్టిన ముఖ్యసిద్ధాంతం లేదు. కాని ఆ రచనకు ముందటికాలంలో వారి సైన్సు చదువునుగూర్చి చెప్పుకోవలసిందీలేదు. ఉత్పత్తి పరికరాలుగా యంత్రాల చరిత్రకన్నా మార్క్సు సైన్సులో వెదికిందిలేదు. ఎంగెల్సు దృష్టిలో యుగప్రాధాన్యంగలవన్న వైజ్ఞానిక సిద్ధాంతాలు మూడింటిలో ఏ వొక్కటీ మార్క్సెంగెల్సులకు 1858కి ముందు తెలియదు. 1388లో జీవశాస్త్రజ్ఞులు

సకలమైన ప్రాణికోటికి సమాన ప్రాతిపదికగా ఒకే జీవకణం (cell) వున్నదని కనుగొనటం—1842, 1845 లలో యాంత్రిక చలనశక్తి, ఉష్ణశక్తి, విద్యుత్తు, అయస్కాంతశక్తి మొదలైన పదార్థశక్తులు నిత్యములు, స్థిరరాశులు మాత్రమే కాక, పరస్పరం పరివర్తనీయాలని (Conservation and Transformation of Energy) తేల్చడం, 1859లో డార్విన్ జీవపరిణామవాదాన్ని వెలువరించడం, అన్నవి ముఖ్యవిశేషాలన్నాడు 1859లో జీవపరిణామవాదాన్ని ఆ ముందచేడు మొదటి రెండింటినీ ఎంగెల్సు తెలుసుకొన్నాడు. ప్రకృతిలో గతితర్కానికి చేర్చిన రష్యన్‌పీఠిక దీన్ని గుర్తించివుంది. 1838, 1842లలో జర్మన్లే మొదటిరెంటినీ, కనుగొన్నప్పుడు ఆ విషయం వీరెరిగినవారుకారు. 20, 16 ఏళ్ళతర్వాతనే ఇంగ్లాండు వాసంలోనే వీటినిగూర్చి విన్నారు, వీరివారు

ఇందులో తొలివిశేషం వెలువడిన 1838కి ముందు వీరు విద్యార్థులుగానే హెగెలిస్టులు గతితార్కికులు అంటే వీరి గతితర్కానికి ఆ మూడింటా సైన్స్ విప్లవం యింకా ప్రారంభమే కాగలేదు. [illegible] హెగెలియన్ [illegible] భౌతిక వాద గతితర్కానికి మార్చి గ్రహించటానికి యీ విజ్ఞాన విప్లవ [illegible] ఉదామా అంటే, వీరు ఆ మార్పు తీసుకొని 1845–46 నాటికిగాని ఆ రెండు ముఖ్య సిద్ధాంతాలను ఆలించినవారేకారు. 1838లో ఆ రెండింటినిగూర్చి ఎంగెల్సు చదివాడు గాని, మార్క్సు చదవలేదు. క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీతోపాటే డార్విన్ సిద్ధాంతం ప్రచురితమయింది. ఇవి నిజాలు ఇలావున్నాయి.

1838 లగాయతు సైన్సులో కొత్తవిశేషాలు కుప్పతెప్పలుగా వెలువడటమే గాని, అవి ఒకదానితో ఒకటి సంబంధం కలిగివున్నట్టి స్థితి ఏర్పడక, వేర్వేరు విషయాలుగా చిక్కురొక్కురై అవ్యవస్థితంగా పడివున్నాయని, ఫూయర్బాక్ బ్రతికి వుండగా—అనగా 1872దాకా—ఆ విజ్ఞాన విప్లవంలో ఒక వ్యవస్థ, ఆ విజ్ఞాన పరిణామానికి ఒకదిశ లీలగానైనా ఏర్పడలేదని, ఆ పరిణామరేఖ ఆ అభివృద్ధిధోరణి శాస్త్రవేత్తలకే అంతుబట్టకుండా వుండిపోయిందని వ్రాసి, ఆ శాస్త్రవిప్లవంలో ప్రధానాంశాలివియని, ఆ పరిణామదిశ ఇదియని 1873 తర్వాత వారిద్దరూ (నోట్సులలో) అంతుచిక్కించుకొన్నట్టు ధ్వనిస్తూ 1886లో ఎంగెల్సే చెప్పుకొన్నాడు. మరో ప్రక్కన గతశతాబ్ది రెండుమూడుపాదాల్లో సైన్సులో అవ్యవస్థ అలుముకొందనే వీరి చిత్రణకూడా నిజంకాదు విజ్ఞానశాస్త్ర చరిత్ర దానినంగీకరించదు. ఎంగెల్సుకు ప్రధానాంశాలని తోచినవే శాస్త్రజ్ఞులకు ప్రధానాంశాలుగా పరిమితమూకాలేదు.

ఇంకా యితర ఫలితాలెన్నో వున్నాయి. న్యూటోనియన్ ప్రపంచానికి ప్రశ్నలైన ప్రతిపాదనలు వీరన్న మూడో ముఖ్యాంశంతర్వాతే వెలువడ్డాయి. అవేవో వీరు పసికట్టలేదు. గతితర్కాన్ని బడిలో పాఠంగా నేర్చుకొని, ఆలోచనాగతమైన గతితర్కం ప్రకృతిలోకూడా వుండవడానికిగాను సైన్సు సిద్ధాంతాలకు గతితార్కికభాష్యం చెప్పడానికి యత్నించినవారు, అందుకు భిన్నంగా తమ గతితర్కావిర్భావ పరిణతులకు నాటి నవ్యవిజ్ఞానమే నేపథ్యభూమికయని, నిమిత్తకారణమని తిరగేసి చిత్రించుకొన్నారు. అదెంతవరకు నిజమో వివేచించకుండ, ఎంగెల్సు కథనాన్ని మార్క్సిస్టు తత్వవాచకాలద్వారా రోకటిపాటగా బోధప్రచారాలు అఖండంగా జరిగిస్తున్నారు Marxist Philosophy-A Popular Outline అనే రష్యన్ ప్రచారవాచకం Pre-requisites in Natural Science అని ఒక శీర్షికపెట్టి యీ వైజ్ఞానికాంశాలే వెలువడకపోతే ఆ తత్వశాస్త్రం పుట్టజాలదన్నట్టుగా, అవి కనీసావసర విషయాలన్నట్టుగా బోధిస్తున్నారు. అసలీ వైజ్ఞానికాంశాలు వెలువడకముందే యీ గతితర్కమేగాదు, గతితార్కిక భౌతికవాదంకూడా ఏర్పడేవుంది. గతితర్కం, భౌతికవాదం ఎప్పటినుంచో వేర్వేరుగా వుంటుండగా వాని మిశ్రమమేదో ఏర్పడటానికిఇంత నవ్యవిజ్ఞాన ప్రాతిపదిక తప్పక కావాలన్నట్టా? కావాలా?

ఆ మిశ్రతత్వంకూడా మార్క్సిజం ఏర్పడకముందే పుట్టింది. ఆ పేరు పెట్టకుండా ఆ రెంటినీ మిళాయించినవారున్నారు. ఉటోపియా ప్రాధాన్యో గతితర్కం భౌతికవాదం కలిసేవున్నాయి మోజెస్ హెస్‌లోనూ అవి రెండూ వున్నై. ఫూవర్బాక్ భౌతికవాది మాత్రమేకాదు. గతితార్కికుడు కూడానని మార్క్సు మొదట వ్రాశాడు. Fuerbach is the only one who has a serious critical attitude to the Hegelian dialectic and who has made genuine discoveries in the field He is in fact the true conquerer of the old philosophy అని వ్రాసినవాడే. ఫూవర్బాక్ తనతత్వాన్ని గతితార్కిక భౌతికవాదమని నామకరణం చేసుకోకపోయినా, అతని భావితత్వశాస్త్రాన్ని (Philosophy of Future) నాటి జర్మనీ ఆ పేరుపెట్టే పిలిచింది. మార్క్సెంగెల్సులు తమ తత్వానికీ ఆ పేరు పెట్టుకోలేదు. ఫూవర్బాక్‌తో తమ విభేదాన్ని తెలుపుతూ తయారుచేసుకొన్న పదకొండు ప్రతిపాదనల్లో తమది New Materialism అని పేరిచ్చుకొన్నారు. ఆ తర్వాత ఎంగెల్సుకూడా అక్షరాలా గతితార్కిక భౌతికవాదమని వ్రాయలేకపోయాడు. ఆ పేర్లు అప్పటి జర్మనీలో ఫూవర్బాకిజానికి కాపీరైట్ గాహోలు.

## తత్వమేదైనా గతితర్కానికి ఢోకాలేదు

అంతకుముందుండేడే భావభౌతిక వాదాలలో తనది ఏదో ఒకానొకటి కాగూడదని, ఆ రెండింటినీ సమన్వితం చేసుకొనే ప్రాకృతికతత్వంగా (Naturalism)

ఆర్థిక తాత్విక వ్రాతప్రతుల్లో మార్క్స్ చెప్పుకొన్నాడు. చిత్రమేమంటే మార్క్స్ అప్పుడుకూడా గతితార్కికుడే. మార్క్స్ సర్వకాలసర్వావస్థలలోనూ గతితార్కికుడే. భావవాదిగా, భౌతికవాదిగా, ఉభయాన్వితమైన ప్రాకృతికవాదిగానూ గతితార్కికుడే. తత్వం ఏదిగానీండి, గతితర్కానికి ఢోకాలేకపోయింది. సరే, మనకు చూపిన ఉభమధ్యమ తత్వానికి దాఖలావాక్యం యివ్వాలిగదా!

Consistent materialism or humanism is distinct from both idealism and materialism and at the same time constitutes the unifying truth of both. Naturalism is capable of comprehending the action of world history.

మార్క్సెంగెల్సులు స్వీకరించిన గతితర్కం హెగెల్ కర్తగా 18వ శతాబ్దాంతంలో తయారుకాగా, దానిపుట్టుకకో, దాన్ని వీరు స్వీకరించడానికో 19వ శతాబ్ది నవ్యవిజ్ఞాన నేపథ్య అన్వేషణా కల్పనలు శుద్ధ అనవసరం. హెగెల్ గతితర్క సృష్టికి న్యూటోనియన్-లిన్నియన్ యాంత్రిక విజ్ఞానమే నేపథ్యంగా వున్నది. అతని గతితర్కావిర్భావం తర్వాతనే న్యూటోనియన్ విజ్ఞానాన్ని సమగ్రం కావించిన ఫ్రెంచి విజ్ఞాని లాప్లేస్ ప్రయత్నం వున్నది యాంత్రిక విజ్ఞానానికి గతితార్కిక భాష్యం వెలయించిన ప్రజ్ఞాశాలి హెగెల్. ఆ భాష్యం పొరవడిగా 19వ శతాబ్దిమధ్యగత విజ్ఞాన విశేషాలకు గతితార్కిక భాష్య ప్రవచనా ప్రయత్నమే ఎంగెల్సీయమైన "ప్రకృతిలో గతితర్కం" అనే రచన నిజానికి న్యూటోనియన్ యాంత్రిక విజ్ఞాన రేఖను దాటుతున్న విజ్ఞానశాస్త్రంలోనే ఏదో కొంగ్రొత్త విజ్ఞానం పొడమితేతప్ప యీ గతితర్కం, యీ గతితార్కిక భౌతికవాదం తయారుకావడం సాధ్యంకాదన్నట్టు చిత్రించడం చా.భౌ. వాద సిద్ధాంతంప్రకారం ఏర్పడిన కృతజ్ఞాపనకం మాత్రమే. తమ చరిత్ర సిద్ధాంత గతితర్కంవల్ల చరిత్రయొక్క యథార్థస్వరూపాన్ని తారుమారు చేసి ఎంగెల్సుచెప్పిన కథనం వారి తార్కిక కల్పనాపద్ధతికి చిన్న మచ్చుతునక. ఇది చరిత్రపట్ల అపచారం. చరిత్ర పరిశోధనను మాని గతితర్కంవంటిన చరిత్ర కల్పనం ఫలమవుతున్నది. (మార్క్స్) ఎంగెల్సులు వివిధ రచనల్లో చిత్రించిన చరిత్ర దశలలో, ఆస్తి, ప్రభుత్వం, కుటుంబ వ్యవస్థ వాని పుట్టుక వివరాలలో యీ తార్కిక కాల్పనికత నిండివుంది అది మళ్ళీ పై నా విశ్లేషణలోనే [illegible].

తర్కంవలె గతితర్కంకూడా ప్రధానంగా మానవుని ఆలోచనాక్షేత్రంలోనే గాని, ప్రకృతిలో గోచరించేది కాదు. హెగెల్, మార్క్స్, ఎంగెల్సులు ముందు గతితార్కికులు-తర్వాతే విజ్ఞానశాస్త్ర సమాచారసేకరణ భాష్యకారులు. తర్కతత్వశాస్త్రాలలో దానిని సిద్ధాంతంగా మానవుని భావజీవిత (ideological) రంగాలన్నింటిను తొలుత వర్తింపజేసి చూపిన పిదప ప్రకృతి విజ్ఞానశాస్త్ర సిద్ధాంతాలను అన్వయింపయత్నించినవారు అంతేగాని, గతితర్కం ప్రధానంగా మాత్రం ప్రకృతి పరిశోధనకాదు. అసలది జడప్రకృతిలో వర్తిస్తుందనేమాట పెద్దవివాదంగా

వ్రంటున్న దిగదా! మార్క్సెంగెల్సులచేత యాంత్రిక భౌతికవాదులనిపించుకొన్న జర్మనులే నిజానికి సైన్సు విద్యార్థులు-సైంటిస్టులు, అట్టివా రసలు గతితార్కికులు కాకపోయారు. జర్మన్ సైంటిస్టు లెవ్వరూ కాలేదు.

ఐతే హెగెల్‌తర్కాన్ని గతితర్కం గావించి, దాన్ని సైన్సు అన్నాడు హెగెల్ పుస్తకంపేరే Science of Logic. లెనిన్ హెగెల్ పుస్తకం చదివి Every science is applied logic అని, thought, science = the logical Idea అని లెనిన్ నోట్సు రాసుకొన్నాడు. రష్యన్ వైజ్ఞానిక ప్రచారక రచనలలో యిప్పటికీ యీ దృక్పథమే, ఇటువంటి వాక్యాలే కానవస్తున్నాయి.

## తార్కిక నియతి ప్రకృతి నియతి కాదు

క్రమబద్ధత, నియతి (order, determinism) అన్నదొకటి సైన్సుకు తర్కానికి సమలక్షణమనిపించుతుంది. ప్రకృతి ప్రవర్తనను విజ్ఞానశాస్త్రిలు సూత్రబద్ధంగావించి కట్టిన అంచనాల ప్రకారమే దాని పరిణామ ప్రవర్తనలుండటంచేత, ఆ అంచనాలు అఖండంగా నిజంకావడంచేత సైన్సు ప్రకృతిలో యాంత్రిక విజ్ఞాన స్థాయిలో కనుగొన్న క్రమబద్ధత, నియతి-తార్కికావశ్యకత అనివార్యతలకు తీసిపోనిదనిపించింది. రెండూ సమానం, ఏకసూత్రాలనిపించాయి. విజయపరంపరను చూరగొంటున్న సైన్సు ప్రతిష్ఠ అప్రతిమానంగా పెరిగిపోయి, తర్కాన్ని సైన్సనడం తర్కానికి న్యూనతకన్నా ఉన్నతిగా భావించవీలయింది. దానికితోడు హెగెల్ ప్రకారం ప్రకృతి పదార్థంకూడా అఖండ భావసంబంధమైనట్టివి-అంటే మానసికాంశగలవి కావడంచేత ప్రకృతిప్రవర్తనకూడా తార్కికమే, గతితార్కికమేయని భావించే ఆస్కారం కలిగింది. ఆలోచనను భావాన్ని పదార్థంయొక్క విశిష్టవ్యాపారంగా ప్రతిపాదించి, అనగా హెగెలిజాన్ని తలక్రిందుచేస్తే కలిగిన తత్వవ్యవస్థ అయిన మార్క్సీయ భౌతికవాదంలోకూడా-అనగా భావంనుంచి పదార్థం, పదార్థంనుంచి భావము అని ఏలాగున అన్నప్పటికీ- ప్రకృతిరీతి గతితార్కికమనడానికి ఆక్షేపణ వుండదనుకోడంచేత ప్రకృతిలోని నియతి నిర్ధారణాత్మకత (determinacy)-తర్కంలోని ఆవశ్యకత అనివార్యత (logical necessity) అన్నవి రెండూ తుల్యవిషయాలని తలంచారు జడప్రకృతి నడవడి, చేతనాయుతమైన మానవసంఘం నడవడి సమానమేనన్నారు. (Past) history proceeds in the manner of a natural process and is also subject to the same laws of motion. ప్రకృతిలోని గతిపరిణతినే మానవసంఘంలో చరిత్రఅంటామన్నారు. ప్రకృతిలోగాని, మానవసంఘంలోగాని ఒకానొక ఘటన పరిణామం తార్కికంగా ఆవశ్యకమని తేల్చితే అది పాదార్థిక వాస్తవం (material reality) అయితీరుతుందన్న భావం వారిలో ఉంది

అందుచేత పెట్టుబడిదారీ వ్యవస్థపోవడం, సోషలిజంరావడం విషయంలో తార్కికానివార్యతను స్థాపించగలిగితేనే సోషలిజం మానవుని ఆకాంక్ష ఆకాశహర్మ్యము కాకుండా శాస్త్రీయము (Scientific) అవుతుందన్న భావంమార్క్స్ (ఎంగెల్సుల)కు ఏర్పడింది. హెగెలిజంలోను, తల్లా హెగెలిజమైన మార్క్సిజంలోను సైన్సుకు తర్కానికి సమీకరణం ఏర్పడగా యీ భావనకు అవకాశం కలిగింది అందుకే మార్క్స్ కమ్యూనిజాన్ని అభావాభావకరణ గతితర్క సూత్రబద్ధం గావించడం కుదరకపోయినంతవరకూ దాన్ని ప్రణాళికగా జూస్తూ, అది సూత్రానువర్తన కుదిరిన వెంటనే కమ్యూనిస్టు కాగలిగాడు

## శాస్త్రీయ సోషలిజమంటే...

ప్రస్తుత పెట్టుబడిదారీ వ్యవస్థ చెడ్డదని చూపడం కాదు కావలసింది, ఆ చెడ్డ వ్యవస్థ పతనం కానున్నదని, కాకతప్పదని తేలాలి, తేల్చాలి. సోషలిజం చాలాకోరుకోదగ్గది. ప్రయత్నసాధ్యమైనట్టిది అని చూపించడమే కాదు. సోషలిజాన్ని ఈ సమాజము కోరకతప్పదు దానికై యత్నించకా తప్పదు, ఆ యత్నం నెరవేరకా తప్పదు అన్నంతవరకు నిరూపిస్తేనే సోషలిజం శాస్త్రీయ మనిపించుకొంటుంది. అవుతుంది. విజ్ఞాన శాస్త్రసూత్రప్రతిపత్తినందుకొంటుంది తిరుగులేని సత్యమవుతుంది. అంతకే మాత్రం తక్కువైనా అది స్వప్నసౌధమే శ్వేతద్వీపమే యని వారి భావం. సమాజం సోషలిజాన్ని వద్దనుకొనే వీలులేదు— ఇక్కడ ఇచ్ఛాస్వాతంత్ర్యంలేదు. ఇలాగెవ్వరూ చెప్పలేదని, అది సాధ్యమనే చెప్పివున్నారన్నారు. యంత్రాలరాకతో సైన్సుసేవలతోనే సోషలిస్టు వ్యవస్థను నిజం కావించుకోవచ్చునన్నారట. అంతే. అందుకని వారి సోషలిజ సైన్సు సూత్రప్రతిపత్తినందుకోలేకపోయిందని వ్రాశారు. చారిత్రకంగా సోషలిజం అనివార్యమైన దశయని చెప్పబట్టి మార్క్సీయ సోషలిజానికే సైన్సుప్రతిపత్తి వుందని చెప్పుకొన్నారు.

కాని వారు చరిత్రలో ఏ ఒక్క వ్యవస్థనూ అంత అనివార్య స్థితిలో ఏర్పడినట్లు నిరూపించలేదు. ఊహించారు, అంతే. నిజానికి ఉత్పత్తి సాధనాలకు సంబంధాలకు వీరు చెప్పుకొన్న సమీకరణం విధించే అనివార్యతలో మానవచరిత్ర నడవలేదు ఒకే ఉత్పత్తి సాధనాలతో భిన్న వ్యవస్థలు ఏర్పడి వున్నాయి, వుంటున్నాయి. కాగా, ఇటువంటి అనివార్యతా భావమే అక్కరలేదు.

ప్రకృతిలో సైన్సుకనుగొన్ననియతి, తార్కికనియతి ఒకేరాశికి చెందినవికావు. తార్కికనియతికి గణితనియతికి తిరుగులేదు, యించుమించన్న మాటలేదు. సహించదగ్గ యించుమించులన్న మాటేలేదు. ప్రకృతిలో నిర్ధారణకు ఎంతోకొంత ఎలువు సలువులున్నవి. ఇంచుమించుల పరిమితులను తగ్గించడం మీదే సైన్సుకన్ను ఉండేది.

తగ్గించగలిగేది అదెంతగా తగ్గించగలుగుతున్నప్పటికీ ప్రకృతిలోని నిర్ధారకత తార్కిక నిర్ధారణకాదని, దానికి సరిపోలదని సైన్సు నేడు స్పష్టపరుస్తున్నట్టుగా ఆనాడు స్పష్టపరచటంలేదు. నాటి యాంత్రిక విజ్ఞాన ప్రతిష్ఠ దాని నిర్ధారణాశీలమే. ప్రముఖాంశముగా వుండేది. కాని అప్పటిలోనే దానికి సర్దుబాటుగల మరోరకమైన నిర్ధారకతను సైన్సు చెప్పుకొని వున్నది. వాయుపీడన, థర్మోడైనమిక్సు, జెనిటిక్సు వంటి రంగాలలో ఆ నిర్ధారకతను చెప్పుకొన్నది అది సమూహంమీద కానవచ్చే సగటు వర్తనకు సంబంధించినది. గణాంక విభాగంలోని సగటు సూత్రాలు – Statisticallawsలో లభించే నిర్ధారకత. దీనిని సంభావ్యత – Probability అంటారు సమూహం మీద సగటు వర్తనను మాత్రమే చెప్పుతున్నప్పటికీ వ్యష్టిఘటన నిర్దేశ్యము అనేభావానికి భంగం కలిగించకుండా సగటు స్థాయిలోగల సౌలభ్యాన్ని ఉపయోగాన్ని వాడకచేసుకొంటున్న గణితరీతి ఇది. కానీఈ శతాబ్ది రెండోపాదంలో సైన్సు ఈ సంభావ్యతలో మరోరకం సంభావ్యతవున్నదని చెప్పనారంభించింది. ప్రకృతిమూలం దగ్గర, పరమాణుగర్భంలోని ప్రాథమిక కణాల వ్యష్టివర్తనలో నిర్ధారణలేకుండా పోయి, సమూహవర్తనలో సంభావ్యతమాత్రం మిగులుతున్న స్థితిని చెప్పుతున్నది ఈ రకం సంభావ్యతకార్యకారణ భావాన్ని యిరకటంలో పడేస్తున్నట్టుగా వుంది. అతిసూక్ష్మమైన దశలో ఇటువంటి సంభావ్యతతో ప్రారంభమై స్థూలప్రపంచంలో అమోఘమైన నిర్ధారకతను ప్రదర్శిస్తున్న ప్రకృతి నియతికి, ఏకమాత్రమైన తార్కిక నియతికి రాశిలోనే భేదం వుందిగదా!

అంతేగాకుండా తార్కికంగా శుద్ధమైనంత మాత్రంచేత ఏదైనా వాస్తవంకాజాలదు. యుక్లీడియన్ జామెట్రీ అంతరిక తర్కపూర్ణమైనటిది. తర్క పరిపూర్ణతకు అది ఉదాహరణగా వుండేది. ఆ జామెట్రీ తెలియనివానికి ప్లేటో అకాడెమీలో ప్రవేశములేదని సింహద్వారంలో శిలాశాసనం వేశారు. గత శతాబ్దారంభం వరకూ అదొక్కటే జామెట్రీ. నిత్యజీవితంలో భూమిమీద యిప్పటికీ ఇదే జామెట్రీతో కొలతలు తేల్చుతున్నాం తర్వాతమరికొన్ని జామెట్రీలు వచ్చినై. అవన్నీతర్క శుద్ధాలే. త్రిభుజములో మూడుకోణాల మొత్తం నూరెనభై డిగ్రీలని చెప్పే యుక్లీడియన్ క్షేత్రగణితానికి మారుగా నూరెనభైకి ఎక్కువనే గణితం ఒక్కటి, ఎప్పటికీ తక్కువనే గణితము మరొకటీకూడా వచ్చినై. వచ్చిన తర్వాత ఈ విశాల విశ్వంలో దూరాలు,వేగాలు ఏ గణితానికి బద్ధమై వున్నవో తేల్చి చెప్పడం ఆయా గణితాల తర్కశుద్ధినిబట్టి ఏ మాత్రం వీలుకాలేదు. యూక్లిడుజామెట్రీయే యథార్థంగా విశ్వరూపాన్ని తెలుపుతున్నదనుకొన్నాం. కాని అదికాదని విశ్వాంతరాళ పరిశీలన పరిశోధన తేల్చివేసింది. త్రిభుజకోణాల మొత్తం నూటనలభై డిగ్రీలకు ఎక్కువగా వుండే రీమానియన్ క్షేత్రగణితం ప్రకారం కట్టిన లెక్కలతో విశ్వాంతరాళపు కొలతలు సరిపడుతున్నాయి.

దానితో మన విశ్వం అండరూపంలో పూర్వులిచ్చిన బ్రహ్మాండమన్న పేరుకు తగి నట్టుగావుందని రుజువైందనుకొంటున్నాము తక్కిన జామెట్రీల ప్రకారం విశ్వాంతరాళాల దూరాలకొలతలుండటం లేదు. అంతరిక తర్కశుద్ధి సౌష్ఠవం ఎంతగా వున్నప్పటికీ మన విశాలవిశ్వాకృతికి చెందినవి కావన్నమాట. ఈ భిన్నమైన క్షేత్రగణితాల్లో వున్నదొక్కటే తర్కం. క్షేత్రం కుంభాకారమో సమతలమో మరొకటో తర్కం చెప్పజాలదు, ఆ క్షేత్రం ఎటువంటిదో చెప్పేదిమాత్రం పరిశీలన. ఏ జామెట్రీ లెక్కలు విశ్వంలో దూరాలకొలతలను యిస్తున్నట్టు పరిశీలన తేల్చుతున్నదో విశ్వం యొక్క జామెట్రీ అలా వున్నదనుకోవాలి. అంతేగాని ప్రకృతిని కేవలం మూర్తిమంతమైన తర్కం అనే హెగీలియన్ తత్వావాదసత్వంలో తర్కకాల్పనికతతో ప్రకృతిని చరిత్రను సమాజాన్ని నిర్మించగలమనుకోవడం సరికాదు, సైన్సుకాదు. పెట్టుబడిదారీ వ్యవస్థాపతనం, సోషలిజం అవతరణ గతితర్కసమ్మితంగా దర్శించగలిగినంత మాత్రాన అది వాస్తవమై తీరాలనిలేదు. తార్కికానివార్యత వాస్తవికానివార్యతకాదు. పెట్టుబడిదారీ వ్యవస్థ పనిచేసే రీతికొక తార్కిక నమూనాను తయారుచేసి, తార్కికంగా దాని వినాశం ఎంత అనివార్యమో మార్క్సు తన కాపిటల్ గ్రంధములో చూపించాడు గాని పెట్టుబడిదారీ వ్యవస్థ అలా వినాశం చెందలేదు.

## కాపిటల్లో తార్కిక నమూనా

పెట్టుబడిదారీ విధానాన్ని నిర్వచించుకొని, అందులో భాగస్వాములైన పెట్టుబడిదార్లను కార్మికులను నిత్యజీవితంలో సాధారణంగా వారిలోకానవచ్చే దౌర్బల్యాలు దురాచారాలు,దురలవాట్లు ఏవీలేనట్టి వారినిగా తీసుకొని, ఆ వ్యవస్థను వ్యవస్థగా నడపడానికి అవశ్యకమైన తకంటే ఎక్కువ తక్కువలులేకుండా వ్యవహరించేట్టుగా కేవలం ఆర్థిక నియతికి లోనైన పాత్రలను గావించి నియమబద్ధము పరిశుద్ధము ఆదర్శప్రాయము అయిన వ్యవస్థను, దాని పరిణామాన్ని ఊహించాడు. అందులో పెట్టుబడిదారులు పరస్పరం మోసగించుకోవటం వుండదు. నిరాఘాటమైన పోటీలో పాల్గొని లాభాలార్జించాలేగాని గుత్త హక్కులు సౌకర్యాలు ఆధిపత్యము పొంది, మరేదురాచారానికి పాల్పడి లాభాలు సంపాదించడం వుండదు. కార్మికులనైనా మోసగించో బలప్రయోగంచేసో వేతనాలు నిర్ణయించడు కూలి విపణి పరిస్థితులనుబట్టి కూలి నిర్ణయమువుంటుంది అంతే కాక ఆర్థికఆవశ్యనియమాలను యథాతప్పకుండటాన్ని స్థాపించి, శ్రమశక్తి విలువయైన జీవనభృతి (subsistence wage) యిచ్చి, సరుకులను తమ తమ విలువలకే కొనుగోలు అమ్మకాలు సాగించినప్పటికీ లాభాలు గడించగల అవకాశంవుండే ఆదర్శస్థితిని కల్పించి ఆ పాత్రలతో, ఆ నియమాలతో, ఆ వ్యవస్థను నిర్వహించనిస్తాడు.

ఎక్కువ లాభాలు ఆశించితే ఎక్కువ ఉత్పత్తి చేయాలి. అందుకు ఎక్కువ కూలీలను పెట్టాలి అనగా కూలీలకు గిరాకీ తగిలి కూలి పెరుగుతుంది. ఆశించిన లాభా లుండకపోతాయి. కొత్త యంత్రాలు తెచ్చి కూలీలను తగ్గించాలి. కాని అదనపు విలువకు, అనగా లాభానికి జన్మస్థలం, ఐన కూలీల శ్రమపాలు తరిగి లాభపరిమాణం తగ్గి, కొత్త యంత్రాలుకోరిన భారీపెట్టుబడి మొత్తాలమీద లెక్కచూచుకొంటే లాభశాతంగా యింకా యింకా పడిపోతుంటుంది. పోటీలో కొత్తయంత్రాలు చొప్పించక తప్పదు గాని యాంత్రీకరణ ఇటువంటి లాభశాతాలను పడగొట్టడమే గాదు, అటు కూలీలను నిరుద్యోగంలోకి విసిరేసి, కూలిపడగొట్టి దారిద్ర్యాన్ని కూడా పెంచుతుంది. ఎక్కువసరుకునీ, ఎక్కువదారిద్ర్యాన్నీ తక్కువలాభశాతాన్నీ తయారుచేస్తుంది.సంఘంలోసరుకును కొనే శక్తిలోపిస్తుంది, ఆర్థిక వ్యవస్థపని చేయనిఫలమవుతుంది. దుర్భరదారిద్ర్యంలో పడినకార్మికులు విప్లవంతప్పకచేస్తారు.ఇది తార్కికనమూనాయేకాదు, అనుపతర్కమని పించుకొన్న గతితార్కికపు నమూనాకూడాను. ఆదర్శవర్తవగల పాత్రంతోనే ఇది గ్రీకు విషాదాంతనాటకమై పూరుకొంటుంది యథార్థజగత్తులో సకలదుర్నీతికి సహస్ర దౌర్బల్యాలకు నిలయమై వుండే యీ వ్యవస్థ ఇంకా సత్వర వినాశం చెందవలసిందే యని దానిమరణగడియలు లెక్కిస్తూ మార్క్సు ఎదురుచూశాడుగాని దుర్నీతిమయమై అర్థాయుపుగా చావాల్సిన యీ వ్యవస్థ సజీవంగా వుండి మార్క్సు శతవర్థంతిని గేలి చేస్తున్నట్లుగా నిల్చివుంది. పదేళ్ళకోసారి పట్టిపీడించే సంక్షోభాన్ని నలభై యేళ్ళగా రానీయకుండా చూస్తూ, రోగ చిహ్నాలు కనపడగానే చికిత్సాచర్యలు తీసుకొంటూ ఆరోగ్యం పుంజుకొని నిలబడుతోంది. ఆవిరిశక్తి ఒక్కటే యంత్రాలను నడిపే కాలములో యాంత్రికీకరణవల్ల లాభశాతం పడిపోకతప్పదని మార్క్సు సూత్రిస్తే అణుశక్తిదాకాగల బ్రహ్మాండమైన యంత్రాలమీద అపారమైన పెట్టుబడి లాభశాతాన్నిపడి పోకుండా నిలబెట్టుకోగలవ్యవస్థగా తయారై వుంది.తర్కం యథార్థంయొక్కస్థానాన్ని ఆక్రమించజాలదు.

ఇప్పుడొకమాట చెప్పుకోవచ్చు. కాపిటల్ చదివి దానిలో సమాచారభారం చూచి ఆశ్చర్యచకితులమైనతర్వాత 1843లో పిల్ల ఎంగెల్సు గీసిన బూర్జువా అర్థశాస్త్ర విమర్శ సూత్రరేఖలను కాస్త చూస్తే ఆ ఆశ్చర్యమంతా ఇంకిపోతుంది. పిల్ల ఎంగెల్సు గీసిన ఆ నాలుగుగీతల స్కూలచిత్రాన్నే కాపిటల్ భూతద్దంలోలాగా పెంచివేసి, సూక్ష్మ సూక్ష్మమైన వివరాలతో నింపి చూపించిన బృహచ్చిత్రమనిపించుతుందో లేదో ఒక్కసారి చూడమనవచ్చేమో! మచ్చుకొక పేరా ఇంగ్లీషు అనుబంధంలో యిచ్చివుంది. చదవండి. తర్వాత ఆ వ్యాసమంతా చదవండి.

నవ్యతర్కమైన గతితర్కం నవ్యవిజ్ఞానమని, మార్క్సు నవగాహనజేసుకొనేందుకు అది తప్పక అవసరం కాగలదన్న విశ్వాసం అచంచలంగా కుదుర్చుకొని, మార్క్సే సారంగాగల ప్రకృతిక్రమాల అధ్యయనం ఇక అదిలేకుండా నడవదని, గడవదని చెప్పబూనుకొని, లాక్షణిక తర్కసాధనంతో కనుగొని క్రోడీకరించిన విజ్ఞానశాస్త్రాలకు గతితార్కిక భాష్యకల్పనా వైదుష్యం వెలయించి, మానవతకు జన్మించిన సోషలిజాన్ని కర్కశ గతితర్కపుమూసలో ఎలాగోపట్టించి, ఆ గతితర్కాన్ని సైన్సనుకొని, సైన్సు శోధననాళికలో తయారుచేసిన శిశువుగా చూపించడం ఆ సోషలిజం వ్యాప్తికి ఉపకరిస్తుందని తలంచారు. ప్రతికొత్త సిద్ధాంతంకూడా అధునాతన విజ్ఞాన పురస్కృతంగా వెలువడటం గమనించిన తమదలా వెలువడకపోయి మునుపు ఎప్పుడో తయారైన పాత సిద్ధాంతాన్ని కొంతకాలం తర్వాత, కావాలని ప్రత్యేకంగా ప్రయత్నించి అత్యంత ఆధునిక విజ్ఞాన గర్భగోళంలో ఆరోపింతీసుకొని, ఎదిగి, వెలువడినట్టిదిగా చూపించడానికి ఎంతో పరిశ్రమించారు. ఆ పరిశ్రమ ఉపకరించిందికూడా.

“ప్రతి నూతన సిద్ధాంతంవలెనే, నవీన సామ్యవాదం ప్రథమతః అనాటికి అందుబాటులోకి వచ్చివున్నట్టి విజ్ఞానసామగ్రి (intellectual material) తో అనగలుపు (link) కొన్న”దని స్పష్టంగా వారు చెప్పుకొన్నమాటను ఈ పరిచ్ఛేదం మొదట యిచ్చిన ప్రవేశవాక్యం ప్రకారమే మార్క్సీయ సోషలిజం సైన్సుతో నడుమగా లంకె తగిలించుకొన్నదేగాని అది జన్మానుబంధం కలది కాదు. అది కృతకమైన అవాంతరబంధం తమ చారిత్రక ఆర్థికసిద్ధాంత నిర్మాణంలో తార్కిక(కాల్పనిక) పద్ధతి అంటూ ఒకదానికి తావిచ్చి దాని ప్రాశస్త్యాన్ని చెప్పుకోవటం చూచాము. అది విజ్ఞానశాస్త్రాలబాటమాత్రం కాదు, మూర్తిమంతమైనతర్కమే ప్రకృతి-ప్రకృతి, చరిత్ర సర్వంతర్కప్రాయం అన్న విశ్వాసం చొప్పున నడపనబాట అది. తర్కం యథార్థాన్ని సూచించే పరికరమేగాని యథార్థానికి ప్రత్యామ్నాయంకాదు. పాత లాక్షణికతర్కం గణితంలో విజృంభించి విశ్వరూపందాల్చి నూతనపరికరపై గ్రహాంతరయాన యుగాన్ని పారదెరచింది గతితర్కం నిరర్థకంగా వుండిపోయింది. విజ్ఞానశాస్త్రాల విజయయాత్రలో దానిపాత్ర సున్న. దాన్ని స్వీకరించడంచేతే ఈ ఫలితాల్ని కనుగొనవీలయింది అనిచెప్పే వైజ్ఞానికుడులేడు. అది సైన్సుకాదు, సైన్సు ఆభాస-అది తర్కంకాదు, తర్కాభాస. అవునో కాదో మతిమంతులు ఆలోచిస్తారుగదా!

# ANNEXURE

## ON SPACE, TIME, MATTER AND MOTION

### Hegel : Natural Philosophy

Space and time are filled with matter. Space is not conformable to its motion; hence it is concept of space itself that creates its existence in matter. Often a begining has been made with matter and then space and time regarded as forms of matter *What is correct is that matter is the real in regard to space and time. But the latter, on account of their abstraction, has to appear to us here as primary and then it must be shown that matter is their truth.*

Just as there is no motion without matter, so also there is no matter without motion. Motion is the process, the transition from time into space and vice versa. Matter, on the other hand, the relation of space and time, as latent identity.

### Feuerbach : Essence of Religion

Although --- Man has abstracted space and time from spatial and temporal things, nevertheless he presupposes those as the primary grounds and conditions of the latter's existence. Hence he thinks of the world i. e. the sum of real things, matter-as having its origin in space and time. Even Hegel makes matter arise not only in, but out of space and time. Also it is really incomprehensible why time, seperated from temporal things should not be identified with God "*Time outside temporal things = God*" In reality, exactly the opposite holds good —— *it is not things that presuppose space and time, but space and time that presuppose things,* for space or extension presupposes something that extends

and time, movement for *time is, indeed, only a concept derived from movement, presupposes something that moves*. Everything is spatial and temporal."

(Lenin's Philosophical Note-Books)

DUHRING :- According to Herr Duhring, *time exists only through change, not change in and through time - Engels*

NAGELI :- We can only know the finite, transitory, changing and what differs in degree, the ralative etc., (as far as) we do not know what time, space, force and matter, motion and rest cause and effect etc." - Engels

ENGELS :- The empiricist becomes so steeped in the habit of empirical experience that he believes that he is still in the field of sensuos knowledge when he is operating with abstractions.

We know what an hour is or a meter but not what time and space are; As if time was anything other than just hours, and space anything but just cubic meters. The two forms of matter are naturally nothing without matter, empty concepts, abstractions which exist only in our minds. But, otf course, we are also not supposed to know what matter and motion as such have not, for matter as such and motion as such have not yet been seen or otherwise experienced by anyone but only the various actually existing material things and forms of motion."

(Dialectics of Nature)

## Lenin :

Lenin makes Engels appear as rendering Feuerbach truthfully citing them both along with his commentary :-

"Space and time" says Feuerbach "are not mere forms of phenomena but essential conditions - -of being."

"The basic forms of all being" Engels admonished Duhring "are space & time and being out of time is just as gross an adsurdity as being out of space."

"Why was it necessary for Engels in the first half of the quotation to repeat Feuerbach almost literally, and in the second, to recall the struggle which Feuerbach fought so successfully against the gross absurdities of theism? Because Duhring could not make his philosophy hang together without resorting now to the final cause of the world, now to the initial impulse."

"In modern physics, he (Mach) says, Newton's idea of absolute time and space prevails of time and space as such. This idea seems "to us" senseless, Mach continues - apparently not suspecting the existence of materialists and of a materialist theory of knowledge."

"Natural science was seeking, both in 1872 and in 1906 & is now seeking and is discovering-at least it is groping its way towards-the atom of electricity, the electron, *in three dimensional space.* Since 1872, ————, dazzling scientific successes in the problem of the structure of matter, the materialist view of space and time has remained harmless i. e. compatible, as here before with natural science, while the contrary view of Mach and Co. was a "harmful" capitulation to the position of fideism."

"Recent mathematics," Mach says, "has raised the very important and useful question of a space ofn-dimensions as a conceivable space, nevertheless, only three - dimensional space remain the "real case."

(Materialism and Empirio - Critcism)

—Was Lenin right? was his formulation of the question, and discussion, relevant to the state of knowledge in science in 1908? Was Engels truthful to Feuerbach and Hegel? Judge for yourself.

—Don t you see, Lenin and Engels differ from all others, and that the rest look better before Relativity ?

## Lenin Uncomitted on Timiryazev's Account of Einstein

While Timiryazev *was obliged to observe* in the *first number* of the magazine that the theory of Einstein, who, *according to Timiryazev,* is himself not making any active attack on the foundations of materialism, has already been seized upon by a vast

number of representatives of the bourgeois intelligentsia of all countries, it should be noted that this applies not only to Einstein but to a number, if not to the majority, of the great reformers of natural science since the end of the nineteenth century.

March 12, 1922.

—Did Lenin agree with Timiryazev's version of Einstein?

## Engels on Feuerbach's Ignorance of Science

"Life is, of course, not the product of a chemical process, nor, in general, is it the product of an isolated natural force of phenomenon, to which the metaphysical materialist reduces it, it is a result of the whole of nature."

—Feuerbach in 1846, from his rural seclusion

"That life is a result of the whole of nature in no way contradicts the fact that protein, which is the exclusive independent bearer of life, arises under definite conditions determined by the whole inter--connection of nature, but arises precisely as the product of a chemical process. Had Feuerbach lived in conditions which permitted him to follow even superficially the development of natural science, it would never have happened that he would speak of a chemical process as the effect of an isolated force of nature. (Dialectics of Nature.) (1886)

## Marx and Engels, Establishing Their own Ignorance in 1844-45. From Paris

"The *specific property of the atom* is that, *it has no properties* and is therefore *not* connected with beings outside it by any relationship determined by its own natural necessity. *The atom has no needs, it is self-sufficient.*" —Holy Family. Marx.

## Engels' Judgement of Science, Scientists, Philosophy & Philosophers

## And Also His (Inter) Nationalism

(1) Nevertheless, the bulk of natural scientists are still held fast in the old metaphysical categories and helpless when

these modern facts which so to say prove the dialectics in nature have to be rationally explained and brought into relation with one another. And here thinking is necessary; atoms and molecules etc., cannot be observed under the microscope, but only by the process of thought, Compare the chemists (*except for (1) Schorlemmer, who is acquainted with Hegel*) *and (2) Virchowis cellular, pathology,* where in the end the helplessness has to be concealed by general phrases. Dialectics divested of mysticism becomes an absolute necessity for natural science, which has forsaken the field where rigid catagories sufficed, which represent as it were the lower mathematics of logic, its everyday weapons. Philosophy takes its revenge posthumously on natural science for the latter having deserted it; and (3) *Yet the scientists could have seen even from the successes* in natural *science achieved by philosophy that the latter possessed something that was superior to them even in their own special* sphere (Leibniz - the founder of the mathematics of the infinite, in contrast to whom the *inductive ass Newton* appears *as a plagiarist and* corrupter; Kant-the theory of the origin of the universe before Laplace; Oken-the first in Gemany to (4) *accept (!) (not to discover)* the theory of evolution; Hegel whose comprehensive treatment and *rational grouping of the natural sciences (!)* than all materialistic nonsense put together).

—Dialectics Of Nature (1873)

—"But according to Leibniz, of all mathematics upto the time of Newton (*since the genesis till 1800)* the more important half is due to Newton."

— MEN OF MATHEMATICS, E. T. BELL

—"In one person, he (Newton) combined the experimenter, the theorist, the mechanic and, not least, the artist in exposition"-

—Einstein, in his preface to Newton's Opticsl

———

2) In opposition to the deification of Newton which was handed down from the French of the eighteenth century and the English heaping of honours and wealth on Newton, *Hegel brought* out the fact that Kepler, whom Germany allowed to starve, was the real founder of the modern mechanics of the celestial bodies, and that the Newtonian law of gravity was already contained in all three of Kepler's laws; in the third law even explicity. What Hegel proves by a few simple equations in his natural philosophy appears again as the outcome of the most recent mathematical mechanics in Gustav Kirchhoff's Lectures on Mathematical physics, and in essentially the same simple mathematical form as had first been developed by Hegel. The natural philosophers stand in the same relation to consciously dialectical natural science as the Utopian to modern Communism, *Foot Note 1 by Engels, preface to Anti-Duhring, 1885.*

But Gauss, the prince of maths, writing to his friend Schumacher, on 1 November, 1844, says : 'You see the same sort of thing (mathematical incompetence) in the contemporary philosophers Schelling, *Hegel,* Nees Von Essenbeck, and their definitions? Read in the history of ancient philosophy what the big men of that day-Plato and others (I except Aristotle)--gave in the way of explanations. But even with Kant himself it is often not much better."

"When he wrote this (in 1844, Gauss has long been in full possession of non-Euclidean geometry, itself a sufficient refutation of some of the things Kant said about 'space' and geometry, and he may have been unduly scornfull."

—(1) Can you find out a single discovery to the credit of this great German dialectical scientist, Mr. Schorlemmer?

—(2) Can you agree with Engels' remark against Virchow's work ?

— (3) Is this not repudiation of the original stand that Philosophy is no more a science standing above sciences as science of sciences in all its superciliousness? Is it not that Engels means philosophical guidance & dictation to science?

— (4) Can you agree that acceptance of the discovery is a greater achievement than the discovery itself ?

3) The French need a thrashing. If the Prussians win then centralization of the state power useful to the centralization of the German working class. Furthermore, German predominance (in Europe) would transfer the center of gravity of the West European labor movement from France to Germany, and one need only compare the movement from 1866 to the present in the two lands to see that the German working class is superior to the French in theory and organization, Its predominance over the French, on the world stage, would, at the same time, be the predominance of our theory over that of Proudhon ...... Marx in his letter to Engels in 1870 just before Paris Commune.

In the end, Alas, Prussian arms invoked to establish Marx's theory in France in place of Proudhan's long after his death even.

## Engels On Need Of Dialectics For Science

The natural scientists who have learnt to think dialectically are still few and far between, and hence the conflict between the discoveries made and the old traditional mode of thought is the explanation of the *boundless confusion* which now reigns in theoretical natural science and reduced both teachers and students, writers and readers, to despair.-1877 Anti-Duhring.

—Was there that boundless confusion in sciences then? And was it cleared by Engels or his dialectics ?

"It may be, however, that my work to a great extent or even altogether, superfluous."...."The old, regid antagonisms, the sharp impassable dividing lines more and more disappearing."

"It is possible to come to this recognition because the accumulating facts of natural science compel us to do so; but we come to it more easily if we approach the dialectical character of these facts equipped with the understanding of the laws of dialec-

tical thought. In any case, natural science has now advanced so far that it can no longer escape the dialectical synthesis." - (1885)

"To a large extent that process is already going on particularly in biology."

— Anti-Duhring-Old preface, (1878)

-----Don't you see that, not only his work on dialectic, became superfluous as admitted by Engels, but also any need for dialectic is not felt or recognised in sciences and science is progressing well without the dialectic but with formal logic?

———

## Hegel - Dialectic and Science

Since 1781 when Sir William Herschel (1738-1822) discovered the Planet Uranus, thus bringing the number of Planets then known up to the philosophically satisfying seven, astronomers had been diligently searching the heavens for further members of the sun's family, whose existence was to be expected, according to Bode's law, between the orbits of Mars and Jupiter.

By one of the most ironic verdicts ever delivered in the agelong litigation of fact versus speculation, the discovery of Ceres coincided with the publication by the famous philosopher Georg Wilhelm Friedrich Hegel (1770-1831) of a sarcastic attack on astronomers for presuming to search for an eighth planet. "Would they but pay some attention *to philosophy*, Hegel asserted they must see immediately that there can be precisely seven planets, no more, no less. Their search therefore was a stupid waste of time."

Ceres was rediscovered, precisely where the marvellously ingenious and detailed calculations of the young Gauss had predicted she must be found, Pallas, Vesta, and Juno, insignificant sister planets of the diminutive Ceres, were quickly picked up by prying telescopes defying Hegel, and their orbits too, were found to conform to the inspired calculations of Gauss.

—From **MEN OF MATHEMATICS, E.T. BELL.**

## Engels on how they made Socialism a Science ?

"Modern socialism is, *in its content*, primarily the product of the perception, on the one hand, of the class antagonisms existing in modern society, between possessors and non–possessors, wage workers and bourgoies and on the other hand of *the anarchy ruling* in production. In *its theoretical form*, however, it originally appears as a further and ostensibly more consistent extension of the principles established by the great French enlighteners of the eighteenth century" — Anti-Duhring

— Is it not that socialism as the product of the perception of the class antagonisms and of anarchy in production was also a pre–Marxian phenomenon actually? Is it not that Fourier was the first to point out to the anarchy in production calling it a crise plethora and that the theme of class antagonisms was much older in the history of socialism?

* * *

" Like every new theory, *It had at first to link itself* on to the intellectual material which lay ready to its hand, however deep its roots lay in (material) economic facts. " -Anti-Duhring

——— Does the ' Intellectual Material ' include science also among other things? Is it not just a matter of mere external link with science etc. that Engels was speaking about? Does this not testify to the quality and nature of their effort, after a quarter of a century after founding their specific theory, to interpret science in the interests of socialism?

* * *

" *In order to make a science of socialism,* it had first to be placed upon a real basis. Meanwhile, along with and after the French philosophy of the eighteenth century, the newer German philosophy had arisen, terminating in Hegel. Its greaterst merit was the *re-adoption of dialectics as the highest form of thinking.*-Anti–Duhring.

— So it is re–adoption of dialectic that made their socialism a science. If it is so, is it not Proudhan who initiated it and Marx that completed it?

These two great discoveries, the materialist conception of history and the revelation of the secret of capitalist production by means of surplus value, we owe to Marx. With these discoveries socialism became a science." — ANTI - DUHRING, 1877

— So, after resisting for long,; Marx could convince himself to become a convert to communism without these 'scientific' discoveries and after sometime, he could simply invert Hegel's concept of history in terms of labour, means of production etc and make it materialistic without much of economic stuff and without unlocking the secret of the exploitation in the society since the dawn of history and that he could do it only after a decade and a half ?

## Young Engels' Analysis of Capitalism in 1843

———

As long as you continue to produce in the present unconscious, thoughtless manner, at the mercy of chance - for just so ong, trade crises will remain, and each successive crisis (1) is bound to become more universal and worse than the preceding one (2) is bound to impoverish a larger body of small capitalists, and to augment, in increasing proportion, the numbers of the class who live by labour alone, thus considerably enlarging the mass of labour to be employed (the major problem of our economists) and finally causing a social revolution such as has never been dreamt of in the philosophy of the economists.

(3) Large capital and large landed–property swallow small capital and small landed - property - i. e., centralisation of property.In crises of trade and agriculture, this centralisation proceeds much more rapidly (4) The middle classes much increasingly disappear until the world is divided into millionaires and paupers, into large landowners and poor farm labourers. All the laws, all the dividing of landed property, all the possible splitting - up of capital are of no avail, this result must and will come, unless it is anticipated by a total transformation of social condition a fusion of opposed interests, an abolition of private property.

—OUTLINES OF A CRITIQUE OF POLITICAL ECONOMY

Dr. V. VENKTESWRA RAO, D. Sc.,
Professor and Head, Department of Physics
Chief Investigator, Electronics Commission
and Defence Research Schemes.

Regional
Engineering College,
WARANGAL-506004
INDIA

Date 27-1-'83

My dear venkateswara Rao,

I have gone through the manuscript which you have given me for my perusal. I admire your capacity to collect and interpret massive and modern science with desirable clarity.

I have been entertaining the same doubt as what way the Soviet Scientists achieved greater things in the field of scientific research, being in the world of dilectical materialism, than the western scientists. Their vain attempt to get everything on the face of the earth under the perview of dilaectical materialism appears to be in no way different from the present day God-men in India trying to interpret religion in terms of scientific principles and laws.

So far I did not know their antagonism towards the theory of Relativity. It is really astonishing. Recently I have discussed some of these points with a few of Indian Communists, supposed to be theoreticians, but no purpose was served. Those who do not wish to take dilectical materialism as faith should find a sharpener to their views in your writing.

Before you take up further writing on these lines, I suggest that you better go through a book, Dialectical Materialism in Modern Physics.

With best wishes,

Yours Sincerely,

Sd. V. VENKATESWARA RAO

Dr. Y. VENKATESWARA RAO M. Sc., Ph. D.,
Principal, A. N. R. College
GUDIVADA - 521301

12 8-83

Dear Venkateswara Rao,

Thank you for sending me a rough copy of your book.

Your presentation of facts and arugments is both scholarly and critical, though to some, it may be abrasive. Any reader with an open mind should find it highly stimulating and thought provoking.

I particularly like the chapter dealing with dialectical materialism and its irrelevance to scientific development. I ha e immensely enjoyed reading the book and I commend it to any body who welcomes Brave New Ideas.

Yours Sincerely,

Sd. Y. VENKATESWARA RAO.